


విరోధి సం.<br>జ్యేష్ఠము

# భారతి

సంపుటము 26<br>సంచిక 6


# ఆశ్వాసం


శ్రీ హనుమచ్ఛాస్త్రి


అన్యాయం తెలిసోయకు,<br>
అపకీర్తిసి రావానకు,<br>
ఈర్ష్యాభువు కను వేడికి,<br>
ఇకిలింతల దాడికి,<br>
అగ్గమైన మనుగడతో—<br>
భగ్గుమన్న మనస్సుతో—<br>
లెక్క—చేయకుండా, అన్నా!<br>
ఎక్కడికయ్యా పోతావ్ ?

..................

"ముదిసిన ధర్మం తలపై<br>
పుణ్యజనులు కట్టించిన<br>
సరికొత్త సమాధిమీద<br>
చాలా శిల్పం ఉందట<br>
చూడా లని వెడుతున్నా—<br>
కూడా వస్తావా?"

..................

ఎంత చచ్చినా ధర్మం అంటే<br>
సుంత భయం నాకు—<br>
కుంటిది న్యాయం, వెను<br>
వెంట నడవగా—<br>
గుడ్డి 'నిజం' ప్రశ్నార్థపు<br>
కోటు తొడుక్కుని పాపం!<br>
కర్మసాక్షి 'లౌక్యం'గా<br>
కళ్లన్నీ మూసుకుంటే—<br>
మాయదారి వద్దని స<br>
న్మార్గంకోసం తడుముతుంది!<br>
మః షి. దగ్గరా ఈ వేషాలు??<br>
ధర్మంకోసమని వెళ్లి

బ్రహ్మంగారింట్లో పడింది—
తోవ దొరకదయ్యా: ఎందుకు
దేవులాడతావ్?

...............

"నిజమయ్యా—నీ వన్నది.
కాని—
ధృతరాష్ట్రపరీరంభం
కత విన్నావా?
ఆచి ఆచి ఆవలించి
లేచి 'నిజం' కన్ను తెరిచి
చూచిన—ఈ నీలిజగతి
కాచాండంలాగు నలిగి
కీచుకీచుమంటుంది.
భీముళ్లూ 'గామా'లూ
రామాయణ రాక్షసులూ
పళపళమని విరిగి నురిగి
కలికంలోనికి సైతం
కనబడకుండా పోతారు.

...............

ధర్మానికి మూర్ఛ ఒదిలి
కర్మసాక్షి నిజం పలికి
సత్యరథంనేమి కదలి
స్వార్థం కౌటిల్యం క్రౌర్యం
నవసీ నలిగి ధూళి రేగ,
మాయానటరాజు 'మనిషి'
మర్మకంచుకం ప్రిదిలి
అమృతమూర్తి ఆదినరుడు
అవతరించు పుణ్యదినం
వస్తుం దయ్యా, తప్పదు.
విశ్వం ఒక చక్రం!"

...............

ఏమో—ఏమేమో నా
కేమీ అర్థంకా వీమాటలు,
ఎండమావిలో ప్రవాహం,
కొండొక ఊహావ్యామోహం

...............

అంటావని నాకూ తెలుసు
ఆంధ్రోద్యమంలా—అచ్చంగా;
ఏకవిమాటల 'కర్థం'
ఇచ్చిందయ్యా-లోకం?

('జ్వాలాతోరణం' నుంచి.)

# నన్నిచోడుని కుమారసంభవము

ప్రతులు - పాఠములు

●

శ్రీ కోరాడ రామకృష్ణయ్య

నన్నిచోడదేవుని కుమారసంభవము మొట్టమొదట క్రీ. శ. ౧౯౦౯-౧౯౧౪ సంవత్సరములలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచే ప్రకటింపబడిన తోడనే ఆంధ్రసాహిత్యలోకమున నొక నూతనసంచలనమున కది కారణ మైనది. ఆ కవినిగూర్చి, ఆతని కాలమునుగూర్చి, ఊరునుగూర్చి, పేరును గూర్చి, కవితనుగూర్చి, కావ్యభాషనుగూర్చి, ప్రతులనుగూర్చి, పాఠములనుగూర్చి అనేకవిమర్శనలు, చర్చలు బయలుదేరినవి; బయలుదేరుచున్నవి. ఇంకను ఎన్నో బయలుదేరవలసియున్నవికూడాను. అట్టి సాహిత్యచర్చకు, చారిత్రికపరిశీలనమునకు, భాషా సంప్రదాయపరిశోధనమునకు ఎంతయు దగినదే యీ కావ్య మనుట కేమాత్రము సందేహము లేదు. కాని వీని కన్నింటికి మూలాధార మైనది అసలు గ్రంథము గదా. దీని తాళపత్రప్రతి యొక్కటిమాత్రమే తంజావూరుసరస్వతీమహల్ పుస్తకభాండారమున గలదు. మరియొకటి శ్రీ కవిగారియొద్ద గల దందురు గాని యది యితరులకు లభ్యము కాలేదు. ప్రాచీనలాక్షణికులలో ప్రసిద్ధు లెవ్వరు నీ కవిగ్రంథము నుండి యుదాహరించి లక్షణవిమర్శనము చేసినవారు కానరారు. కావుననే యీతనిపే రింతకాలము మరుగు పడిపోవుటయు దటస్థించినది.

ఈ కారణముచే తంజావూరుప్రతియొక్కటియే యీ గ్రంథమునకు గల మూలాధార మగుచున్నది. తరువాత కవిగారి ముద్రితగ్రంథము, అందు వా రిచ్చిన పాఠభేదములు గ్రహింపదగినవి. వీ రిచ్చిన పాఠాంతరములలో పెక్కు తంజావూరిప్రతిపాఠములతో సరిపోవుచునేయున్నవి. కాని తంజావూరిప్రతిలోనే కొన్నిచోట్ల గ్రంథపాతములు మొదలగునవి కనబడుచుండుటచే నాయా స్థలములందు ప్రత్యంతరము లేక పోవుటచేత ఎవరికి తోచినట్లు వారు పూరించవలసియే యుండును. అయితే ఇటీవల నా తంజావూరిమూలగ్రంథమునకు కొన్ని పుత్రికలు బయలుదేరినవి. అం దాంధ్రసాహిత్యపరిషత్తువారు వ్రాయించిన దొకటి. ఇదే తొలుత బయలుదేరినదిగా గనబడును. తరువాత మద్రాసు యూనివర్సిటీవారు వ్రాయించి తెప్పించినది మరియొకటి కలదు. శ్రీ వేటూరి వెంకటరమణయ్యగారు వ్రాయించి తెప్పించుకొనినది యింకొకటి కల దని చెప్పుదురు. ఇప్పటికి నాకు తెలిసినంతవరకీ మూడు ప్రతులును తంజావూరిమాతృకనుండి యేర్పడినవే. మరికొన్ని దీనినిబట్టి వ్రాయబడిన వుండిన నుండను వచ్చును. ఈ ప్రతులు వ్రాసినవారి సంస్కారభేదమునుబట్టి యీ ప్రతులలోగూడ మార్పు లేర్పడియుండవచ్చును. తాటియాకుగ్రంథమునుండి మరల వ్రాయునపు డందలి యక్షరములు తెలియక కొన్ని, అర్థము తెలియక కొన్ని, పొరపాటున కొన్ని, అర్థము పొసగించుటకై వ్రాయువారు చేయు సంస్కరణము మూలమున చేర్పడునవి కొన్ని—ఈ రీతిగా నొక్క మాతృకనుండియే యేర్పడిన పుత్రికలలో ననేకభేదము లేర్పడుట కవకాశము కలదు. వారి భాషాసాహిత్యసంప్రదాయములలోని దృక్పథములు భిన్న మైనచో, తదనుకూలముగ జేయబడు సంస్కారములు మరికొన్ని యేర్పడవచ్చును. కవియొక్క దేశకాలసంస్కారాదులను గూర్చి తమకు గలిగిన అభినివేశముల కనుకూలముగ జేయబడు సంస్కారాదుల మూలమునగూడ కొన్ని పాఠభేదము లేర్పడవచ్చును. ఇట్టిరీతిని ఒక్కమాతృకనుండియే బయలుదేరిన పుత్రికలలో నేర్పడు పాఠభేద

ములను పరిశీలించి, కవి యుద్దేశించిన పాఠ మిది యని నిర్ణయింప దొరకొనుట వాస్తవముగా నసిధారావ్రతము వంటిదే. మొత్తము గ్రంథమునంతను సూక్ష్మపరిశీలనము చేసి ఆకవి యవలంబింపదలచిన కవితాసంప్రదాయ పద్ధతులను గనిపెట్టి నిర్ణయించుకొనగలిగినగాని, ఆ పాఠభేదములను తప్పు లని దిద్దుటకును, ఒప్పు లని, ఆ కవికి సహజసంప్రదాయసిద్ధము లని గ్రహించుటకును గూడ వీలుపడదు. ఇట్టి స్థితిలో నా మూలప్రతినుండి బయలుదేరు ప్రతికల సంఖ్య పెరిగినకొలదిని ఈ చిక్కు లింకను పెరుగుచునేయుండును. ప్రతులు పెరుగుటవలన గలుగు చిక్కులు భారతాదిగ్రంథముల విషయమున కొంతవరకు తెలియుచునే యున్నవి. అట్టి చిక్కులే యీ గ్రంథమువిషయమునగూడ గలుగకుండ నాంధ్రసాహిత్యవేత్తలు జాగరూకత వహించుట యుక్తము గదా. ఇప్పటికి లభ్యమగుచున్న మూలప్రతి యనదగినది తంజావూరు తాళపత్రప్రతి యొక్కటే. తక్కిన వ్రాతప్రతులుగాని, ముద్రితగ్రంథములు గాని దాని నాధారము చేసికొని బయలు దేరినవే. కావున నిప్పుడే—వీనిలో గలిగిన పాఠభేదము లెట్టివో, అవి యెట్లు బయలుదేరినవో, మూలప్రతిలోని పాఠములతో నివి యెంతవరకు సంవాదము కలవై యున్నవో పరిశీలించుకొని ఇప్పటికి దొరికిన మూలగ్రంథములోని వ్రాతలో గల పొరపాటు లేవో, తరువాత బయలు దేరిన వేవో, తేల్చుకొనగలుగలేక పోయినట్లయితే, మరికొన్ని ముద్రణములు బయలుదేరునప్పటికి పాఠ నిర్ణయ మనునది గహనాతిగహనము కాకమానదు.

శ్రీ రామకృష్ణకవిగారి తొలిముద్రణముతరువాత దీని ముద్రణమునకై ప్రయత్నించినవారు మద్రాసు యూనివర్సిటీవారు. దీనిని పునర్ముద్రణము చేయు నుద్దేశముతోడనే తంజావూరుగ్రంథమునకు ఒక ప్రతి వ్రాయించి చిరకాలముక్రిందటనే తెప్పించి పెట్టినారు. ఆప్రయత్నములోనే అప్పుడు తెలుగు శాఖలో జూనియర్ పండితులుగా నుండిన కీ. శే. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలుగారొక విమర్శనము ప్రకటించుట, ఇచ్చటి వ్రాతప్రతిలో సందేహముగా నుండినపట్ల మూలప్రతినే ప్రత్యక్షముగ జూచి పాఠ నిర్ణయము చేయు నుద్దేశముతో వారు తంజావూరు వెళ్లి మూలప్రతిని పరిశీలించి వచ్చి, అచ్చుప్రతి సిద్ధముచేసి ముద్రణము ప్రారంభించుట సంభవించినది. కాని ఈ నడుమ గలిగిన యనేకములగు నవాంతరపు చిక్కులచే నా గ్రంథము సత్వరముగా వెలువడుట కవకాశము కలుగకపోవుట శోచనీయమే. శ్రీ కవిగారియొద్ద తొలి ముద్రణపు ప్రతులన్నియు నమ్ముడువోయి, దేశమున నా గ్రంథమే లభ్యముకాని స్థితి గలుగుటచేత, వారే గాక యితరు లనేకులు పునర్ముద్రణము చేయ తహతహ గలవారే యై యుండిరి. కాని కవిగారే యొకప్పు డన్నట్లుగా—యూనివర్సిటీ ముద్రితగ్రంథము బయలువడినగాని, అది చూచిగాని వీరు మరల దీనిని ముద్రింప బూనుకొనిన ట్లగపడలేదు. కాని దేశమున వలయు వారికి గ్రంథమే చిక్కకుండుటచేతను, విద్వాన్ మొదలగు పరీక్షలకు బోవు విద్యార్థుల యుపయోగార్థము ఈ నడుమ శ్రీ వావిళ్లవారు మొదటిరెండాశ్వాసముల నచ్చొత్తించి ప్రకటించిరి. అందు కీ. శే. శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారే యీ ముద్రితగ్రంథమునకు సవరణలను గావించి యిచ్చినట్లు తెలుపబడియున్నది. ఇటీవల గ్రంథమంతయు ముద్రణ నందినట్లుగూడ తెలియుచున్నది. కావున నిప్పటికి రెండు ముద్రితప్రతులు, మూడు వ్రాతప్రతులు బయలుదేరినవి. యూనివర్సిటీవారిది బయలువడిన నివి మూడు, నవి మూడు నగును. యూనివర్సిటీవారి ముద్రిత గ్రంథముకూడ కొద్దికాలముననే బయలుపడవచ్చును. కాని, శ్రీ కవిగారు ముద్రించిన గ్రంథమునకును, తరువాత రెండవ భాగములో వారిచ్చిన పాఠభేదములకును గనబడు వ్యత్యాసమే (ఇవి వారు మరియొకప్రతిలోని పాఠము లని చెప్పినవిగూడ) ఆశ్చర్యకర మగుచుండగా, శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారి చేతనే సవరింపబడిన రెండు భిన్నముద్రణములలోని పాఠములుగూడ భేదించుచుండుట మరింత ఆశ్చర్యజనకము కాకమానదు. సవరణలు లేకపోగా అచ్చుతప్పులు కూడ మిక్కుటముగా జేరినవి. అయితే ఇది కాలభేదమునుబట్టి, వ్యక్తులలో గలుగు అనుభవసంస్కారభేదమునుబట్టి యేర్పడుచుండు ననియు తలంపవచ్చునేమో. ఏది యైనను అపూర్వముగా దలంపబడిన

రొక గ్రంథమున కొక్కటే మాతృప్రతి కనబడుచుండి
నపుడు, దానినే యాధారముగా చేసికొని ముద్రణము
నందిన మూడుగ్రంథములలోను కొన్నిచోట్లనైనను
మా దేశీవిధములగు పాఠములు కనబడినచో, నింత
యల్పకాలములోనే యిట్లయినపుడు, ఒక శతాబ్దితరు
వాత దీని స్వరూప మింక నెట్లు మారగలదో పండితు
లూహించుకొనవలసినదే. కాలక్రమమున నా తంజా
వూరి ప్రతిలో తాటియాకులలోని ముక్కలు రాలి
పోయి, యింకను గ్రంథపాతము లేర్పడవచ్చును.
అప్పుడింకను సంపాదకులయొక్కయు, ముద్రాపకుల
యొక్కయు స్వయంకవిత్వ మెక్కుడగుట, పూరణ
భాగములు పెరుగుచుండుట తటస్థింపగలదు. కావున
లభ్యమైన యీ యేకైకప్రతికైనా జాగ్రత్తగా ఫోటో
గ్రాఫ్ కాపీలు తీయించియుంచు ప్రయత్నము చేయ
వలయునని తంజావూరు సరస్వతీమహల్ పుస్తకభాండా
గారాధ్యక్షులను ప్రోత్సహింపవలసిన విధి ఆంధ్ర
సాహిత్యపరులదై యున్నది. దానిలో సంపాదకులు
దిద్దవలసిన భాగములు లేవని కాదు. అనేకము లుండ
వచ్చును. ఉన్నవి. కాని ఇప్పటికి ఏకైకమూల మన
దగిన దానిలో నున్న స్వరూప మెట్టిదో, ఇటీవల
వ్రాతలలోను ముద్రణములలోను బయలుదేరిన మార్పు
లేవో తెలిసికొనుటకు తగిన యాధార మున్నగాని,
కవ్యుద్దిష్టపాఠము, కవిహృదయము, ఆతని కవితా
సంప్రదాయము మొదలగువానిని గూర్చిన పరిశీలనకైన
నవకాశము లంతరించిపోవును. కావున నాంధ్రసాహిత్య
లోక మీ పాఠనిర్ణయవిషయమున, కవిసంప్రదాయ
ముల విషయమున నిప్పుడే శ్రద్ధ వహించుట యుక్త
మని తోచకపోదు.

ఇట్టి యుద్గ్రంథ మింతకాలము మరుగుపడి
యుండుటయే ఒక యపూర్వవిషయము. ఇదిగాక ఈత
డాంధ్రమున నాదికవి యని తలంపబడుచుండిన నన్న
యకు పూర్వుడైనను, పరమందలివాడైనను, భాషా
సాహితీవ్యవహారరీతులయందు భిన్న సంప్రదాయము
లోనివా డనుటకు సందేహము లేదు. ఆదృష్టితో నీతని
గ్రంథమును పరిశీలించినగాని ఆంధ్రభాషాసాహిత్య
చరిత్రలో నీ కవిరాజశిఖామణి కావ్యము యొక్క
ప్రాముఖ్యము వ్యక్తము కాదు. అయితే యీ ప్రాము
ఖ్యము తేటతెల్లమగుటకు కూడ అసలు గ్రంథము
నందలి పాఠనిర్ణయ మావశ్యకము. కావున ఓపినంతలో
దాని నుపక్రమింతము. ఎవరో ఒకరు దారి తీసినగాని
దానినిగూర్చి పండితులకు శ్రద్ధ గలుగదు; చర్చ బయలు
దేరదు. కవిహృదయము, కవిపాఠమును గుర్తింపగలుగు
టయే సాహితీపరుల కందరకు గావలసినది.

౧. కుమారసంభవము—మొదటి పద్యము.

"శ్రీవాణీంద్రామరేంద్రాచితమకుటమణి
శ్రేణి నా మాంఘ్రిపద్మ
తీవోద్యత్కేసరుండు......"
(అని యూనివర్సిటీ వ్రా.త.ప్రతి.)

"శ్రీవాణీంద్రామరేంద్రార్పితమకుటమణి
శ్రేణిరామాంఘ్రిపద్మ
తీవోద్యత్కేసరుండు......"
(అనికవిగారిముద్రితప్రతి.) 'కా' దిద్దుబాటు.

"శ్రీవాణీంద్రామరేంద్రార్పితమకుటమణి
శ్రేణికామాంఘ్రిపద్మ......"
(అని వావిళ్లముద్రణము.)

వీనిలో 'అర్పిత' అని యూ. ప్ర. లో
నన్నట్లే వావిళ్లముద్రణమున గలదు. కవిగారే
'అర్పిత' అని దిద్దినారు, అన్వయముకొరకు. 'అర్పిత'
మైనది మకుటము కాదు. అంఘ్రిపద్మముగనుక అన్వ
యము కుదరదు. శ్రీవాణీంద్రామరేంద్రులచే (అంఘ్రి
పద్మములయందు) నర్పింపబడినవి మకుటములు. వాని
యందలి మణిశ్రేణులయొక్క; నామా, కామా
అను శబ్దముల కర్థ మేమియు పొసగున ట్లగపడదు.
అది 'ధామా' కావచ్చును. కాంతులు. ఆ మణిశ్రేణుల
కాంతులే; అంఘ్రి పద్మము యొక్క అశీవము—
పోషణచేత, ఉద్యత్-పైకి లేచుచున్న (ప్రకాశించు
చున్న) కేసరములుగా గలవాడు. అనగా శ్రీవాణీం
ద్రామరేంద్రు లాతని పాదపద్మములకు మ్రొక్కగా,
వారి కిరీటములందలి మణిశ్రేణుల కాంతు లాతని
పాదపద్మములపై ప్రసరించుటచే, నా కాంతులే
పాదపద్మములనుండి పైకి ప్రసరించు కింజల్కములవలె

నున్న దని భావము. శివుని పాదపద్మములమీద పడిన మకుటరత్నకాంతులకు ఆ పాదపద్మములనుండి బయలు వెడలు కింజల్కములతో నభేదము సాధింపబడినది. రామా(పాఠము): మణిశ్రేణిచే, రామ=సుందరమైన, అభిరామమైన, అంఘ్రిపద్మముల ఆజీవము చేత ఉద్యత్కేసరం బనుట యుక్తముగా లేదు. మణిశ్రేణియే ఉద్యత్కేసరములుగా గలవా యనవలె. మణులే కేసరము లనుటకంటె, పాదపద్మములపై బ్రసరించిన మణికాంతులను, పద్మములనుండి పైకి వెడలిన కేసరములతో బోల్చుట యుక్తముగా గనబడకపోదు.

కన్నడమున రన్నగదాయుద్ధములో 'శ్రీవాణీంద్రామరేంద్రాంచితమకుటా' అని 'అర్చిత' అనుచో 'అంచిత'యని కలదు. అంచు-ధాతువునకు పూజార్థ మున్నను (అంచు గతిపూజనయోః) మకుట శబ్దముతో నా యర్థము నన్వయింపదు. కావున ఉంచబడిన - ఒప్పుచున్న అను గత్యర్థమును చెప్పుకొనవలసియున్నది. ఆ 'అంచిత' శబ్దసాదృశ్యము చేతనే తెలుగులో 'అర్చిత'వచ్చినదేమో. కవియే 'అంచిత' గ్రహించియుండునా? అను సందేహము కలుగకపోదు. 'అంచిత'కు బదులు 'అరుణ' అను పాఠ మొకటికూడ కనబడుచున్నది. కాని నన్నెచోడుని భావము పాదపద్మములవరకే గాక ఆ పద్మములలోని కేసరములవరకు బోయినది. మణు లా కేసరము లనుట యుక్తముగా గనబడదు. మణికాంతులు పాదపద్మములపై బడి వానినుండి పైకి లేచి, ప్రకాశించునపుడు ఆ మణికాంతులను కింజల్కములతో బోల్చుటచే కవిభావగాంభీర్యము వ్యక్తమగుచున్నది. కవిగారి ముద్రితగ్రంథములోని 'అర్చిత', 'రామా' అను పాఠములనుగూడ వదలివేసి వావిళ్ల ముద్రణములో 'అర్చిత', 'కామా' పాఠము లేల యాదరింపబడెనో తెలియదు. ఇది సవరణ గాబోలును.

"ఆశ్రితజనలసితా శేషవస్తుప్రదుండు" 'లస'-విలసనే-ప్రకాశించుట. లష-అభిలాషే. ఆశ్రితజను లభిలషించిన అశేషవస్తువులను ఇచ్చువాడు. 'లసిత' అనునది 'లషిత' అనుదానికి వ్రాతలో గలిగిన పొరపాటు గావచ్చును. వావిళ్ల ముద్రణమున నట్లే యుంచబడినది. అర్థ మెట్లు గ్రహించివారో!

౨. శిద్ధవిస్ఫూర్తి—అని యూ. వ్రా. ప్ర. సిద్ధ-కవిగారి ముద్రి. ప్రతి. సిద్ధ—వావిళ్ల ముద్రితప్రతి. రజతపర్వతము నా శోభిల్లు శివుని మూర్తి "సిద్ధవిస్ఫూర్తి"అనుటలో అర్థము కానరాదు. 'శుద్ధవిస్ఫూర్తి—శుద్ధము=తెలుపు, తెల్లని ప్రకాశముగల మూర్తి' అనుట యొప్పును.

"మకుటాదిభాతి" అని యూ. వ్రా. ప్ర. కవిగారి ముద్రి. ప్ర; వా.ము.ప్ర.లో 'మకుటాతిభాతి' అని కలదు. ఆ రజతపర్వతాగ్రహేమైకశృంగము వలె నమరునది ఈశ్వరుని జటామకుటముయొక్క 'అతిభాతి'=గొప్పకాంతి అనుటయే యొప్పు. ఇంతే గాక, ఈ పద్యములో కవి ప్రతిపాదము తుదిగణములలో నంత్యప్రాస కూర్చుచున్నాడు. "స్ఫూర్తిమూర్తి"—ఇట్లే "టాతిభాతి"యని యుండనోపును. ధూరివారి, పాలలీల, దాతగాత అనియే కలదు. కాని ఎత్తుగీతి రెండవ పాదమున "భోగభోగి"యనియే వ్రాతప్రతిలోను, కవిగారి ప్రతిలోను, వావిళ్లప్రతిలోనుగూడ గలదు. ఇది పై నాత డనుసరించిన నియమమునకు భిన్నముగా నున్నది. కావున 'భోగిభోగి'అనియే యుండవలయు నని తోచకపోదు.

౩. మృగాంకుక కంఠ నిస్ఫురిత —అని యూ. వ్రా. ప్ర. "దండ" అని కవి. ము. ప్ర. "కంఠ" అని వా. ము. ప్ర. ఇందలి భావ మిది: హరి శివునికి వికచామలాంబుజసహస్రము పూజచేసిన తరువాత నా చంద్రశేఖరుని శిరమున మృగాంకుడు గూడ నుండుటచే, నాతనిం జూచి అది తాను పూజ చేసిన పువ్వులలో వచ్చిన "(అ) విస్ఫురితమలాసితాబ్జ" మని తలంచి, దానిని తీసివేయు నుద్దేశముతో మృగాంకునిపై వు చేయి చాచగా, నీలవర్ణుడగు నీహరి నల్లని బాహువును జూచి చందురు డద్దాని 'రాహు'వని భ్రమపడి "నెఱి దుప్పలమూలుచు" జారదొడంగెను. ఇట్టి వీరిద్దరిని జూచి యీశ్వరుడు నవ్వసాగెను.

ఈ భావమే సరియైనచో, అది కవిభావమే యనుకొనదగినచో "మృగాంకు దండ చాచిన చేయి

"చాచి" అని "దండ" పాఠమే యుక్త మని తోచక పోదు. "మృగాంకు కందు" అను వా. ము. పా. లో నొక చిక్కు కలదు. మృగాంకునిలోగల 'కందు' ను మాత్రమే విస్ఫురితమలాసితాబ్జ మని తలంచినవా డన వలె. అప్పుడు అబ్జము కందువుమాత్రమా, కందువుతో గూడిన మృగాంకుడా? అను ప్రశ్న కలుగకమానదు. చంద్రునికే అబ్జముతో పోలిక గాని, అందలి కందుకు గాదు గదా. ఈ రీతిగానే దీని తాత్పర్యమును గ్రహించినను మూలములో "కండ్డ" అని కనబడుచుండుటచే గాబోలు కవిగారు దానిని మరల 'కంద' అని దిద్దినారు. మృగాంకునియందలి కందే అవిస్ఫురితమలాసితాబ్జమని, పుచ్చుగ-తీసివేయ నెంచి అను భావమే కలుగును. ఈ చిక్కును దొలగించుటకుగా యా. ము. ప్రతిలో శ్రీ: ల. శా. గారు—"మృగాంకునందవిస్ఫురిత" అని మరి యొక మార్పు కల్పించినారు. మృగాంకుని = చంద్రుని, అందు = ఆ పూన్చిన అంబుజ సహస్రమునందు గల, అవిస్ఫురితమలాసితాబ్జ మని తలచి, పుచ్చుగ చేయిచాచె నను భావముతో 'నంద' పాఠ మొకటి కల్పించినారు.

ఇట్లు 'కండ్డ, కందు, కంద, దండ, నంద' అని యిప్పటికే ఇన్ని పాఠములు బయలుదేరినవి. ఇంక ముం దెన్ని ముద్రణములు గావలసియున్నవో, ఎన్ని పాఠములు బయలుదేరవలసియున్నవో ? మృగాంకు నందలి 'కందు' నే మలాసితాబ్జ మని తలచె ననుట యొప్పు గాదు. కావున 'కందు' పాఠమునకు సాధుత్వము కలుగున ట్లగపడదు. 'దండ' అనునది 'కండ్డ' అను వ్రాతప్రతిపాఠమునకు సమీపముగా నుండును. 'నంద' అనునది 'కండ్డ' కు చాల దూరమైనదే గాని, అర్థము సరిగా గిట్టించునదిగా నున్నది. 'కందు' పాఠమున కర్థ మెవరైన పండితవర్యులు గిట్టింపగలరేమో.

ఇక "సెరందుపలందూంగంగం" అని యా. వ్రా ప్రతి. "సెలదుప్పలదూలగ" అని కవి ముద్రి. పాఠము. "దుప్పలఁదూగగ" అని కవిగారి తప్పొప్పులపట్టికలో దిద్దుబాటు. 'తూఁగగ' అని వావి. ముద్రి. పా.

మొత్తముమీద నీ ముద్రితప్రతులు వ్రాతప్రతిలోని రూపము ననుసరించుచున్న వనవచ్చును. కాని యిది 'తుప్పలదూగు' అనియా, లేక 'తుప్పలదూలు' అనియా అను సందేహము గలుగకమానదు. ఇందలి వ్రాతప్రతి ననుసరించిన 'తూగగ' అనియే యుండవలె. అయితే, ఈమధ్య, సూర్యరాయనిఘంటువువారు దీనిని "తుప్పలు దూలఁగ" అని గ్రహించి "సెల దుప్పలు దూలగ జాలు దున్న" అను పాఠములో నీ నన్నెచోడుని పద్యమునే యుదాహరించినారు. (తుప్పలఁ దూగగ—వ్రాతప్రతిపాఠము. తుప్పలదూలగ ముద్రి.) అని కుండలీకరణములో వా రిచ్చియుండుటచేత వ్రాతప్రతిపాఠమును, ముద్రితపాఠమును (ఈ ముద్రిత పాఠము మరల 'దూగగ' అని తప్పొప్పుల పట్టికలో మార్పబడినది)గూడ వదలివేసి, దీనిని తాము "తుప్పలు దూలగ" అనియే యుండవలయు నని నిష్కర్ష చేసిన ట్లగపడుచున్నది. భాస్కరరామాయణము నృసింహ పురాణములలో నీ రూపముల గ్రహించిన పాఠములే యీ దిద్దుబాటు కాధారముగా గ్రహింపబడిన ట్లగపడు చున్నది. శబ్దరత్నాకరకారుడు భారతము శాంతి పర్వమునుండి 'తుప్పలు తూలు' అనుట కొక యుదాహరణము నిచ్చినాడు. "దూరమునబోయి తుప్పల దూలియుండె". తరువాతికవుల ప్రయోగములనుబట్టి దీనిని దిద్దివేసి, వానితో సమీకరణముచేయుటా, లేదా ఏకైకప్రతిలో గనబడుచున్న 'తుప్పలదూంగగ' అను పాఠమును గ్రహించుటా అను విషయమును నిర్ణయించు టెట్లు? దానిని నిర్ణయించువా రెవరు ?

(సశేషము)

# పూర్వకవికృతులు : పునర్ముద్రణావశ్యకత

(క్రీ. శ. ౧౧౦౦-౧౯౦౦)

శ్రీ నిడుదవోలు వెంకటరావు

సర్వతోముఖమైన తెనుగుసాహితీవిశిష్టతను తెలిసి కొనుటకు అముద్రితములై, యసంఖ్యాకములై, అజ్ఞాతవాసము గావించుచున్న వ్రాతప్రతులే కాక, ఒక్కొక్కమాఱుమాత్రమే ముద్రితమై నేఁ డందుబాటులో లేని పూర్వకృతులుకూడ చాలగా నావశ్యకములై యున్నవి. వీనిలో ప్రతిగ్రంథమునుగూర్చియు చారిత్రకముగా, సారస్వతముగా దినదినమున్నూ ఎన్నో క్రొత్తవిషయములు బయలుపడుచున్నవి. అక్కడక్కడ చెల్లాచెదరుగా గ్రంథస్థములై యున్న యావిషయములను సేకరించి, సమీచీనముగా తిరిగి ముద్రితములు చేయవలెను. అట్లుగా సుపరిష్కృతములై, ఆ గ్రంథములు ప్రకటితములైనచో, నేఁడు తెనుగు సాహిత్యమునుగూర్చి విద్వాంసులకుగల సంకుచితభావములు సన్నగిల్లి విశాలమైన దృక్పథ మేర్పడును. వానిలో కొన్ని.

కవిజనాశ్రయము :—మనకు లభించిన యాంధ్రచ్ఛందోగ్రంథములలో ప్రాచీనమైనది; ప్రామాణికమైనది. ఈగ్రంథ మాంధ్రసాహిత్యపరిషత్తువారిచే క్రీ. శ. ౧౯౧౭ లో కీ. శే. జయంతి రామయ్యపంతులుగారి సంపాదకత్వమున వెలువడినది. వేములవాడ భీమకవికృతిగా పాఠభేదములతో ప్రకటితమైనది.

కాని యీముద్రణమున కవిజనాశ్రయము నిజస్వరూపము మఱుఁగుపడినది. పావులూరి మల్లనగణితము వలె నిందు మార్పులు, కూర్పులు పెక్కు వ్రాతప్రతుల కెక్కినవి. ఈ ముద్రణ మాధారముగా జేసికొని విద్వాంసు లీగ్రంథము ౧౪-వ శతాబ్దినాటి దని నిశ్చయించిరి.

కవిజనాశ్రయము కన్నడమున మొదటి నాగవర్మ క్రీ. శ. ౯౯౦ ప్రాంతమున రచించిన 'ఛందోంబుధి'ననుసరించినది — మల్లియరేచనకృతము. జైనసంప్రదాయికము. తమిళచ్ఛందోగ్రంథము యాప్పిరుంగల్ కారికలయందుదాహృతమైనది. ౧౧వ శతాబ్దినాటి కృతి. మడికి సింగన సకలనీతిసమ్మతమున నిందుండి యొక పద్యము నుదాహరించినాడు. నాగవర్మ ఛందోంబుధితోడను, నన్నిచోడని కుమారసంభవముతోడను సరిపోల్చిన పదబంధసామ్యములు కన్పట్టును. క్రీ. శ. ౧౬౫౬ లో అప్పకవి 'భీమన పద చెప్పె' అని వేములవాడభీమకవికృతిగా దీనిని వెలయించిననాటి నుండి జాతీయమైన ఛందస్సంప్రదాయవిరుద్ధములైన విషయము లిందు చేరినవి. ఇప్పటికి పూర్వలాక్షణికోదాహృతులమూలమున, వ్రాతప్రతుల మూలమున ఈగ్రంథస్వరూపమును సరిగ నిర్ణయించి పరిష్కరింపగలిగితిని. భాషోద్ధారకులు బ్రౌనుదొరగారు క్రీ. శ. ౧౮౨౭ లో షట్ప్రత్యయాధికారమువఱకును దీని కాంగ్లేయ భాషాంతరీకరణ మొనర్చినారు. తెనుగుగ్రంథము లింగ్లీషులోనికి పరివర్తనమగుట కిదియే మొదలు.

శివతత్త్వసారము :— (మల్లికార్జున పండితారాధ్యులు!) శైవవాఙ్మయమున లభ్యములయిన ప్రాచీన

కృతులలో మతగ్రంథములలో మొదటిది : ౧౯౨౨ వ సం.లో ఆంధ్రసాహిత్యపరిషత్తున శ్రీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి పరిష్కరణముతో పీఠికతో ప్రకటితమయినది. దీనిలో కొంతభాగమునకు కన్నడానువాదముకూడ లభ్యమగుచున్నది. తెలుగుగ్రంథమసమగ్రమైనను (౪౧౯ కందపద్యములు) కన్నడకృతి వలన నింకను పెక్కు పద్యము లున్నట్లు తెలియుచున్నది. లక్షణగ్రంథములనుండి ముద్రితప్రతులలో లేని పద్యములు లభ్యములగుచున్నవి. ప్రాచీనభాషాసంప్రదాయములను తెలుపు నీ ప్రశస్తగ్రంథ మింకను సరిగా శైవకవితాసంప్రదాయకముగ పరిష్కృతమై కన్నడానువాదముతో సహితము ప్రకటితము కాదగినది.

అనుభవసారము :—పాల్కురికి సోమనాథుని పద్యకృతి. షట్స్థలవివరణమును తెలుపునది. ౨౩౮ పద్యములు. ఇందు సోమనాథుని సంస్కృతవృత్తరచనా పాటవము విశదమగును. క్రీ. శ. ౧౯౧౬ లో రాజమహేంద్రవరమున విద్యానిలయముద్రాక్షరశాలయందు ముద్రితమయినది. నవీనపద్ధతుల ననుసరించి పునర్ముద్రణము గావింపదగినది.

చతుర్వేదసారము :—వీరశైవము సవైదికముగా నిరూపించిన సీసపద్యకృతి. ౩౫౯ సీసపద్యములు గలవు. ఇది ౧౯౧౪ లో మల్లంపల్లి భైరవమూర్తి గారిచే భైరవముద్రాక్షరశాలయందు ప్రకటితము. ముద్రితప్రతిలో ౩౦౦ పద్యములుమాత్రము కలవు. ౪౦౦ పద్యము లని 'బసవపురాణపీఠిక' తెల్పుచున్నది. వీని నన్నిటిని సక్రమముగ పరిశోధించి గ్రంథము పునర్ముద్రణము చేయదగియున్నది.

సంస్కృతాంధ్రోదాహరణములు : — తెలుగు బసవోదాహరణము, సంస్కృతబసవోదాహరణము ఈ వరకు ముద్రితము లయినవి. కాని ఉదాహరణ వాఙ్మయసంప్రదాయానుసారముగా వివరణముతోడను, వ్యాఖ్యానముతోడను పునర్ముద్రణము కావింపదగినవి.

సోమనాథుని లఘుకృతులు, చెన్నమల్లు సీసములు, గద్యకృతులు, పంచరత్నములు, వృషభాష్టకము, బసవాష్టకము ఇవియన్నియు వృషాధిపశతకముతో కూడ సంపుటీకరించి ప్రకటింపనగును. సంస్కృతలఘుకృతులైన బసవోదాహరణము, వృషభాష్టకము మొదలగునవి నాగరిలిపిలో ముద్రించుట వలన ఆంధ్రేతరులకు సోమనాథుని వైదుష్యము వ్యక్తపడగలదు.

(సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్ర, వృషాధిపశతకములను సమీచీనముగ ముద్రించి ఆంధ్రలోకమున కొసగిన ఆంధ్రగ్రంథమాలవారే పై గ్రంథముల నొక సంపుటముగా ముద్రించి ప్రకాశింపజేసినచో విద్వాంసుల కృతజ్ఞతకు పాత్రు లగుదురని విన్నపము.)

విజ్ఞానేశ్వరీయము:—తెనుగున ధర్మశాస్త్ర గ్రంథములలో మొదటిది. మూలఘటిక కేతనవిరచితము. ఇది యాజ్ఞవల్క్యస్మృతికి సంస్కృతమున విజ్ఞానేశ్వరుడు రచించిన వ్యాఖ్య. ఇంతకుముందు విశ్వరూపుని బాలక్రీడవ్యాఖ్యాన మున్నను, విజ్ఞానేశ్వరుని వ్యాఖ్యయే ప్రసిద్ధమై వ్యాప్తిలో నున్నది. ఇది క్రీ. శ. ౧౧౫౦ నాటిది. మూలవ్యాఖ్య పుట్టిన నూఱేండ్లకే యాంధ్రానువాదము వెలయుటచేత, మూలగ్రంథము పరిమార్చుటకిది యుపకరించును. దీనిని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున నుదాహరించినాడు. కడచిన శతాబ్దిలో, కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి దీనిలో వ్యవహారకాండమును, రామకవి ప్రాయశ్చిత్త కాండమును పద్యకావ్యములుగ రచించిరి. పరవస్తు తిరువేంగడాచార్యులు వ్యవహారకాండను వచనరూపమున రచించెను. ఇది క్రీ. శ. ౧౮౫౧లో ముద్రితము.

విజ్ఞానేశ్వరమును కీర్తిశేషులు వీరేశలింగము పంతులుగారు క్రీ. శ. ౧౮౯౫ లో చింతామణి పత్రికయందు ౨౨ వ గ్రంథముగా ముద్రించి ప్రకటించియున్నారు. నేడు సంస్కృతమూలముతో గూడ నిది పునర్ముద్రణము కాదగియున్నది. శాస్త్రీయగ్రంథరచనమున కేతనకు గల సామర్థ్యము దీనివలన తెలియనగును.

కేయూరబాహుచరిత్ర:—మంచనకవిప్రణీతము. సంస్కృతనాటకము పద్యకావ్యముగ పరివర్తనమును పొందిన కృతులలో మొదటిది. రాజశేఖరకవి 'విద్ధసాలభంజిక' అను నాటికయందలి కథావస్తువును

గ్రహించి, మధ్యమధ్య నీతికథలను పాదిగించి, కావ్యమును నిర్మించినాడు. చారిత్రకులలో 'వెలనాటి చోళుల' చరిత్రము వ్రాయువారు ఈ గ్రంథమున నున్న విషయముల నుదాహరింపకతప్పరు. క్రీ. శ. ౧౫౯౦ ప్రాంతమందు వెలసిన కృతి. కాకినాడ యందలి 'సరస్వతీ' పత్రికయందు క్రీ. శ. ౧౯౦౨ సంవత్సరమున కీ. శే. పోలవరం జమీందారులైన కొచ్చర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావు బహ దూరువారు ముద్రించిరి. నేడు చారిత్రకులకేగాక సాహితీపరులకుగూడ నీగ్రంథ మత్యావశ్యకము. ఈ గ్రంథమునకు సంబంధించిన వెలనాటిచోళుల శాసనము లతోగూడ ఇది ముద్రితము కావలెను. ముద్రితగ్రంథములో వ్రాతప్రతిలోని పద్యములు లోపించినవి; చక్కని పాఠములు మఱుగుపడినవి.

నీతిశాస్త్రముక్తావళి (బద్దెన):—రాజనీతిగ్రంథములలో ప్రశస్తమగు నీ కృతి పదిహేనుపద్ధతులలో భద్రభూపాలుడు (బద్దెన) రచించెను. ౧౯౧౨ లో 'విస్మృతకవులు' గ్రంథావళియందును, (శ్రీరామకృష్ణకవి) ౧౯౫౧ లో చెలికాని లచ్చారావుగారిచే ఆంధ్ర పరిశోధకమహామండలియందును ముద్రితము. దీనిని సంపూర్ణముగ పరిష్కరించిన వ్రాతప్రతి తక్షణమే ప్రకటనార్హము.

సాముద్రికశాస్త్రము:—అన్నయ ప్రణీతము. క్రీ. శ. ౧౭౮౦ ప్రాంతమున కీ సంకలనగ్రంథముల కెక్కినది. క్రీ. శ. ౧౮౮౪ లో చెన్నపురియందు ముద్రితమయినది. నేడు గ్రంథ మలభ్యమగుటచేతను, శాస్త్రీయగ్రంథ మగుటచేతను పునర్ముద్రణము చేయ దగినది.

సస్యానందము (దోనయామాత్యుడు):—వ్యవసాయశాస్త్రవిషయికమయిన పద్యకృతి. క్రీ. శ. ౧౯౨౯ లో కీ. శే. తడకమళ్ల వేంకటకృష్ణారావు గారిచే ముద్రింపబడినది. వ్యవసాయశాస్త్రపరిశోధనము జరుగు నీ కాలములో ఈ గ్రంథపునర్ముద్రణావశ్యకత యెంతయేని ఉపయోగపడును. ఈ కవి వాఙ్మయలోకమున కపరిచితుడు. క్రీ. శ. ౧౩౭౮ నాటి వాడు.

కన్నడమున క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమునాటి రట్టకవి లేక అర్హదాసరచితరట్టమతముతో సరిపోల్చి ప్రకటింప వలెను.

శివయోగసారము:—(కొలని గణపతిదేవకవి) శివయోగసారము పూర్వోత్తరభాగములు గల శైవమత గ్రంథము. అవతారిక లేక వరంగల్లులో 'శైవధర్మ ప్రచారిణీగ్రంథమాల'యందు ముద్రితము. గ్రంథావతారిక కాకతీయుల రాజ్యాంశములను తెల్పుచు, చారిత్రకులకు పరమప్రమాణమయియున్నది. అవతారికతో కూడ తిరిగి ముద్రించుట అవసరము. ఈ కవి యాదిగణపతిదేవు డను పేరుతో కవుల చరిత్రమున కెక్కినాడు.

పద్మపురాణము (మడికిసింగన):—ఈగ్రంథము క్రీ. శ. ౧౯౨౭ వ సంవత్సరమున వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. సింగనగ్రంథములలో కందన మంత్రి సంపూర్ణవంశావళిని తెల్పుచు చరిత్రకారుల కుపయుక్తముగ నున్నది. ఈగ్రంథము నందలి కొన్ని భాగములు ప్రౌనుదొరగారు భాషాంతరీకరించుటయే దీని ప్రాశస్త్యమును దెల్పును.

సకలనీతిసమ్మతము:—ఇది ప్రాచీనకాలములో ఆంధ్రమున వెలసిన అపూర్వగ్రంథములనుండి యుద్ధరింపబడిన పద్యసంకలనగ్రంథము. తెలుగున అట్టి గ్రంథములలో మొదటిది. ఇది ౧౯౫౩ లో ముద్రితమయ్యు, నేడు లభ్యమగుట లేదు. ఆంధ్రవాఙ్మయ చరిత్రకారులకు నీ గ్రంథము ఒక పెద్ద కాణాచి. ఇది యాంధ్రగ్రంథమాలలో ప్రకటితము.

చారుచర్య (మంత్రి అప్పన):—ఆరోగ్యశాస్త్రగ్రంథము. కృతి చిన్నదియయ్యు, ప్రశస్త కవిత గలది. ముక్త్యాలలో ౧౯౫౧ లో ప్రకటితము. ఇది సంస్కృతమున భోజుని చారుచర్యకు తెలుగగుటచే, మూలమును, భాషాంతరమును రెండును కలిపి ముద్రించుట సమంజసము.

హయలక్షణసారము (మనుమంచిభట్టు):—అశ్వవైద్యమును దెల్పు నీ ప్రశస్తపద్యకృతి ౧౯౨౭ వ సంవత్సరమున ముద్రితము. కృతి అలభ్యము. కృతి సాశ్వవంశ

యలకు కంపరాజులకు అంకితము. దీనిని కన్నడమున గల అశ్వవైద్యముతో సరిపోల్చి ప్రకటింపవలెను.

వరాహపురాణము (నందిమల్లయ, ఘంట సింగయ):—౧౯౦౨ లో వీరేశలింగము పంతులుగారిచే చింతామణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము. తిరిగి ముద్రణ అవశ్యకము.

ప్రబోధచంద్రోదయము (నందిమల్లయ, ఘంట సింగయ):—సంస్కృతనాటకమునకు పద్యానువాదము' పూర్వ ముద్రితప్రతులు లభించుట లేదు. దీనిని మొదట కీ. శే. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు 'రాజ యోగి' పత్రికలో ముద్రించిరి. ఆ వెనుక వీరేశలింగం పంతులుగారు 'చింతామణి' పత్రికలో ముద్రించిరి. సంస్కృతమూలముతో గూడ ప్రకటితము కావలెను.

ధనాభిరామము (నూతనకవి సూరన) :—ఇతడు తిక్కన సోమయాజివంశమువాడు. ఇతని కృతి౧౯౨౬లో బజారుముద్రణముగా వెలసినది. ద్రాక్షారామభీమేశ్వరు నకు కృతి. ప్రస్తుత మలభ్యము.

సహదేవపశువైద్యము (సారయ మంత్రి) :— ౧౯౦౫ లో 'మంజువాణి' పత్రికలో ముద్రితము. శాస్త్రీయగ్రంథ మగుటచే తిరిగి ముద్రణము గావలసి యున్నది. కవి కృష్ణదేవరాయలకు పూర్వుడు. కన్నడ మున క్రీ. శ. ౧౧౦౦ లలో వెలసిన 'గోవైద్యము' తో సరిపోల్చి ప్రకటింపవలెను.

శ్రీశైలఖండము (నాగులూటి శేషనారా యణుడు) :— పండితారాధ్యచరిత్రమున పర్వతప్రకరణ మునకు పద్యానువాదము. క్రీ.శ. ౧౮౮౮ లోను, ౧౯౨౨ లోను బజారుముద్రణములుగా వెలసినది. ఈ ప్రశస్త కృతి నేడు సుపరిష్కృతమై ముద్రితము గావగినది. కవి క్రీ. శ. ౧౫౦౦ కు పూర్వుడు.

అన్యవాదకోలాహలము :—పాల్కురికిసోమనాథ కవికి కృతి. సోమనాథుని గ్రంథములలోని విషయ ములు ఇందు సంగ్రహింపబడినవి. ౧౨౪ సీసపద్యములు. గ్రంథకర్త ఏకామ్రగురుడు. ఇతడు ప్రతాపచరిత్ర ద్వాత్రింశకకథలు వచనముగా వ్రాసిన ఏకామ్ర నాథుడు కాదగును. కాని పర్వప్ప యాతని పేర్కొ న్నాడు. ఈ కృతి క్రీ. శ. ౧౮౮౪, ౧౯౦౨ లలో శైవ సిద్ధాంతముద్రాక్షరశాలయందు ముద్రితము.

సిద్ధరామశతకము (సిద్ధరామకవి):—శైవసిద్ధాంత ప్రశంసాపరము. సీసపద్యమయము. కవి పిడుపర్తి బస వేశుని శిష్యుడు. ఈ శతకము ౧౮౮౨ లో ముద్రితము.

కాళహస్తిలింగశతకము (విరూపాక్షకవి) :— ఇతడు శ్రీ గిరికవిమనుమడు. ఈ గ్రంథము ౧౮౮౨ నాటికే ముద్రితము. ప్రాచీనశైవశతకములలో చాల ప్రశస్తికెక్కినది. ఒక్క ప్రాచ్యలిఖితపుస్తకభాండా గారములో దీనికి ౧౬ మాతృకలు కలవు. దీనివలన ఈ శతక ప్రశస్తి తెలియనగును.

మైరావణచరిత్ర (మాదయకవి) :—శ్రీ కృష్ణదేవ రాయలకు ముందు రాజ్యము చేసిన వీరనరసింహరాయల కాలము నాటిది. ౧౯౧౧ లో 'కవితా' పత్రికయందు ముద్రితమయినది. అచ్చుప్రతు లిప్పుడు మచ్చునకైన దొరకుటలేదు.

మల్హణచరిత్ర (ఎడపాటి ఎఱ్ఱన):—౧౯౩౧ లో 'శృంగారగ్రంథమాల'లో ప్రకటితము. నేడు ఈ గ్రంథము లభ్యమగుట లేదు. కవి కృష్ణరాయలనాటి వాడు.

కకుత్స్థవిజయము—మట్ల అనంతభూపాలుడు.
బహులాశ్వచరిత్ర—దామెర వేంకటభూపాలుడు.
కువలయాశ్వచరిత్ర—పవరము చిననారాయణుడు.
చంద్రాంగదచరిత్ర—పైడిమఱ్ఱి వెంకటపతి.

వీనిలో మొదటిమూడును కాకినాడలో సర స్వతిపత్త్రికయందు ముద్రితము లయినవి. ఈ ప్రశస్త ప్రబంధములు సాహిత్యవిషయమునవేకాక, చారిత్రిక ముగకూడ అత్యంతోపయుక్తములు. ఇవి ౧౬,౧౭ వ శతాబ్దములనాటి తెలుగు కేళపు జీవితమును ప్రదర్శించు చున్నవి. కడది అముద్రితగ్రంథచింతామణియందు నెల్లూరులో ప్రకటితము. కృతి ప్రశస్తమైనది.

ఘటికాచలమాహాత్మ్యము: (తెనాలి రామకృష్ణ కవి):—ఇందులో నవతారికాభాగము పూర్తిచేయకయే తెనాలి రామకృష్ణకవి పరమపదించినాడు. అతని మనుమనివలన నీ గ్రంథము గ్రహించి వెంకటగిరికవి

ఖండోజీయను మహారాష్ట్రరాజునకు కృతి యిచ్చినాడు. ఇది క్రీ. శ. ౧౯౦౭ లో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులు గారి కవితాపత్రికయందు ముద్రితమై ప్రకటితమయి నది. నేడు ప్రతులు లభించుటలేదు. రామకృష్ణకవి గ్రంథము గాన పునర్ముద్రణము చేయదగినది.

చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్య):— కవి అప్పకవికి పూర్వుడు. వైష్ణవాచార్యులలో ప్రసిద్ధుడగు వరదాచార్యులకు అంకితము. క్రీ. శ. ౧౮౮౪ లో విశాఖపట్టణమున వేణుగోపాలముద్రాక్షరశాలయందు ముద్రితము. కవితారచన ప్రశస్తమగుటచే తిరిగి ముద్రితము కాదగినది.

తపతీసంవరణోపాఖ్యానము (అద్దంకి గంగాధరకవి):— మల్కిభరామునకు కృతి. ౧౮౯౫లో 'కాకినాడ' సుజనరంజనీముద్రాక్షరశాలలో ముద్రితము. మహమ్మదీయప్రభువుకృతిగాన నేడు ముద్రణార్హము.

మట్లచక్రవర్తి చరిత్ర (మల్లారెడ్డి) :— తెలింగాణాప్రాంతమందలి చిక్కవోలు పురాధీశ్వరుడగు మల్లారెడ్డి రచించినది. ఈ వంశీయులు కృతిభర్తలు, కృతికర్తలు నై యున్నారు. క్రీ. శ. ౧౮౯౬ లో కాకినాడ సుజనరంజనీముద్రాక్షరశాలయందుముద్రితమయినది. రాజకృతిగావున పునర్ముద్రితముగాదగిన కృతి.

పరమయోగివిలాసము (సిద్ధిరాజు తిమ్మరాజు):- ఈతడు అళియరామరాయల వంశములోనివాడు. ఈ గ్రంథము ౧౯౧౨ వ సంవత్సరమున 'కవితా' పత్రికయందు ప్రకటితమయినది. పునర్ముద్రణార్హము.

సారంగపాణిపదములు (సారంగపాణికృతము):- తెలుగున వాగ్గేయకారకులలో పేరుగాంచిన సారంగపాణి పదములు క్రీ. శ. ౧౮౪౭ లో ముద్రితమైనవి. సంగీతమునకు ప్రతిదినప్రాముఖ్యము గల యీ కాలమున కూడ యీ గ్రంథ మింకను ప్రచారము లేకుండ నున్నది. తక్షణమే ముద్రింపదగినది. కవి కార్వేటినగరమహారాజా సాస్థానమున సంగీతవిద్వాంసుడు.

భానుమతీ పరిణయము (రెంటూరి రంగరాజు) :— వెలుగోటి రాయభూపాలునికి కృతి. క్రీ. శ. ౧౮౪౭ వ సంవత్సరమునాటిపాతముద్రణము ఇప్పుడు లభించుట లేదు. పునర్ముద్రణము చేయదగినప్రబంధము.

ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసము గణపవరపు వెంకటకవి) :— చిత్రబంధకవిత్వములకు పుట్టినిల్లయి ప్రాచీనభాషాసంప్రదాయములను తెలుపు ఈ ప్రౌఢకృతి ౧౮౯౭ లో అముద్రితగ్రంథచింతామణిలో ప్రకటితము. ఆనాటికి చిత్రబంధములను ముద్రించుటకు తగిన యవకాశ మేర్పడలేదు. బహుప్రాచీనమయిన యీ బంధకవిత్వసంప్రదాయమును మధ్యయుగమున పునరుద్ధరించిన యీ కవికృతి నేడు పునర్ముద్రణము చెందవలసియున్నది. లభ్యమగు ముద్రితప్రతులు జీలుగాై గ్రంథ ముపయోగించుటకు వీలుగాకయున్నది. కావున తత్క్షణమే ముద్రితము కావలసియున్నది. దీనివలన ఎన్నియో అపూర్వవిషయము లెరుకపడును. దీనిని చిన్నసర్వస్వ మనవొప్పును.

ఉత్తరహరిశ్చంద్రచరిత్ర (తిక్కళ్లపాటి లింగన) :— పద్యకావ్యము. కవి వెలుగోటి కొండలరాయని ఆస్థాని. నెల్లూరు మండలమువాడు. గ్రంథము అముద్రితగ్రంథచింతామణిలో ౧౮౯౧ లో ముద్రితము.

మిత్రవిందాపరిణయము (కందుర్తి వెంకటాచలకవిప్రణీతము) :— ఈతడు మధుర విజయరంగ చొక్కనాథుని ఆస్థానకవి. క్రీ. శ. ౧౮౮౮ లో అముద్రితగ్రంథచింతామణిపత్రికలో ప్రకటితము. ఇది మధుర నాయకులకు సంబంధించిన కృతియగుటచే పునర్ముద్రణము చేయవలయును.

పార్వతీపరిణయము : (పుదుక్కోటరాజగు కోటి రఘునాథరాయప్రణీతము):— కాళిదాసకుమారసంభవకథను సిద్ధహస్తులైన నన్నిచోడాదికవులు ప్రపంచించిన వెనుక ఇంత రసవత్తరముగ చతురతతో ఆ కథను ప్రబంధరీతిగ వ్రాసిన కవి యీతడొక్కడే. క్రీ. శ. ౧౯౦౫ లో 'సరస్వతీ' పత్రికయందు కాకినాడలో ప్రకటితము. అవశ్యముగా పునర్ముద్రణము చేయదగినది.

కనకరంజితశిఖామణీపరిణయము (గూడికల్లు వెంకటరమణకవి):—క్రీ. శ. ౧౯౦౩లో నెల్లూరులో 'వాగ్వల్లి' పత్రికయందు ప్రకటితము. విక్రమార్కుని కథలు తెలుపును. గ్రంథ మలభ్యము.

వసుంధరాపరిణయము (నెల్లూరి వీరరాఘవకవి ప్రణీతము):— ౧౯౦౮ లో అముద్రితగ్రంథ-చింతామణిలో ప్రకటితము. కవి నెల్లూరుమండలమువాడు. గ్రంథము ప్రశస్తమయినది.

వేదాంతరసాయనము (మంగళగిరి ఆనందకవి ప్రణీతము):—క్రైస్తవమతగ్రంథము. ఏసుక్రీస్తుచరిత్ర. పద్యకావ్యము. క్రీ. శ. ౧౮౭౩ లో R. A. ***Ballayantine*** అనువారిచే టీకాతాత్పర్యములతో ముద్రితము. ఇందు క్రైస్తవమతపరిభాష. లేక, సరళమైన శైలి కలదు. పునర్ముద్రణము కాలేదు.

ఒడయనంబివిలాసము :—పద్యకావ్యము. అజ్ఞరపు పేరయలింగకవిరచితము. ఈతడు బమ్మెరపోతనమనుమని కూతురుకొమారుడు. ఈ ప్రశస్తశైవకృతిలో నాంధ్రాచారములు, భోజనభాజనములు వర్ణితము లైనవి. క్రీ. శ. ౧౮౯౬ లో సత్తిరాజు సీతారామయ్యగారిచే జిలుగుకాగితములపై ముద్రింపబడినది. తిరిగి ముద్రింపవగినది. నాయనారులలో ప్రసిద్ధుడగు సుందరమూర్తినయనారుచరిత్ర.

నలచరిత్ర (సిరిప్రెగడ ధర్మయామాత్యుడు):— ౧౯౦౩ సంవత్సరమున ముద్రితము. నలచరిత్ర పద్యకావ్యములలో నొందటిది.



# నన్నయ్యగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి

## నలచరిత్రము—పూర్వభాగము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

పూర్వవ్యాసములో హంసదౌత్యస్వయంవరద్యూత వనగమనములు నలకథకు పూర్వభాగ మని వ్రాసియుంటిని. ఈ పూర్వభాగకథలో నన్నయ్యగారు తీర్చిన తీర్పు వ్రాసెదను. ఉత్తరభాగస్థశిల్పము కంటె నిది భిన్నముగా నుండును. ఇందు భిన్నసన్నివేశములను అత్యుచితముగా చేయుటచే చూపబడిన శిల్పము.

మొదటిది హంసదౌత్యము. హంసదౌత్యము నలకథకు ముఖము. నలదమయంతు లిద్ద ఱొకరొకరి గుణంబులు విని యన్యోన్యము కోర్కికలవా రయిరి; 'ఒక్కనాడు నలుడు దమయంతీగుణబద్ధచేతస్కుండై మదనానలంబు సహింపనోపక ప్రమదవనంబున గ్రుమ్మరువా డంతరిక్షశ్రీకాంతాహారావళియుంబోలె హంసావళియవనీతలంబున కవతరించిన' దమయంతీ గుణబద్ధచేతస్కుడు = దమయంతి యొక్క గుణములయందు బద్ధమైన మనస్సు కలవాడు; దమయంతి యను త్రాడుచేత కట్టబడిన మనస్సు కలవాడు—మదనానలము సహింపనోపక, అనగా కాలుసేతులు కట్టివేసి నిప్పులో వేయబడినవానివలె నుండె నన్నమాట. అంతరిక్షమను స్త్రీ యొక్క ముత్యాలపేరు వలె హంససమూహము భూమి కవతరించెను.

ముత్యాలపేరువలె హంసల వరుస యున్న దనుటచేత గగనమున బక్షులు గుమ్ములుగా నెగురునపుడు మెడలోని హారమువలె నాబద్ధమాలలై పోవుట విదితమయిన విషయమే. ఈ పోలిక చెప్పుట యెందు కనగా నలుడు దూతయయిన హంసను పట్టుకొనగా 'పింఛుకట్టి తిరుగుచుండె వాతోద్ధూతశారదాభ్రశకలచయమునోలె' అన్న భావముతో నసమత్వము కల్పించి చమత్కరించుటకు, ఇచట యంతరిక్షమను శబ్దము, అవతరించుట యన్న శబ్దము—ఈ రెండును ముఖ్యములైన శబ్దములు. అంతరిక్షమనగా వాయుప్రసారము గల యాకాశము. ('వాయు రంతరిక్షే, సూర్యో దివి చంద్రమా దిక్షు నక్షత్రాణి స్వలోకే' అని వేదము.) ఈ హంసలు వాయుమండలమునుండి దిగినవి. ఎచటనుండి వచ్చినవో తెలియదు. వాయుమండలమునందే యుద్భవించిన వేమో! 'అవతరించు' శబ్దము 'దిగు' అన్న సామాన్యార్థమును చెప్పుచున్నను 'భగవంతు డవతరించెను' అన్నచోటి యర్థమును కొట్టుచున్నది. కనుక వాయువు తనువుగా గలిగిన దైవ మవతరించె నన్న స్ఫూర్తి యీ శబ్దము లందు గలదు.

నలుడు 'హంసల నడచెలువు చూచి నగుచు' వాని నడకలయొక్క సొగసు చూచి నవ్వుచు. 'ఎందుకు నవ్వవలయును? స్త్రీలవలె నడచుచున్నవని...దమయంతీగతబుద్ధి కదియే కదా యూహ! 'ఎగచి యొగచి యందు నెగయకుండగ నొక్క హంస బట్టుకొనియె నతిరయమున'. ఎగురగొట్టి యొసరగొట్టి పైకి లేవకుండ నుండగా నొక హంసను మిక్కిలి తొందరగా బట్టుకొనియెను. (ఎగచు=ఎగురజేయు; ఎగయు=పైకి లేచు) ఆ హంస యెగురనే లేదు. దానిని మిక్కిలి తొందరగా బట్టుకొనియెను. అది యెగిరిపోవునేమో యని యతని భయము. అది యితడు పట్టుకొనవలయు ననియే యెగురలేదు.

ఆ హంస 'తన కమ్మనుజేశ్వరు డపాయమ్ము సేయుంగా వగచి'—చేయు నని వగచి కాదు, చేయుంగా యని వగచియు గాదు. ఇచ్చటి 'కా' వర్ణము 'కాణ్' అను సుబ్యంతంబయి క్రియావిశేషణంబుల కను ప్రయుక్తంబగు నసుధాతువు కాదు. క్రియావిశేషణము కాదుగనుక, కదార్థమైన కావర్ణము కాదు. ఇచ్చట వర్ణసృష్టి జరుగవలయు నన్నచో నిత్యర్థ ముండవలయును. ఈ వాక్యమున కర్థ మెట్లు సంపాదింపవలయును? అతను తన కపకారము చేయడు. చేయు నన్నట్లూహించి యను నర్థము కల్పించుకొనవలయును. వగచు ననుధాతువున కీ రీతి క్రియావిశేషణము చేయుట తక్కిన భాషలలో గనుపించుట లేదు.

ఆ హంస మనుష్యవాక్యంబులతో 'నీకుం బ్రియంబు సేసెద. నీహృదయేశ్వరి యయిన దమయంతి పాలికిం బోయి' మొదలైన వాక్యములు చెప్పెను. ఈ హంసకు దమయంతి నలుని హృదయేశ్వరి యని యెట్లు తెలియును? తెలియుబో! నీ కెట్లు తెలియు నని నలు డేల ప్రశ్నించలేదు? సరికదా, దాని పలుకులు తనమనస్సునకు 'అమృతధారాపాతంబును బోలె నయిన' 'అనురక్తు' డయి దానిని విడిచెను. అనురక్తుడు = అనురాగము పొందినవాడు; అనుసరించి రక్తు డయినవాడు. ఈ రెండవ యర్థము కూడ నిందున్నది.

అమృతధారాపాతమువలె ననుటలో హంస యొక్క భయముతో గూడి చెప్పిన మాటల తొందరతో గూడిన యొడిదములేని స్వరసాంకత్యము ద్యోతమాన మగుచున్నది. ఇదియు, 'కాంతాహారావళీ'యు కథలోని చమత్కారములు కావు. కథను చెప్పికొని పోవుచు ననుబంధములుగా జేయబడినవి.

ఈ హంసపిండు దమయంతికడ్డకు బోయి విహరించుచుండెను. నలునికడ్డ విహరించుటకు బోయె నని చెప్పినచోటను, నిచ్చటను రెండు స్థానములయందు వచనమే వాడబడెను. రెండును సామాన్యపరిస్థితులు. రెండును సమానమైన పరిస్థితులు. రెండు స్థలములయందును వచనమే వ్రాయబడుట తొలుత చెప్పిన పనితనములో నొక భాగము.

నలుచేత విడువంగబడిన హంస చెలువముగ నందు దమయంతిచేత బట్టుబడియె. ఇందు 'పడు' ధాతు వప్రయుక్త మయినది. నేడు చాలమంది యిది సంస్కృతమునుండి యెరవుతెచ్చుకొనబడిన దని, తెలుగునకు సుందరము కా దని యందురు. తెలుగు పద్యములలో నీ శబ్దము వినబడినంతనే చీదరించుకొను వారినిగూడ నే నెరుగుదును. వాడు కన్పడెను. కూలబడెను. వాని కిది చేపడెను—ఇటువంటి ధాతువులవలన నీ శబ్దము తెలుగునకుగూడ సహజ మనియే చెప్పవచ్చునే. కాన యిచ్చటి 'విడువంగబడిన—పట్టువడియె' అన్న శబ్దము లెంత యర్థసమృద్ధిని గలిగించుచున్నవి! సౌందర్యాపేక్షచేత సర్వశబ్దములు సుప్రయోజ్యము లగును. ఇది శిల్పరహస్యము.

'చెలువముగ' ఈ శబ్దము వృథాప్రయుక్తముగా కనిపించవచ్చును. కాని కాదు. మనము మాటాడుకొనుచుండగా 'చమత్కారంగా ఇల్లా జరిగిందిరా' అనుట వాడుక. ఈ శబ్దము తత్స్థానీయము. పట్టి వాక్యాలంకారమే కాక మధురార్థసంఘటనసామర్థ్యము కలదికూడను. వందహంసలు, వందమంది సౌందర్యవతులు. వానిని పట్టుకొనుటకు వీరందఱు పరుగెత్తుచున్నారు. అవి యెగిరిపోవుచున్నవి. పూవుల తోట. ఆ యందము చెప్పుటకు వీలగునా? నలుడు విడిచిన హంసయే చెలికత్తె చేతికిని దొరకదు. దమయంతి రావలయును, పట్టుకొనవలయును. పట్టువడియె ననుటలో నలు డతిరయమున హంసను పట్టుకొనె ననుటలోని యతిరయత్వముకూడ స్ఫురించుచున్నది.

అచట నలునితో హంస చెప్పిన మాటలు వచనములోనే వ్రాయబడెను. ఇచటను హంస దమయంతితో జెప్పిన మాటలు వచనములోనే వ్రాయబడెను. కాని యీమాటలలో నడుమ నొక పద్యమున్నది. ఆ మాట లా పద్యములో వ్రాయబడుటలోని యౌచిత్యము భావుకు లెఱుంగుదురు.

ఇది హంసదౌత్యము. ఈ హంస యెవరు? దీనికీ మాటాడు శక్తి యెచ్చటినుండి వచ్చినది? తన ప్రేమ రహస్యము దీనికి దెలియుటను నలు డెట్లు నిశ్శంకముగా

స్వీకరించెను. ఈ హంస 'యవతరించెను'. ఇది 'దమయంతికి నలునకు సంగమకారణదూతి'. సంగమమునకు గారణమయిన దూతి యని యర్థము. ఈ హంస లేనిచో వారి సంగమము జరుగదా? అదివఱకే వారన్యోన్య లగ్నమనస్కులు. ఈ దౌత్యమువలన దమయంతి యధిక విరహాతప్త యగుటయు, భీముడు స్వయంవరమును జాటించుటయు జరిగిన మాట నిజమే! అంతమాత్రమున సంగమకారణదూతి యనవలయునా? ఏవిధముగా జెప్పిన చెప్పకూడదు? ఇచ్చటి కారణశబ్దమే చమత్కారముగా నున్నది. కారణజన్మకు మొదలయిన శబ్దములు కలవు. వారిసంగమమే కారణముగా గల దూతి. ఈ హంస మరియెచ్చటను లేదు. ఈ యొక్క కారణముకొఱకేయీ హంస భూమి నవతరించెను. ఇతర కావ్యములలోని హంసలు, పక్షులు మాటాడినచో బంచతంత్రములో బక్షులు మాటాడినట్లు. ఇచట నట్లు కాదు. ఈ హంస నలదమయంతులయొక్క సంగమార్థమయిన కారణజన్మ కలది.

ఈ హంస శివుడు. ఇది శివపురాణాంతర్గతమయిన గాథ. ఆహుకు లను భిల్లదంపతులు యుగాంతరములందు దపస్సు చేయగా శివు డనుగ్రహించి 'మీరిద్దఱు నలదమయంతులయి జన్మింతురు. మీకు నేను దౌత్యము చేయుదు'నని ప్రసాదించెను. ఆ గాథ యిచ్చట ననుసంధితమయినచో నీ నన్నయ్యగారి రత్నగర్భమైన రచన తెలియును. నన్నయ్యగారు తాను 'నానాపురాణవిజ్ఞాననిరతుడ'నని చెప్పికొనెను.

ఇది యందఱకు నెట్లు తెలియుననిప్రశ్న పుట్టవచ్చును. ఆ కాలములో నీ ప్రశ్న లేదు. నేడు మన యింగ్లీషువారి చరిత్ర యెంత చక్కగా నెఱుగుదుమో నాడు బహుపురాణకథలు వా రంత బాగుగా నెఱుగుదురు. ఎనిమిదవ హెన్రీ యనేకభార్యలను చేసికొన్నాడన్న విషయము విద్యావంతులకు నే డెంత పరిచితమో యాహుకభిల్లుని కథ నాటి విద్యావంతుల కంత పరిచితము.

ఇట్లు పూర్వభాగములోని భిన్నవిషయములు ప్రతిదియు వ్రాసినచో బోలెడంత గ్రంథము పెరుగును. నన్నయ్యగారి ప్రతిశబ్దము విచారించినచో నింక నెక్కువ కాలము పట్టును. అది వ్యాఖ్యాన మగును. ఒకటి రెండు విషయములు చెప్పి ప్రధానఘట్టములే పరామర్శింతును.

దేవతలకు నలుడు దౌత్యము చేసెను. ఇచట నన్నయ్యగారి నేర్పు చూపించెదను. 'దమయంతీనివేశంబు ప్రవేశించునపుడు నిన్నెవ్వరు వారింపనోడుదురు' అని యింద్రు డనెను. అశంకితుడై నలుడు దమయంతీగృహంబు సొచ్చెను. ఇచట చూడవలసినది దేవతలు నలున కదృశ్యత్వమణ్యాదు లేవియు నీయలేదు. ఇచ్చినచో గనిపించుటయు, గనిపించకపోవుటయు నలుని యధీనములో నుండును. దేవతలకు నలునిమీది యధికార ముండదు. వారు సర్వవ్యాపకులు. అదృశ్యులయి నలుని వెంట నుండవచ్చును. ఒక పరిస్థితి తమ కనుకూలము కానిచో నతడు కనిపించకుండ చేయవచ్చును, కనిపించునట్లు చేయవచ్చును.

'హంసచే దన వినినంతకంటెను రూప
విభవాతిశయముల వెలయుదాని,
సురకన్యకలయట్టి సురుచిరశతకన్య
కాళిచే బరివృత యైనదాని,
హృదయేశుడైన త న్నెప్పుడు వినుచున్కి
నలయు కార్శ్యాన్వితయైనదాని,
దమయంతి జూచి కందర్పశరావిద్ధు
డయ్యె నలుం; డంత నతని జూచి
యితి డపూర్వమనుజు డెందుండి వచ్చెనో
యనుచు నదరిపడి లతాంగు లెల్ల—'

ఇట్లు జరిగినది. హంస చెప్పినదానికంటె నెక్కువ యందకత్తెను మొదట చూచెను. చూచిన తోడనే యతని మన స్సెట్లుండును? ఇంత యందకత్తె నాకు గాకపోవుచున్నదే యని పించును. 'ఈమెను దేవతలు వరించుచున్నారే! ఈమె యింద్రాణీభోగము ననుభవించునే! అనుభవించుటకే పుట్టినదివలె నున్నది. ఇప్పుడుకూడ దేవతాస్త్రీలవంటి వందమంది కన్యలచేత సేవింపబడుచున్నది' యని యనుకొనును. ఆభావములే పాఠకుడు గ్రహించునట్లు చేయు

టుకు సామర్థ్యము కల వర్ణనము ద్వితీయచరణమునందు జేసెను.

అప్పు డేమగును? అతని యాశ యంతయు నణగిపోయెను. కాని మూడవ చరణములో నతనియాశ మరల రేకెత్తుటకు హేతువు చూపబడినది. అందుచేత నలుడు కందర్పశరావిద్ధు డయ్యెను.

'అంతట' చెలికత్తె లాతనిని చూచిరి. 'అంతట' యనగా నెప్పుడు? నలునకు మనస్సులో దమయంతీ గతవిరహాభావము పుట్టగానే యని యర్థము. పుట్టగానే యతడచట నున్న స్త్రీలందఱకు గనిపించెను. ఎందుచేత? దేవతలు నలుని మనస్సులో నున్నారు. నలుడు దౌత్యపుమాట మఱచి తాను విరహావస్థ పొందుచున్నాడు. తమ పని చెడిపోవుచున్నది. అత డప్పటి స్త్రీలకు వెంటనే కనిపించినచో వారు తొందరపడుదురు. ఇతడు వెంటనే తా నెవ్వరో చెప్పికొనవలయును. తాను తన విరహావ్యథలో నుండుటకు వీలు లేదు.

'అంతట' యన్న శబ్దమునం దింత యర్థమున్నది! ఇది నన్నయ్యగారి రచన. ఇ ల్లైనన్న శబ్దములు పరమార్థభూతములుగా వాడును.

కిరాతుని కథయు, సార్థవాహుల కథయు రెండునుగూడ వ్రాసెదను.

దమయంతి యడవిలో దిరుగుచుండెను. 'ఇట్లరుగుచున్న దమయంతి, నంతికవ్యస్తచరణయయిన దాని, నాహారార్థియయి యొక్క యజగరమ్ము వట్టి కొనిన' ఆమె యఱచెను. అప్పుడు ఒక్క రెఱుకు వచ్చి 'తన పట్టిన సురియ నప్పెనుబాము వదనంబు వ్రయ్యందఱిగిన.' దమయంతిని కొండచిలువ పట్టుకొన్నది, అంతికన్యస్తచరణయయినదానిని పట్టుకొన్నది. ఇది కొండచిలువలక్షణము. ఆమెను త్రాచుపాము కఱవలేదు, కరవబోలేదు. ఎఱుకు వచ్చి పామును జంపలేదు. కొండచిలువ యే చెట్టునో పట్టుకొని యొక పెద్ద తీగవలె వ్రేలాడుచుండును. పరీక్షగా జూచినగాని కొండచిలువ యని తెలియదు. దగ్గఱకు బోయినగాని యది పట్టుకొనలేదు. పట్టుకొని మ్రింగును గాని కఱవదు. ఈ యాపత్తు తొలగుటకు కత్తితో దాని పెదవులు చీల్చవలయును. ఇది వస్తుగతౌచిత్యము. ఇట్టి యౌచిత్యము నింతగా పాటించిన తెలుగుకవు లరుదు.

ఇదియు గాక యింకొక చమత్కారము. కొండచిలువ మ్రింగినంతనే మనుష్యులు చచ్చిపోరు. అది చెట్టునకు పెనవేసికొనగా నది మ్రింగిన జంతువు బొమికలు విఱిగి చనిపోవచ్చును.

మఱియు నా కొండచిలువయొక్క లాలజలము జంతుశరీరమున నత్తుకొని చర్మరక్తాదులను వికారపఱచును (*Decompose*). అందుచేత దొందఱగా రక్షింపబడినచో మనుష్యుడు బ్రదుకవచ్చును. ఆ మనుష్యుని యొడలినిండ చిలువనోటి చొంగ మలినముగా నుండును. దమయంతి యప్పు డట్లున్నది. ఆమెను స్నానము చేయించినగాని దమయంతియొక్క సంపూర్ణమైన సౌందర్యము కిరాతునకు దెలియదు. సురియతో బాము నోరు కోసినతరువాత దమయంతి రాహుముఖవిముక్త యయిన చంద్రరేఖవలె వెలికి వచ్చినది. ఇది వట్టి సామాన్యమైన యుపమాలంకారముగానున్నది. చంద్రగ్రహము గ్రహణవిముక్తి యయినంతనే సంపూర్ణమయిన వికాసము పొందదు. గగనమున నొక యర్థనిమేషము ప్రకాశించిన తరువాత గాని సంపూర్ణకాంతి కనుపించదు. అట్లే దమయంతి స్నానముచేసిన తరువాత చక్కగా ప్రకాశించెను. కిరాతుడు దమయంతి స్నానముచేసినతరువాత, ఫలము లారగించిన తరువాత, నామెతో నీ వెవ్వరిదాన వని యడిగి తన హృదయము చెప్పెను. వాడు 'కాముని శాతశరాహతు డయ్యెను.' కొండచిలువలాల యామె మేన నున్నంత వఱకు వాని కామెసౌందర్యమును, ఆమె చందనగంధి యగుటయు తెలియదు. చెఱువులో స్నానముచేసి, మునిగి, మొగము తోమికొని తల యెత్తెను. 'రజనికరానన'— ఈ మాటచేత స్నానము చేసి లేచుచున్న యామె ముఖదర్శనము వర్ణితము. తరువాత నామె లేచి నీళ్లలో నిలుచుండెను. అపుడు 'పీనపయోధరరాజిత'ను చూచెను. ఈమె రాచబోటి యయియుండు ననుకొనెను. అందుచేత 'రాజసుతకు' అని ప్రయోగించెను. ఆమె చెఱువునుండి బయటికి వచ్చి నడచుచుండెను. ఆ నడక యేనుగు నడచిన ట్లుండెను. అందుచేత 'విలసద్గజపతిగామిని'యని వ్రాసెను.

ఈ విశేషణము లన్నియు నీ మహాక్రమమును బోధించుచున్నవి.

తరువాత నామె వానిని శపించెను. వాడు దగ్ధుడయ్యెను.

మరి సార్థవాహుల కథ. 'ముందట నొక్క చనుపం గని దానిం జొచ్చు నప్పు డందలి జనంబులు' 'చనుపను జొచ్చుట' యనగా సార్థము మైలుపొడుగున నుండవచ్చును; ఇరువదిగజముల వెడల్పున పోవుచుండవచ్చును. ముందు పోవువారికి, వెనుక పోవువారికి కొంత దవ్వుండవచ్చును. వారు పోవునపుడు నిలుచున్నచో గంట పట్టునో, యరగంట పట్టునో! ఎవ్వ రాగుదురు? ఆమె వారిని దాటిపోవుటకు జనుపలో బ్రవేశించినది. 'చొచ్చు' అన్న మాట కిది యర్థము.

దమయంతి యాసమయమున తల చీకిరిబాకిరిగానున్నది, మాసిన పగముగడ్డ కప్పికొన్నది, పిచ్చి దానివలె నున్నది. ఆమెను జూచి కొందఱు పిశాచమన్నారు. కొందఱు భయపడినారు. కొంద ఱధికహాస్యము చేసినారు. కొంద ఱడవిలో నేమి వెతకు చుంటివని వెక్కిరించినారు. కొందఱు 'తల్లీ! నీవు దేవతవని నమస్కరించినారు. ఈ మహాపతివ్రత నిట్లెట్లన్న వారిని వారి వారి ప్రకృతులనుబట్టి రాత్రి నిద్రపోవునపు డేనుగులు పాపులను జంపెను; వెక్కిరించి వెక్కిరించనివారిని వికలాంగులను జేసెను. ఆమెను దేవతవని నమస్కరించినవారు చావలేదు. మరియు నెగతాళిచేసినవారిని 'అఱవనఱవ' చంపెను.

'నేను నలుని భార్యను. మీరు నలుని జూచితిరా?' యని యడుగగా శుచి యనువాడు 'మే మెప్పుడు నలుని చూడలేదు. సింహములను, నేనుగులను చూచుచున్నాము' అని పరిహాసము చేసినాడు. 'మీ రెచ్చటికి బోవుచున్నా' రని యామె మరల నడిగెను. అప్పుడుగాని వాడు తాము 'సుబాహుపురమునకు బోవుచుంటి' మని చెప్పలేదు. ఒక దీనావస్థలో నున్న స్త్రీని చూడగా నెంతటి నిరాదరము! ఇది యెంతటి లోకజ్ఞత! ఇట్టి చెడ్డ నడతకు భగవంతు డెట్టి శిక్ష చేసెను! ఇది కాంతాసమ్మితత్వముగా గావ్యము చేసెడు నుపదేశము.

మిక్కిలి యొండ యెక్కువఱకు నా చనుప నడచి యొక చల్లని నీళ్లు గల చెఱువువద్ద విడిసెను. అంత 'అర్ధరాత్రమునప్పు డందుల కేతెంచె,' గజయూథములు జలకాంక్ష జేసి.' వారు ప్రొద్దెక్కువఱకు నడచిరి. అంత నర్ధరాత్రమున నేమి జరిగెనో చెప్పుట కారంభించెను. అనగా బూర్వము చనుపలు పోవునపుడు తెల్లవారు కడ లేచి, ప్రొద్దెక్కువఱకు బండ్లు నడపించుకొని, యెచ్చటనో విడిసి, కూళ్లు వండికొని యచటనే నిద్రింతురు. మరల తెల్లవారునప్పుడుగాని బయలుదేరరు. ఇప్పటికిగూడ బండ్లు తోలికొని దూర ప్రయాణముచేయువా రంతే! ఈ మహావిషయము పాఠకు డూహించవలసినదే! ఆ పరిస్థితి తెలిసినచో నిది తెలియును. నన్నయ్యగారి రచన యిట్లుండును.

ఆ యేనుగులు వచ్చి చనుపలోని పలువురిని పలువిధముల జంపెను. ఆ చనుప 'అవినీతు సిరియుంబోలె నడగి విఱిసి చనియె.'[1] ఈ యుపమానము మొదట చెప్పినదానికి సరిపోవుచున్నది. ఆ చనుపలో నెక్కుమంది యవినీతులు. కనుకనే దమయంతి నటు పరిహసించిరి. అందుకనియే నశించిరి. ఇదియంతయు వ్యంగ్యభూతమైన విషయము. సుచరితమయిన ధ్వనిమార్గము కంటె విచిత్రమైన ప్రతిభతో నానార్థకల్పనలు చేయుట.

ఆ యేనుగులు దమయంతిని జంపలేదు. వానికి దెలిసి కాదు. దైవమున్నాడు. అప్పు డెవరు చావరాదో వారు మిగులుదురు. ఆమె యనుకొనుచున్నది. 'జీవితార్థులయిన జీవుల సుఖసుప్తులయినవారి జంపె నఱవనఱవ.' ఇచ్చటి 'అఱవనఱవ' యన్న వీప్సా శబ్దము 'అంతికన్యస్తచరణయయిన దాని నొక్క యజగరమ్ము పట్టుకొనిన' యన్న దానివంటిది. జంతు స్వభావజ్ఞాన మచ్చట నెంత యున్నదో యిచ్చట నంత యున్నది. ఏనుగులు నీళ్లకు వచ్చినవి. జనులను త్రొక్కినవి. అవి క్రూరముగా జంపును. చీకటిలో వానికి సరిగా గనిపించదు. జనము భయపడి కేకలు వేయుదురు, అఱతురు. ఈ యఱపులు విని యేనుగులు మరల వెనుదిరిగి వచ్చి చంపును. రాత్రిపూట, నడవిలో నేనుగులు కొన్ని పల్లెలమీదబడి కాదాచిత్కముగా నిట్లుచేయుట, భయపడి యేడ్చిన యేడ్పులు విని తిరిగి పోయి చంపుట-ఇది యథార్థము. సరిగా జ్ఞాపకము లేదు-పది పండ్రెండేండ్లక్రింద నుత్తరహిందూస్థానములో నొక యడవి పల్లెలో నిట్లు జరిగినదని పత్రికలలో వ్రాసిరి. ఈ 'అఱవనఱవ'లోని యౌచిత్యము నా కప్పుడు తెలిసినది.

ఇట్లు పోయినంతమేర నన్నయ్యగారి రచనలో మహార్థములు రత్నములే వెదకవలయును. ఎంత వ్రాసినను సూచికయే గాని సర్వము కానేరదు.

# మధురపండితరాజము

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

జలధరార్భటి

అదె కనుఁగొమ్ము వారిద! విహంగములెల్ల పిపాసచే నదీ
నద సరసీ తటాక భువనమ్ములకుం బరువెత్తుచున్నవే
కద, యిటు చాతకమ్మొ నినుఁగాక మరొక్కని జేరఁబోదు, చూ
డదు, మొగ మెండిపోఁదగిన దప్పి జనించియు నెంత దీక్షయో?

చిరము తపియించి యుపవసించినది, జలద!
చాతకమునకు గ్రుక్కెఁడు జలము లిమ్ము.
క్షణము తూరుపుదెస గాలి సాగెనేని
చాతకం బేడ నీ వేడ జలము లేడ?

రెండు మూఁడు కణమ్ముల దృష్టి జెందు
చాతకమువంకఁ జూడవు, సకలజలము
వ్యర్థముగ గ్రుమ్మరించెద వబ్ధిలోన!
జలదమా! నీ వివేకమ్ము సంస్తుతింతు.

అంతరిక్షంబునందు నీ కభిముఖముగ
శ్రాంతిమై నోరు తెరచిన చాతకమ్ము
జలముమాట యటుండనీ, శ్రవణపేయ
శబ్దమునకైన నోచదా? జలధరంబ!

హిమవర్షణోపద్రవము సైపఁగాలేక
పద్మసంపద యెల్ల బాడువడియె
నీళ్లలో మునిఁగి మొండెములుగా నిల్చిన
నాళమ్ములను దంతి నమలివైచె
వలలు గాలాము లూతలతోడ దండెత్తి
జాలరి కొల్లాడె జలచరముల



గ్రీష్మభానుని చండకిరణజ్వాలజ్వాల
లాహుతిగొనె నగాధాంబువులను
రూపుచెడి రేఖమాసి సరోవరమ్ము
నామమాత్రావశేషమై నవసియుండె

జీవనప్రదుఁ డన్న నీ పావనాఖ్య
సార్థకమ్ముగఁ బూరింపు మయ్య జలద!
వారిధారాభిషేకోత్సవం బొనర్చి
జగతి పరితాప మార్పుము జలధరంబ!
కాద యేనియు దూరమ్ముగా దొలంగు,
అమృతకిరణుని దర్శనంబైన గలుగు.

* * *

దుర్జనతాడనము

పరుఁ డొనర్చెడి యుపకారఫలము లెల్ల
పాలవలెఁ బొట్ట నిండగా గ్రోలి బలిసి
సమయమ్ముఁ జూచి యతనినే చంపవేచు
పాపజాతి కృతఘ్నుండు పామురీతి.

అడవులలోన బచ్చికబయళ్ల నిరాగనవృత్తి గాలముఁ
గడపెడి లేడినాభిదెన గస్తురికాయ ఘటించి యూరకే
మడియఁగఁ జేయు మాయవిధి, మాయురె! దుర్జను నాల్కమూలమం
దిడ దది యేమి? సాధుజన సృష్టి నిరామయమై సుఖంచెడిఁ.

వేదవేదాంత విద్యాప్రవీణుడైన
దుర్జనున కించుకేని సద్బుద్ధి రాదు
మూడుయుగములు మున్నీట మున్గియున్న
ధరణిధరమున కింత మార్దవము రాదు.

ఖలుఁ డొనర్చెడి దుష్కర్మఫలము, సుజను
లనుభవించుట దేహరహస్యమేమొ?
రావణుఁడు సీతనెత్తుకపోవు టేమి?
వార్ధికి నకారణమ్ముగా బంధ మేమి?

ప్రాణహరణప్రగల్భతాపరిణతమ్ము
లైన దారుణవస్తుచయమ్ములోన
అగ్రణి యటన్న యహహ మేల హాలహలమ
ఖలుని నాల్కకు సాటి రాగలవె నీవు?

---



# అరాచకము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

'ఇంత పెద్ద టీ జేమిటి, వేయి రూపాయల కీ కెంప లేమిటి? పోనీ, ఊరకే తీసికోవయ్యా' అని కాపులపాలెపు ఎస్టేటు మానేజరు ఆ కెంపును నరసారాయనిమీదికి విసరికొట్టెను. నరసారాయడు మొగము వేలవేసికొని బయటికి వచ్చెను.

నరసారాయని వాలకము చూచి రెండు వేలకు ఒక కెంపును చేతగొని తేలారెడ్డి లోనికి దూరెను. మేనేజరు దానిని జూచి 'మాతో సరసా లాడుటకు వచ్చితిరయ్యా' అని దానినిగూడ తిప్పి తేలారెడ్డిచేతి లోనికి పార వేసెను. తేలారెడ్డి కనులు తేలవేసి నిర్గమించెను. అతని రాకకే కనిపట్టుకొనియున్న రమణా రాయడు రంయిమని లోనికి పరుగెత్తి నాలుగు వేల కొక కెంపును మేనేజరుముందు దాఖలుచేసెను. మేనేజరు కొంచెము ప్రసన్నుడై 'మరొక అయిదువందలు చేసికో' అని అనెను.

'తమరు రసీదుగనుక ఇప్పించుచో తమ చిత్త ప్రకారమే చేసికొనక పోదునా?' అని రమణారాయ డనెను.

'అదిమాత్రము వీలు కాదని మీ యూరిలో మీ తాణేదారు మీకు చెప్పియుండలేదా?'

'చెప్పెనుగాని నే నంత మోయలేను.'

'నీవు మోయున దేమి? టీజే మోయును.'

'౫౦౦ మాత్రమే నెత్తిపై వేయుడు.'

'ఊఁ, అటులే కానిమ్ము. రాజుల సొమ్ము రాళ్ల పాలు.'

ఈ రీతిగా కాపులపాలెపు ఎస్టేటులోని యిన్నా రకరకముల తుమ్మలబీడు ౪౫౦౦ రూపాయలకు రసీదు లేకుండగను, తగవులలో ఎస్టేటువారికి నిమిత్తము లేకుండ గను ఫైసలా అయ్యెను.

రమణారాయడు జేబునుండి నోట్లకట్టతీసి ౪౫౦౦ చెల్లించి పెద్ద లాభమును లోలోపల నూహించుకొనుచు దానికి తగినంత వినయముతో వంగి దండములు పెట్టి సెలవు పుచ్చుకొనెను. అటు తరువాత బంటు దారి చూపగా అతడు హెడ్ గుమాస్తా గదిలోనికిని, జమీందారు - గారి సొంత గుమాస్తా గదిలోనికిని వెళ్లి కొంతబరువును, పరువును వదిలించుకొని బయటబడెను. అచట పలువురు జవానులు రమణారాయని చుట్టు ముట్టిరి. అతఁ డందరకును భూరిసంభావన పంచిపెట్టి హోటలులోనికి వెళ్లెను.

నరసారాయడు వాకిటి అరుగుమీద కూరుచుండి రమణారాయని రాకకే ఎదురుచూచుచుండెను. రమణా రాయని మొగము కనబడగనే నరసారాయని మొగము తుమ్మలలో ప్రొద్దు గ్రుంకినటు లాయెను.

వీరి మునురదియు కాపులపాలెమే. కాపుల పాలెపు జమీందారుకాపురము రాజులపాలెములో. అచట పలువురు జమీందారులు కలరు. గ్రామవ్యవ హారము లన్నియు రాజులపాలెములోనే ఫైసలా అగును. కాపులపాలెపు తుమ్మలబీటి వ్యవహారము మొదట ఆ గ్రామపు తాణా ఆఫీసులోనే ఆరంభమై రాజులపాలెమున ఆఖరు ఫైసలా ఆయెను.

రమణారాయడు చుట్ట ముట్టించి ఇంజనువలె పొగ వదలుచు నరసారాయని వాలకము చూచుచు ఆవలి అరుగుమీద కూరుచుండెను. నరసారాయడు గూడ చుట్టతో జవాబు చెప్ప నూహించెనుగాని జేబు

రిత్త. తాను కడు పొట్టి. రమణారాయడో? గడ. చుట్టయనిన కొల్వననుగాని గడవలె పొడుగగు టెటులు? ఇంతియ కాదు. రమణారాయడు వర్తకము చేయుచు పది ఎకరములు సంపాదించెను. తన కేదీ కొంద్రె? నరసారాయ డిటు లతనితో ఎందును పోటీచేయలేక ఉల్లల ఉడికిపోయి—'నాకు నారాయణాస్త్ర మున్న దిదే—జమీందారీ రద్దుబిల్లు, ఫారెస్టుఆక్టు' అని తల ఎగురవేయుచు రేలారెడ్డి కెదురుచూచుచుండెను.

'ఏ సినిమాకు వీరి నిద్దరను తీసికొనిపోవను' అని రమణారాయ డాలోచించుచుండెను.

రమణారాయని పొరుగు సహింపలేక అప్పటి కప్పుడు కాపులపాలెము లేచిపోవుటకు నరసారాయ డాలోచించుచుండెను.

'దేవళమునకు మా కైదు వంద లిత్తును. నా దారి కడ్డు రావలదు' అని హఠాత్తుగా రమణారాయ డనెను.

నరసారాయడు చప్పరించెను.

'నామాట విను. నే యిత్తును.'

నరసారాయ డటనుండి వాకిటికి జనెను.

'రెండువేలు' అని రమణారాయడు.

నరసారాయడు తల అడ్డముగా తిప్పెను.

'ఇక పో' మ్మనునటులు రమణారాయడు చేతులు తిప్పెను.

'నీ తెక్కమిటి?' అనినటులు నరసారాయడు పెగ జాడించి రోడ్డుమీదికి నడచెను.

అపుడు వీధులలో నుండు మెర్క్యురిదీపము లన్నియు నొకపరి మెరసెను. దేశదేశాంతరముల వ్యవహారము లన్నిటిని తెలియజెప్పుటకు రేడియో గొంతు చించుకొనుచుండెను. జమీందారుల కారులు షికారులు బయలుదేరెను. సినీమా లారంభమాయెను. అట్టి తరి నరసారాయడు రేలారెడ్డిని కలిసి రమణారాయనిపై కసితీర్చుకొనుటకు అప్పటికప్పుడు కాపులపాలెమునకు దారితీసెను.

[౨]

నరసారాయడును, రేలారెడ్డియు కాంగ్రెసు జిల్లాసంఘపు మెంబరు రాఘవయ్యతో కలిసి ఆలోచించి కలెక్టరుకును, డిప్టీకలెక్టరునకును, తాసిల్దారునకును, కాంగ్రెసు సంఘమునకును—

జైహింద్

అయ్యా!,

కాపులపాలెం గ్రామస్థుల విన్నపములు. మా గ్రామంలో జమీందారుకు సుమారు ఇన్నూరెకరాల తుమ్మలబీడున్నూ, రెండు వేల ఎకరాల అరణ్యమున్నూ ఉన్నది. సదరు బీటిలో తుమ్మలు బండ్ల అడ్లకున్నూ, కుండలకున్నూ, పూటీలకున్నూ, కమ్మలకున్నూ, నాగళ్లకున్నూ: ఒకటేమిటి సకలవ్యవసాయపు పనిముట్లకున్నూ ఉపయోగిస్తవి. జమీందారుగారు, స్వలాభం చూచుకుని బిల్లుకు విరుద్ధంగా సదరుబీటిని అమ్మినటులు తెలుస్తున్నది. కొన్నవారు వెంటనే కొట్టివేసి పంటచెరుకుకింద అమ్ముకుంటారు. ఈ బీడుగనుక కొట్టివేస్తే మా వ్యవసాయానికి మేడికూడా లేకుండా పోతుంది. అధికాహారోత్పత్తిమాట అటుంచి ఆహారోత్పత్తే కాదు. కాబట్టి సదరు తుమ్మలను కాపుదారీ చేయించగలందులకు కామందులవారిని మహామహా ప్రార్థిస్తావున్నాము. చిత్తచిత్తమునకు తేవలెను."

అని అర్జీలు వ్రాసి రిజిస్టరుచేసిరి.

'ఇంత డబ్బు కట్టిన రమణారాయడు ఊరక పోవునా? ఏదో ఒకనాడు పొద్దుపొడుచువరకు మనకీ బీడు కనబడదు' అని లేబరుపార్టీలోని కూలివారందరును ఏకగ్రీవముగా అనిరి.

'ఇది జమీందారీ గవర్నమెంటు కాదు. కాంగ్రెసు గవర్నమెంటు' అని నరసారాయడును, రేలారెడ్డియు వారికి సమాధానము చెప్పిరి. ఈరీతి వాదోపవాదములతో గ్రామములో కొంతమంది రమణారాయని పక్షమును, మరికొంతమంది నరసారాయని పక్షమును అవలంబించిరి. తటస్థులుగా నున్న కొంతమంది 'ఉన్నచో గ్రామమంతయు రమణారాయని పక్షమున

నయినను ఉండవలె, లేదా బిల్లుపత్రమునవయినను ఉండవలె. కొందరటు, కొందరిటు ఉన్నచో ఈ కమ్మలు ప్రజలకు ఉపయోగింపకపోగా పైపెచ్చు ప్రజలలో కావేషములు పెరుగక తప్పదు. కాబట్టి యిప్పుడే గ్రామస్థుల నందరను ఒకచోట సమావేశ పరచి అటో యిటో తేల్చివేయుట మంచిది.' అని పలికిరి.

అప్పుడే రమణారాయుడు తెల్లటి పాగతో, మోకాలు దాటిన చొక్కాతో చుట్టమీటుచు గ్రామములోనికి వచ్చుచుండెను. అప్పుడే సమావేశము కొఱకు గ్రామమంతట ఆమూలనుండి యీమూలవరకు డప్పు మోగుచుండెను.

ఆ సమావేశమునకు హాజరయినవారు ముగ్గురనిన ముగ్గురు.

౧. నరసారాయడు. ౨. శేలారెడ్డి. ౩. రమణారాయడు.

వీరు మూవురును ఒకరిమోము మరియొకరు చూచుకొనుచు చాలసేపు కూరుచుండిరి.

'నీవు గ్రామము నంతయు నీపక్షమునకు తిప్పుకొనగా సమావేశ మెటులు జరుగును?' అని నరసారెడ్డి అనెను.

'నీవు నీపక్షమునకే తిప్పుకొనలేకపోతివా?'

'అటు లగుచో అందరును ఒకచో సమావేశ పరచు టెందులకు?'

'ఎవరు పరచిరి? మీరు అర్జీలు పెట్టినతరువాత ఈ సమావేశము లెందుకు? మీ దొక పార్టీ. మా దొక పార్టీ. చూచుకొంద మిక బలాబలాలు'.

ఈ మాటలు విని నరసారాయడును, శేలారెడ్డియు ఒకరికంటె మరియొక రంగలు ముంగలికి వేసికొనుచు మాయమయిపోయిరి. రమణారాయడు కనిపించినంతవరకును వారిని చూచి అంతట తాణాలోనికి వెళ్లి నిలువబడెను.

'ఏమి మహానుభావా, యిటు వచ్చితివి? ఇరువదివే లొక్కసారి కొట్టివేసితివి. కట్టు మేడ, మేడ కట్టి పారవేయుము' అని తాణేదా రనెను.

'ఆకాశములో కట్టనే కట్టితిని. అదియు అడుగంట కూలిపోయెను. వా రర్జీ యిచ్చిరి. ఐపోయినది. టెండరు పెట్టుటకుముందు తమ కిచ్చిన నూరు మరల మీకడనుండి తీసికొనవలసివచ్చెను.'

'ఇదెక్కడికి పోవునయ్యా పిచ్చివాడా? ముందు మేనేజరుకడకు పరుగెత్తి ఆ నాలుగువేలును, పైముడుపులును తెచ్చుకో.'

'చిత్తము.'

'ఓరి! ఏ రెంతపని చేసిరి. పోనీ, వారిమొగాన కొంత పారబోయకపోతివా?'

'వే యిత్తు నంటిని. రెండు వే లిత్తునంటిని. చూచి కూరుచుండబెట్టి వారికి భాగ మెటులు పెట్టను స్వామీ?'

'ఆహా! అగుచో వారి సంగతి తిన్నగా కనుగొనవలసినదే. ఎస్టేటు నీతరఫు.'

## [3]

కాపులపాలెములో జమీందారుపొలాలను,' గ్రామకంఠములను, చిల్లరమల్లరలను తాణేదారు మొదట పాలేరువరకు అమ్మజూపుచుండిరి.

'కొనినను మీ కివి దక్కవు. ఇవి గ్రామకంఠములు. ఇవన్నియు ఉమ్మడిసేలలు' అని బిల్లు ఎరిగిన కాంగ్రెసువాదులు చెప్పుచుండిరి.

'గ్రామకంఠ మేమిటిరా చలికంఠము. మీతాత అబ్బలనాటినుండియు జమీందారుదై యీతెల్లవారు తలికె ఉమ్మడిదై కూర్చున్నదా? శిస్తు చెల్లించలేక మీతాత ఎన్నాళ్లు ఇక్కడ బండకొయ్యలో కూర్చుండెనో నీ వెరుగవా? నీ హయాములో నీవు పసువులకు పుల్లరి చెల్లించలేకపోగా నీ పసువు లెన్నిసార్లీదట బందెపడియుండెనో చెప్పవలయునా? ఏమి న్యాయమయ్యా? ముమ్మాటికి దివాణమువారిదే హక్కు. మేము అచ్చుకరుకులు పోసి కొనుచుంటిమి.' అని కొను వారి తరఫున రమణారాయడు వకాలతు పుచ్చుకొనెను.

'అటు లగుచో రిజిస్టరు చేయించుకొనుడు, చూతము' అని కాంగ్రెసువారు లనుచుండిరి.

'రిజిస్టర్ చేయము, మీరు నుండే స్థల మాక్రమించుకొనుడు—అని ముమ్మొదటనే కామందులవారు చెప్పిరి. అదియుగాక మేము మేనేజరు మొదలు పాలేరువరకు అందరను సంతోషపెట్టితిమి.' అని కొన్నవారు సమాధాన మొసగుచుండిరి.

'కాంగ్రెసువారును, కమ్యూనిస్టులును అటులే అందురు' అని జమీఉద్యోగస్థులు కొన్నవారికి భూము లప్పజెప్పి జేబులు నింపుకొనుచుండిరి.

కొన్నవారు తాము కొన్న స్థలములకు కంప వేసి ఆబాదు చేసికొనుచుండిరి. పొద్దు పొడుచువరకా కంపయు గింపయు కంటికి కనబడకుండ బోవు చుండెను.

అటు జమీందారులకుగాని, యిటు ప్రజలకు గాని హక్కు లేకపోవుటవలనను, కలెక్టరులకు పెట్టుకొనిన అర్జీలు అరణ్యరోదనము లగుటవలనను అరణ్యములు, గ్రామకంఠములు, గ్రామనివేశనములు, కమతములు మొదలగున వన్నియును పేచీలకు పెదబాబులై కూరుచుండెను.

'ఫారెస్టు ఆక్టు తెలియదాయె. రద్దుబిల్లు తెలియదాయె. అదియు ఆక్టు ఐన దనిన తెలియదాయె. అధికారములు, స్వత్వములు ఇచ్చినను వానిని ఉపయోగించుకొనుట తెలియదాయె. ఇట్టి మూర్ఖ మూఢ ప్రజతో హిందూదేశమంతయు రిపబ్లిక్ గామారి...' అని కాంగ్రెస్ రాఘవుడు ఉద్యోగరాఘవుడై కడవెడు కన్నీరు కార్చెను.

'జమీందారుకమతాలను ఆక్రమించుడు. అడవుల నరకుడు. కాళీస్థలములలో కాపురములు పెట్టుడు. కూలిరాజ్యము నిర్మింపుడు' అని కామ్రేడ్ గంగారాయుడు కొంతమంది పిల్లలను వెంటవేసికొని వీధులవెంట అరచెను.

ఇట్టి స్థితిలో మేనేజరు కాపులపాలెములోనికి మకాము చేయ వచ్చెను. ఎవరును పిలువకుండగనే కాపులపాలెములోని చిన్నలును, పెద్దలును తాణాలోనికి వచ్చి చేతులు కట్టుకొని పూర్వాచారానుక్రమముగా నిలువబడిరి.

'ఓరి తొత్తుకొడుకులారా, ఏమి తప్పుచేసి మీరీ నిలువు శిక్ష అనుభవించుచున్నారురా ? జమీందారీ పద్ధతి కూలిపోవుగాక. కూలిరాజ్య మంకురించుగాక' అని తాణావెలుపలనుండి కామ్రేడ్ గంగారాయుని కేకలు వినవచ్చెను.

'మేము మిమ్ముల నెవరిని నిలువు డని అనలేదు. అందరును కూరుచుండుడు' అని మానేజరు అనెను.

వచ్చినవా రందరును ఒకరిమీద నొకరు కూరుచుండిరి.

'నేటినుండియు అరణ్యముమీదను, తుమ్మలబీటి మీదను గట్టి కాపలా చేయింపుడు' అని మేనేజరు తన క్రింది ఉద్యోగస్థులతో ననెను.

'చిత్తము'.

'మేముగూడ నలుగురు మనుష్యులను మీ జవానులకు తోడు చేయవచ్చునా ?' అని నరసారాయ డడిగెను.

'మీ కేటి హక్కు ?' అని తాణేదారును, సముద్దారును, నిగహోవానును, జవానును ఏకకంఠముగా ననిరి.

'హక్కు మాట ఎందుకు ? మీరును మీ మనుష్యులను తోడు చేయవచ్చును.' అని మానేజరు తన క్రింది ఉద్యోగస్థుల నందరను క్రీగంట జూచెను.

వారు దాని అర్థము కనిపెట్టి మెదల కూరకుండిరి.

'చూచితివా బిల్లుదెబ్బ ?' అని ఒక డొకని చెవి కొరికెను.

మేనేజరు నిగహోవానును పిలిచి 'అరణ్య మెవరును కొట్టరా దని టముకు వేయించునది' అని ఆజ్ఞాపించెను.

'మేముగూడ వేయింపవచ్చునా ?' అని నరసారాయ డడిగెను.

'ఓ మహారాజులాగు.'

అంతట రమణారాయడుతక్క తక్కినవా రందరును వెళ్లిపోయిరి.

పై ముడుపులుతప్ప రమణారాయని దెబ్బ రమణారాయనికి ముట్టెను.

మేనేజరు మరియొక యూరికి కాంపుకు పోవుచు తాణేదారును పిలిచి 'నరసారాయని టముకు వానికడ వాఙ్మూలము పుచ్చుకొని ఉంచునది' అని ఆజ్ఞాపించెను.

ఆ సాయంకాలము 'అడవి కొట్టేవారికి అర దండాలోయ్' అని అరచుచు టముకు మోగెను. దాని వెనువెనుక నే 'అరణ్య మందరిది నోహోయ్' అని మరియొక దప్పు మోగెను.

[౪]

కాపులపాలెములో ఒక మోపెడు పుల్లలకు కానియు, కావడి కట్టెలకు రెండు కానులును పుల్లరి పుచ్చుకొను రివాజు. ఆడుది కానియు, మగవాడు రెండుకానులును పుల్లరి కట్టి చీటి పుచ్చుకొని వానిని పట్టుకొనిపోయి అడవిమీద నున్న గార్డులకు చూపి మోపులును, కావళ్లను తెచ్చుకొని జీవించుచుందురు.

కట్టెయ లమ్ముకొని జీవనము చేయుచుండు హరిజనులు సుమారు రెండువందలమంది చీట్లకొరకు తాణా లోనికి పోయి నిలువబడిరి.

'ఇక మీకు చీటు లెందుకురా? అరణ్యము లన్నియు మీవే. బిల్లు వచ్చినదిగా బిల్లు. జమీందారు లిక కూలి చేయుదురు. కూలివా రిక జమీ లేలుదురు. ఓడలు బండ్లగును. బండ్లోడ లగును.' అని తాణేదా రనెను.

'మా కెందుకండీ జమీలు? ఏలినా పేలినా పెబువులు తమకు చెలామణీ. పొద్దెక్కిపోద్ది బాబు. ఎంటనే చీట్లు రాపిచ్చండి. ఇప్పుడు గట్టెక్కితే చీకటి చూడంది దిగి రాలేము' అని ఒక వృద్ధు డనెను.

'నిజముగానేరా. అడవి నేడు మీకు చూర విడిచితిమి. అందులకు ప్రత్యుపకారముగా మీరు దివాణమున కొక పని చేయవలెను.'

'ఏటది బాబు?'

'మా జవానులు మీకు అడ్డు రారుగాని నరసారాయని ముశాజవానులు అడ్డు వచ్చుటో పక్కలు విరుగ దన్ని పంపవలెను',

'అదెంత పని? మా కెవళ్లు అడ్డువచ్చినా గొడ్డళ్లకు పదును పెడతాం'అని కామ్రేడ్ కోటడు అన్నాడు.

కోట డిటు లనినపిదప తాణానుండి జనప్రవాహము అడవికి ప్రవహించెను. వారి వెనువెనుక నే రమణారాయడు.

కూలివారికి రెక్కలే వచ్చెనో డెక్కలే వచ్చెనో—ఆ మరునిమిషమున వారు కొండనెత్తము మీద కనబడిరి. వా రొక్క పెట్ట కోతులవలె చెట్లంతటను వ్యాపించిరి. వడ్లంగిపిట్టలవలె చెట్లు కొట్ట మొదలిడిరి.

జమీందారు జవాను లందరును ముచ్చులవలె బండలచాటున నక్కిరి. నరసారాయని ముశాజవానులు హరిజనులమీద పడి వారి చేతులలోని గొడ్డళ్లను లాగుకొనజొచ్చిరి. హరిజను లందరును చక్రాకారముగా ఒరసికొనివచ్చి తమ గొడ్డళ్లు తాము లాగుకొని వారిని చావ చితుక బాది వదిలిపెట్టిరి. వారు ఊర్ధ్వశ్వాసలతో గ్రామములోనికి పరుగెత్తలేక పరుగెత్తలేక పరుగెత్తిరి. కొంద రచటనే పడిపోయిరి. ఈ వార్త ఉత్తర క్షణముననే కార్చిచ్చువలె చుట్టుప్రక్కల గ్రామము లన్నిటికిని వ్యాపించెను.

గ్రామాంతరములనుండి అరణ్యములోనికి బండ్లు రాజొడగి శ్రీశైలయాత్రను, భద్రాద్రియాత్రను తలపించెను. అడవిపందు లొక పొదనుండి మరియొక పొదకు పారిపోవులోపల ఆపొదగూడ తెగిపోవుచుండెను. అపు డడవిపందు లూరబందులవలె నలుదెసల బరువిడజొచ్చెను. లేళ్లు ఊళ్లమీది కెగబడి మేకలమందలలో కలిసిపోజొడగెను. తోడేళ్లు తోటలలోనికి లగువు తీసెను. వేగోలములు గుహలలో దూరెను. నక్కలు బొక్కలలో నక్కినక్కి చూడగడగెను. ఆశ్రయవృక్షముల పాటునకు అడవిపిట్ట లరణ్యరోదన మొనరించెను.

తప్పెటలు మోగుచున్నటులు, మబ్బు లురుముచున్నటులు, పిడుగులు పడుచున్నటులు, బండలు దొరలుచున్నటులు, కొండలు బ్రద్దలగుచున్నటులు

లేక పెట్టెను. కొందరు తాము కొట్టిన కట్టియల నన్నిటిని ప్రక్కనున్న చెరువులో పడవైచి పరువెత్తిరి. మరికొంద రెరువుగుంటలలో కుక్కి గడ్డి కప్పిరి. కూలి వారు పోలీసుల దారి విడిచి చెల్లాచెదరై తల కొక యూరుగా బారి అప్పటికప్పుడు కట్టెలు అమ్మబోయిరి.

అటుతరువాత నరుకులు కక్కుకొనుచు ఠాణేదారు పోలీసులను వెంటబెట్టుకొని తుమ్మలబీడు కొచ్చెను. పోలీసువా రంతయు కలయదిరిగి సుమారు మూడువేలతుమ్మలు నరకినటులు లెక్క తేల్చిరి— 'నరకిన తుమ్మలను మాకు చూపి సాక్ష్యము తెచ్చికొను' డని చెప్పి స్టేషనుకు వెళ్లిపోయిరి.

కొట్టిన పేడొకటి కనబడదు. దేవుడొక్కడే సాక్ష్యమునకు మిగిలెను. అతడు సర్వసాక్షి యయినను సాక్ష్యమునకు రాడు. ఇట్టి స్థితిలో ఏమియు తోచక ఠాణేదారు తన క్రింది ఉద్యోగస్థులను, పాలేళ్లను, జవానులను పిలిచి ఆలోచించెను. దాని పర్యవసాన మిది: 'పాలేళ్లు కొందరు నడిజామున పోయి రైలు పట్టాలను పీకవలెను. నరసారాయడును, తేలారెడ్డియు పీకుచుండగా చూచితి మని జవానులు సాక్ష్యము చెప్పవలెను. కాంగ్రెస్ మూకా యంతయు కమ్యూనిస్టుముఠా యని నిగహోవానును, సముద్దారును నిరూపింపవలెను.'

ఈ ప్రసంగమున కందరును అప్పటప్పటికి తల లూపిరి. ఠాణేదారు వెంటనే పదుగుర కాపలాతో రాజుపాలెము వెళ్లిపోయెను. ఆ రాత్రియే సముద్దారు పాలేళ్లను పిలిచి రైలు పట్టాలను పీక బొమ్మని ఆజ్ఞాపించెను.

'పీకుచుండగా మమ్మల నెవరయినను పట్టుకొనినయెడల మేమే కమ్యూనిస్టుల మయిపోమా? కాబట్టి ధైర్య ముండెనేని తమరే, యీ పని చేయుచుండగా దూరముగా నుండి మేము సాయము చేయగల వారము. వెంటనే తాము బయలుదేరవలయును' అని పెద్దపాలేరు పలుగు తెచ్చి సముద్దారు పాదముల ముందుంచెను.

ఇటు లీ పని నెరవేరలేదు గాని యీ వార్త మృత్యువార్తకంటె నెక్కుడు వడిగా గ్రామమంతయు వ్యాపించెను.

ఆ రాత్రి గ్రామమునందలి పెద్దలును, పిన్నలును రచ్చమానికింద పోగయిరి.

'ఆవువంటి ఊరును పులిగా మార్చిరి. ఇక ఈ పులి బోనులో పడక తప్పదు' అని ఒక డనెను.

'ఎవరు మార్చిరి?'

'నరసారాయడు.'

'కాదు, రమణారాయడు.'

'వా రిరువురును స్వలాభమునకు తుమ్మలు పాడిరి. నరసారాయడు బిల్లు అడ్డము పెట్టుకొని తాను కాంగ్రెసునాయకు డాయెను. రమణారాయడు ఎస్టేటులో చేరి జస్టిస్ నాయకు డాయెను. వీ రిద్దరకును కాంగ్రె సన్న నేమియో తెలియదు; జస్టిస్ పార్టీ అన్న నేమియో తెలియదు. వీ రిరువురు నిటులు స్వలాభమునకు పోరాడుచుండగా గ్రామస్థులు వీరిలో నేల దూరవలెను? వీరికిని స్వలాభ మున్నది. స్వలాభమే ఇన్ని యాట లాడుచున్నది.'

'కాంగ్రె సనియు కమ్యూనిస్టనియు ఎరుగని నాడే సుభిక్షమయినను, దుర్భిక్షమయినను పోరును పొక్కును లేక గ్రామము సుఖముగా నున్నది. మన యీ కుగ్రామములో కాంగ్రెసు వద్దు, కమ్యూనిస్టు వద్దు. ఎవరి దారిని వారు పోండు.'

'గాంధీకి జై!'

'కూలీకి జై!'

[౬]

నిగహోవాను తన సిబ్బందితో పదిమంది దొంగలను ఠాణాకు నడిపించుకొని వచ్చి కట్టెలమోపులను అచట పడవైపించుచుండెను. లేబరు ముఠావా రది చూచి ఠాణాలోనికి పరుగెత్తి ఆ మోపుల నెత్తుకొని పోయిరి. అపుడు కామ్రేడ్ గంగారాయడు—'మీ మీద కేసు పెట్టినచో ముష్టి యెత్తియేని నేను నిర్వహింతును. మీ రందరును పోయి తుమ్మలు నరకి తెచ్చుకొనుడు. అరణ్య మంతయు ఠాణేదారు నరకించి బారుగూళ్లకు సంతర్పణ చేసెను. మనము-ప్రజలము, కూలీలము - మనపొట్టలకు తుమ్మల నరకుదము. జమీందారీపద్ధతి కొంకటిపేరులకు కూలిపోవలెను. కూలి రాజ్యము కుదురుకొనవలెను' అని అరచెను.

'అయ్యరో! అరణ్యముతోపాటిదియు పొరుగూళ్లపాలయిపోవును. రైతులకును, రాజులకును కొరగాక యిద్దిరెంటికి చెడిన రేవణ యగు' నని కాంగ్రెస్ రాఘవయ్య నివారించెను. స్వలాభము నెవడు మానుకొనగలడు? హరిజనులందునను, కూలివారలందునను గల స్వలాభమను అంగారముపై రివ్వున గాలి విసరెను. అది బగ్గున మండెను. ఆ మంటవెలుగే దారి చూపగా హరిజనులందరును ఆ కారుచీకటిలో బీటిలోనికి చొరబడిరి.

అందులకే కనిపెట్టుకొనియున్న పరిసరగ్రామముల పెద్దపెద్ద రైతులందరును ఈ నల్లబంగారము నెత్తికొనిపోవుటకు బండ్లు కట్టుకొనివచ్చిరి. దీపములు పెట్టుకొని రంపములతో కోయువారు కోయుచుండగా, గొడ్డళ్లతో కొట్టువారు కొట్టుచుండగా, కత్తులతో నరకువారు నరకుచుండగా, కొడవండ్లతో కూల్చువారు కూల్చుచుండగా, కంపతొడుగుతోగూడ మోసికొనిపోవువారు మోసికొనిపోవుచుండగా రెండు రాత్రులలో రెండువందల ఎకరముల బీడంతయు అయ్యవారి నట్టిల్లయిపోయెను.

అంతవరకు రమణారాయని మునావారు తక్క గ్రామస్థు లెవరును ఏడ్చువారే గాని ఆ బీటివంక కేగినవారు కారు. చివరపర్వములో అది చూచి ఓర్వలేక పారవైచిన చిరుకులను ఏరి తెచ్చికొని కొందరు దొడ్లలో వేసికొనిరి.

ఇది యంతయు జరిగిపోయిన కొలది నాళులకు జమీఉద్యోగస్థులు 'ఊరిమీద కేసుపెట్టితిమి. రేపు రిజర్వుపోలీసులతో మిలిటరీ దిగును. కట్టెయ లున్నవారిని జేళ్ళకు నడపింతురు. కావున ఎవరియిండ్లలో, ఎవరి దొడ్లలో తుమ్మపుల్ల కలదో ఆ యిండ్ల నన్నిటిని రమణారాయని తోడుతో సోదా చేయుదుము' అని పాలేళ్లకును, జవానులకును ఆదేశించిరి.

తమ పక్షములోవారి పుల్లనంతయు తరలింపుమని ఆ వెనుకనాడే రమణారాయడు హెచ్చరించెను. బడితెలవలె నున్న కొందరు పాలేళ్లును, జవానులును రమణారాయడు వెంటరాగా ఇల్లిల్లు తిరిగి తుమ్మబడితెలను చూడమొదలిడిరి. ఈ రీతికి గ్రామమంతయు భయగ్రస్తమయిపోయెను. నరసారాయడు గ్రామము విడిచి పారిపోయెను. దాగుకొనుటకు అరణ్యము గాని, అధమము తుమ్మలబీడుగాని యిపుడు లేకపోవుటకు ఆ యూరివా రందరిపు డెంతయు విచారించిరి.

కమ్యూనిజ మన నేమియో ఎరుగని కమ్యూనిస్టు లావరించిన చుట్టుపట్టుల గ్రామము లన్నియు మిలిటరీ వారి దర్పమునకు గురి యగుచుండుట కాపులపాలెమువారెరిగినదే. దానికి బెదిరి చీకటి ముదిరిన పిదప కట్టెయలు కలవా రందరు వాని నన్నిటిని తీసికొనిపోయి వాగులందును, వంకలందును, పొలములమీదను, పొదల మీదను పారవైచి వచ్చిరి.

తెలవారుతోడనే నిగహోవా నది కనిపట్టియే యున్నవాడుగనుక బండ్లు తోలించుకొనిపోయి రైతులు పారవైచిన తుమ్మకట్టెయల నన్నింటిని తాణాకు తోలుకొనిపోయెను. ఇపు డెవరు నెదురు పోయి ఆ బండ్ల నాక్రమించుటకు సాహసింపలేరు. కామ్రేడ్ కాటడు, కామ్రేడ్ గంగారాయడు, హరిజనులు, ఒకరేటి అందరును ఆ సంగతి ఎరుగనటులే ఊరకుండిరి.

ఒకటి, రెండు, మూడు వారములు అతిభయంకరముగ గడచిపోయెను. మిలిటరీ కాదు సరికదా, ఒక ఎఱ్ఱటోపియేని గ్రామములోనికి దిగలేదు. అపుడు రమణారాయనిపక్షములోని పిన్నవయసువారు నరసారాయని పక్షమువారిని చూచి 'మిలిటరీ మిలిటరీ' అని ఎగతాళి పట్టించిరి. తంత్రము, తంత్రవార్తికము నపు డందరకును తెలిసిపోయెను.

అపుడు రమణారాయనిపై అడువారుగూడ కత్తులు నూరిరి. ఊరివా రందరును ఉద్యోగస్థులను ఉప్పళించుటకు సమయము చూచుచుండిరి. కాపుల పాలెములో నిపు డొక్కొక్క డొక్కొక్క అగ్నిపర్వతము.

# కవిస్మరణము-చామర్తి రాజశేఖరరావు

●

శ్రీ నోరి నరసింహశాస్త్రి

౧

'ధృతరాష్ట్రుండతిపుత్త్రతుండు కల ధా
త్రీనాయకుల్ భీరువుల్
ప్రతికూలంబు జగంబు కాలపరిప
క్వంబైన యందాక భా
రతసామ్రాజ్యరమాభిలాష తెలుపన్
రాదమ్మ, దుశ్శాసనో
ద్ధతి సైరించు నటమ్మ యుత్తమ సతీ
ధర్మంబులన్ ద్రౌపదీ!'

ఈ విధంగా ఇంచుమించు ముప్పదియేళ్ళ క్రిందట పంజాబుదురంతములగూర్చి రాజశేఖరకవి విలపించినాడు. ఈమధ్య పంజాబులో జరిగిన దురంతములు అంతకంటె భయంకరమైనవే కాని ఇవి జ్ఞాతి కలహములు. ఆ దురంతము లట్లు కాదు. ఆంగ్లేయపరిపాలనలో మొదటి మహాసంగ్రామము మైనపిమ్మట ఆంగ్లేయప్రభువుల సైనికులు స్వయముగా చేసిన దురంతము లవి. ఆ రాష్ట్రపు గవర్నరు, సేనాధిపతి కారకులు వానికి. ఆ దురంతకథలు విన్నప్పుడు బిగిసిపోయిన ముసలి భారతీయుల రక్తమే ఉడుకెత్తినది. నవయౌవనములో నున్న రాజశేఖరరక్తము మరి ఎంత ఉడుకెత్తినదో! ఆ పొంగు నిండిన కవితాహృదయముతో ఆ 'పాంచాలీసాంత్వనము' చేసినాడు. రౌలటుచట్టము అమలులోకి వచ్చినందున ప్రజలు తమ కష్టము స్పష్టముగా వెలిబుచ్చుటకును వీలులేదు. కవికి శ్లేష సహాయమైనది. రౌలటుఅక్టు అను దుశ్శాసనము సద్ధతి దుశ్శాసనోద్ధతి ఐనది. ఇప్పుడు మరల పద్యము చదివిన తేటపడును.

అందులోనే అత డింకా ఈ విధముగా అన్నాడు:

" చేసేతం గదుర్మార్గులై భరతల
క్ష్మిన్ నిన్ను సాధ్వీమణీ
గాసిం బెట్టిరి ధార్తరాష్ట్రు లకటా!
కాలంబు రాపయ్యె!—"

కవులు ద్రష్టలు! అందుచే భవిష్యత్తులో రాబోవునది వారికి గోచరించుటలో ఆశ్చర్యము లేదు. ఆ కావ్యము చెప్పిన ముప్పైయేండ్ల లోపుగాని కాలము వచ్చి భారతసామ్రాజ్యలక్ష్మి సిద్ధించినది. కాని అది కండ్లార చూచి ఆనందించు భాగ్యము రాజశేఖరకవికి లేకపోయినది. దానికై పోరాడినవారు మేము సంపాదించితి మని గర్వించుట వృథాభిమానము. ఈ పోరాడినవారు నిమిత్తమాత్రులే, సాధనప్రాయులే! దాని సిద్ధికి నిజమగు మూలకారణము రాజశేఖరునివంటి కవిద్రష్టల తీవ్రతపస్సే!

౨

అతడు జన్మించినది ౧౮౯౮ ప్రాంతము. అతడు పుట్టిన ఐదవనాడే కన్నతల్లి గతించినది. తండ్రియు, తండ్రితల్లియు, ఆ పసిగుడ్డును పెంచలేక కాబోలు, పారవేయదలచి ఒక భోషాణముక్రింద చింకిచాపమీద వేసిరట. చీమలు, పురుగులు ఆ శిశువు నారగింపసాగినవి.—ఇది కథ కాదు! అతని స్వహస్తలిఖితమగు ఉత్తరమే నాకు సాక్ష్యమున్నది. ముప్పైయేళ్ళక్రిందట అతడు వ్రాసిన మాట లివి:

> " నాకు అయిదురోజులప్పుడు కన్నతల్లి చచ్చిపోయినది. నా తండ్రి, తండ్రితల్లి, ఇతరబంధువులు నన్ను పారవేయుటకు నిశ్చయించిరట! భోషాణము క్రింద ఒక చింపిచాప వేసి నన్ను పండుకోబెట్టి అందరును పోగా కొంతసేపటికి నా తల్లి వచ్చి చూచినది. శరీరమునకు చీమలు, దోమలు, ఈగలు మొదలగు పురుగులు పట్టినవి. అప్పటినుండి ఇప్పటివరకును నాకాధారమై పోషించినది యీ తల్లియే!"

అట్లు వచ్చి పోషించిన తల్లి అతని పెదతల్లి రాజమ్మ గారు! ఆమె రాజశేఖరుని కష్టలనుండి జగ్గయ్యపేట తీసికొనిపోయినది. కాని ఆ పిమ్మట ఆరేండ్లకే ఆమె భర్త కాలముచేసెను. ఆమెకు కన్నబిడ్డలు లేరు. రాజశేఖరుని తన కన్నకొమారునికంటె ఎక్కువ ప్రేమతో పోషించినది. కొన్నాళ్ళకు అతనిని చదువుకు గుంటూరు తెచ్చినది.

అంతకుమునుం దెప్పుడు వచ్చినాడో కాని నా కత నితో పరిచయము ౧౯౧౦ లో. సెకండుఫారములో ఇద్దరమూ ఒకే డివిజనులో చదివినాము. ఆ సంవత్సరము స్కూలు ఫైనలు పద్ధతి క్రొత్తగా పెట్టినారు. ఆ యేటే స్కూలు సంవత్సరాంతము డిశంబరునుండి ఏప్రిలుకు మారినది. అందుచేత మా కా సంవత్సరము సంవత్సర మున్నర ఐనది. అంత దీర్ఘ సంవత్సరములోనూ నా కతని విషయము జ్ఞాపక మున్నది రెండే. అప్పుడు రోజూ క్లాసుమార్కులు వేసి నెలనెలకూ ప్లేసులు మార్చేవారు. ఒక్క నెల తప్ప ఎప్పుడూ అతనికంటె పైప్లేసులో ఉంటినిగాని తెలుగు క్లాసులో మాకు పోటీ సమానముగా ఉండేది. నా కా సంవత్సరమే ఉప నయన మైనది. కాని నాకంటే అతని మెడలో యజ్ఞోప వీతమే కాక విశేష మొక పట్టుత్రాడు వ్రేలాడు చున్నట్లు తోచిచూచేది. అతడు లింగధారి, ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. ఆ పట్టుత్రాడు ధరించునది అతని ప్రాణలింగము!

౧౯౧౧-౧౨ లో మేము మూడవఫారము ఒకే డివి జనులో పడ్డాము. నాకు పదకొండేళ్ళు. లక్షణము నేర్చుకొని నేను పద్యము లల్లడము అప్పుడే ప్రారం భించినాను. అతడు నాకంటె కొంచెము పెద్ద. కాని అతడు ఆ సంవత్సరము ఒక్కసారి అకస్మాత్తుగా కవే అయిపోయినాడు. అంత పెద్ద కాలేజిలోనూ ఆ మూడవఫారము విద్యార్థియే ఏకైక కవి! ఏ టీచరు వెళ్లిపోయినా, మరి ఏ క్లాసులో ఏ చిన్న ఉత్సవము చేసినా, దాని కతడు పద్యాలు వ్రాయవలసినదే. సంగీతము రాకున్నను, మనోజ్ఞముగ నతని కంఠములో నతడు చదువవలసినదే! భాషాజ్ఞానము ఎంత తక్కువైనా, మొదటినుండీ అతని పలుకులలో పొందికా, తీయదనమూ ఉండేవి. అతడు పద్యము చదువుట కవి కంఠమువలె ఇంపుగా ఉండేది! అతడు కవియైన వెంటనే నా ఆప్తమిత్రు డైనాడు!

## 3

ఆ సంవత్సరమే శ్రీ తిరుపతి వేంకటేశ్వరులకు, కొప్పరపు సోదరకవులకూ గుంటూరులో చర్చివివాదము ప్రారంభ మైనది. రెండు కొంపులలో రెండు పక్షముల వారు తిష్ఠవేసినారు. రెండుపక్షములపై నభిమానము కల విద్యాంసులు, కవులు గుంటూరుకు మూగసాగినారు. అది శతావధానయుగము! ఆశుకవిత్వయుగము! నిజ ముగా కవియుగమే అది! జన మంతటికీ కవిత్వాభి మానము ఒక్కసారిగా ఆవేశించినది. అవి నిజముగా కవిత్వస్వరాజ్యోత్సవము జరిగిన రోజులే! ఎక్క డెక్కడివారు—ఇటువారు, అటువారు—కవుల ను మారుమూలలనున్న గ్రామములకు తీసికొనిపోయి ప్రజలు సన్మానించువారు. దాని కంతటికీ మూలకారణము స్పర్ధయే యగుగాక! పొరపా టెవరి దైన నగుగాక! ఆ పండుగ చూచిన కవులే ధన్యులు.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు తమ కరపత్రములు వచనములో వ్రాసెడివారు. శ్రీ కొప్పరపు సోదరులు పద్యములలో వ్రాసెడిహారు. ఇటు పక్షమువారు, అటు పక్షమువారు ఎన్ని పత్రికలు! ఏ క్రొత్త పత్రము వచ్చినా క్లాసులు ప్రారంభంకాకముందు కాలేజివా రందరూ కూడు క్రేయరుహాలులో అది ముందు మాకు ప్రత్యక్షమయ్యేది. అందుపై నియోగి వైదికవిద్యార్థులు ముందు నోటితోను, పిమ్మట చేతులతోను పోట్లాటలు! అప్పటి లోకమే రెండుగా చీలిపోయినది— తిరుపతి వారు, కొప్పరమువారు!

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు కాలేజిహాలులో చేసిన మొదటి శతావధానప్రారంభము నాకు గుర్తున్నది. ఇప్పటికీ తలచుకుంటే రెండు జ్ఞాపకము వచ్చును. శ్రీ వేంకటశాస్త్రిగారు వారి స్వంతకంఠములో—

> "ఎరుగడు పిల్లకాయ, ఎటు
>
> లే నొనరించు శతావధానముక్ "

అనడమూ, అలుకుగుడ్డమీద సీసపద్యము చెప్పుమని ఒకపృచ్ఛకుడడుగగా, శ్రీ శివరామశాస్త్రిగారు—

"సింగారకట్టతో జిమ్మిన ధూళిని
జలము సింగారించి యలుకుకొరకు"

అని చెప్పిన మొదటిపాదమూ జ్ఞాపకమున్నవి. మొదటి రోజున పాలుగారుచున్న శ్రీ శాస్త్రిగారి ముఖము చివరరోజుకు ధారణచే వాడిపోయినది చూడ నా కాశ్చర్యమైనది. ఎంత మార్పు!

సెకండు కంపెనీహాలులో శ్రీ వింజమూరి భావనాచార్యులుగారు అధ్యక్షులుగా కొప్పరపు సోదర కవులు చేసిన ఆశుకవిత్వప్రదర్శనము గుర్తున్నది. ఆశు కవిత్వము దేనినిగూర్చి చెప్పాలో ముందు నిర్ణయము కాదు. సభలో అధ్యక్షుడో, పెద్దలో అడిగెదరు. ఆనాడు అధ్యక్షులు బాల్యవివాహములనుగూర్చి చెప్పుడని సభలో కోరిరి. అది సామాన్యముగా అడుగునట్టి కథ కాదు. గంటకు వందలు వేలు పద్యములు చెప్పువారి ధార ఆనాడు వెనుకటి వేగముతో సాగలేదు కాని అద్భుతముగానే ఉన్నది. అక్కడి గ్యాసులైట్లలో ఒకటి బాగా వెలుగుటలేదు. ప్రేమలేని యువతికాపురమును కాబోలును, కాంతి తగ్గిపోవుచున్న ఆ దీపపు కాంతితో శ్రీ సుబ్బరాయకవిగారు ఉపమించుట నాకు జ్ఞాపకము!

ఇవంతయూ నాజ్ఞాపకము ప్రదర్శించుకొనుటకు కాదు. రాజశేఖరునిలో కవిత్వము వికసించునాటికి ఎటువంటి వాతావరణము గుంటూరులో ఉన్నదీ కొంత ప్రదర్శించుటకే. పాతిక ముప్పదిమందిని పెట్టుకొని అతడు రెండు మూడవధానములు చేసినాడు. ఆశుకవిత్వముకూడ కొన్నిమారులు ప్రదర్శించినాడు. కాని వానిపై నతని కంత వ్యామోహము లేదు. ఆ కాల పరిస్థితినిబట్టి అట్లు చేసినాడు. అప్పటికే నాకును అట్టి వానియం దుత్సాహ మసలే లేదు. ఆ ప్రదర్శనముల సంగతి నాకు వినికిడియే. నేను స్వయముగా చూడ లేదు.

సెలవులకు అతడు మేనమామల ఇంటికి కస్తల వెళ్లెడివాడు. అక్కడి కృష్ణాప్రవాహము, తీరమందలి పెద్దబండలు, చుట్టుపట్ల విరివిగా ప్రవహించు సెలయేళ్లు అతని వివాహమునకు ఆ గ్రామమునకు నేను వెళ్లినప్పుడు నన్నెంతయైన ఆకర్షించినవి. కవిత్వమే ఎముకలు, మజ్జామాంసములు, రసారక్తములుగా శరీరము పొందిన రాజశేఖరుని అవి ఎంతగా ఆకర్షించెడివో! మరల అక్కడనుండి గుంటూరు తిరిగి వచ్చునప్పటికి ఒకక్రొత్త కావ్యమో, నాటకమో వ్రాసి తెచ్చేవాడు. స్కూలు తెరచిన పొద్దునపూటనే నా కది క్లాసులో ఇచ్చేవాడు. అతని కోరిక ననుసరించి నేను వెంటనే చదివి నాకు కనిపించిన లోపాలన్నీ వదలిపెట్టకుండా ముఖాముఖిగా చెప్పేవాడను. ఒకసారి వ్రాతపూర్వకముగా అందిచ్చితిని.

ముందతనికి పట్టరాని కోపము వచ్చేది. నన్ను దూషించేవాడు. నేను నవ్వేవాడను. ఒకసారి అతడు పట్టలేక—

"తెలియని వన్ని తప్పు లని
దిట్టతనాన సభాంతరంబునన్
బలుకగరాదు కోరి.........
నరసా, విరసా, తుసా, బుసా!"

అని పద్యమంతా చదివినాడు. నా పేరులో నరసింహశబ్ద మున్నదని జ్ఞాపక ముంచుకుంటే అతని తిట్టులో కూడా కొంత ఔచిత్యమున్నదని స్పష్టమవుతుంది. ఆ పైన నాకు కోపము వచ్చినది. మొహమోటము లేకుండా లోపాలు చూపించమంటే నేను చూపినందుకు అతడిట్లు ప్రవర్తింపవచ్చునా? మరునాడే అతడు క్షమాపణ చెప్పుకొన్నాడు. నేను చూపిన తప్పులు మొత్తముమీద సరియైనవే అని ఒప్పుకొని నావిమర్శనాశక్తికి శ్లాఘించినాడు. నేను తప్పు లనుకొన్నవి కొన్ని కావని నే నంగీకరించినాను. ఇద్దరికీ రాజీ ఐనది. ఇట్టి జగడము, తర్వాత కలిగిన రాజీలవల్ల మాకు అన్యోన్యము ప్రేమ అతిశయింపసాగినది.

కాని ఇప్పుడు పెద్దవారమైన తర్వాత కవిమిత్రుల కావ్యదోషములు వారు ప్రార్థించినను చూపుట వారి స్నేహభావమునకే నివాపాంజలి వదలుట యని ఇప్పుడిప్పుడు గ్రహించగలుగుచున్నాను.

విద్యార్థులకు సర్వసామాన్యమైన తిట్లు రాజశేఖరుని నోట వచ్చుట నేను వినలేదు. కస్తలలో అతని దగ్గర వారిలో మాటమాటకూ ఊతగా బూతు వేయని పెద్దలు పురుషులలో నాకు కనపడలేదు. అట్టిచోట పెరిగిన తుతనికి అది అభ్యాసము కాకపోవుట మరీ ఆశ్చర్యము. నేను విదవఘారము చదువుచుండగా సహపాఠులతో అవి ప్రయోగించుట కొంచెము అభ్యసించినాను. ఒక నాటి సాయంకాలము కాలేజిస్పోర్ట్సు జరుగుచున్నవి. అక్కడ వేపచెట్టుక్రింద ఒకానొకడు పుస్తకము లమ్ముటకు వచ్చి అవతలికి వెళ్లుచు మరి యొకనిని కాపుండ మని చెప్పుచు ఊతగా బూతు వేసినాడు. అది విని నేను ప్రక్కనున్న రాజశేఖరుని 'ఇతడే గ్రంథకర్తా ?' అని అడిగినాను. అతడు వెంటనే "గ్రంథకర్త ఐతే అంత అసహ్యంగా మాట్లాడుతాడా!" అన్నాడు. గ్రంథకర్తను కాదలచుకొన్న నేను ఆ క్షణమునుండి ఆ దురభ్యాసము మానుకున్నాను.

అప్పుడు గుంటూరులో బహిరంగముగా నియోగి వైదికస్పర్ధలు చెలరేగుచున్నవి. అవి విద్యార్థులలో అసహ్యముగా ప్రాకినవి. మా క్లాసులో నియోగులే ఎక్కువ. మా ఇద్దరిలో మాత్రము ఆ భేదమూ, పక్షపాతమూ కనిపించేదికాదు. మాలో దినదినప్రవర్ధమాన మవుతున్న ప్రేమకు ఎట్టి ఆటంకము నది కల్పించలేదు.

"కప్పను జూచి పాము గడగడ వడకెన్"

అను సమస్యను తిరుపతివారు వెంకప్పను అని చేసి పూరించినారు. కాని కొప్పరపు సోదరకవులు గరుత్మంతుని నీడను కల్పించి చక్కని ఊహతో ఆ సమస్యనే పూరించుట అతడు నా కొకసారి వివరించి కవితాకౌశలము ఒక్కరి సొమ్ము కాదని నాకు చెప్పినది జ్ఞాపక మున్నది.

౪

మే మిద్దరమూ స్కూలుఫైనలు పరీక్షకు ౧౯౦౫లో వెళ్ళినాము. ఆ సంవత్సరాంతమునకు మా హృదయములలో నాటుకున్న మైత్రి పవిత్రమై విచిత్రమగు ఆవేదన కల ప్రేమగా మారిపోయినది. ఒకరిని ఒకరము విడిచి ఉండుట కష్టమైనది. ఆ యెండాకాలపు సెలవులలో అతడు కస్తల వెళ్లినాడు. ఆ సెలవులలో మా కిద్దరికి ఒకరి కొకరము అంతము లేని పొడుగుపాటి ఉత్తరములు వ్రాసుకొనడమే ముఖ్యమైన పని ఐపోయినది. నేను వచనమూ, అతడు పద్యాలూ వచనమూ !

"అల సూర్యాస్తమయంబు జూచితిని సం
    ధ్యారాగ మీక్షించితిన్
బళిరే యంటి దిరంగిణీపులినసీ
    మల్ గాంచి మోదించితిన్
జలముం ద్రావితి,—నీవిధిన్ బ్రకృతి సౌం
    దర్యైకలోలుండనై
విలసన్మాత్మ మనోవికాసమున దృ
    ప్తిం జెందు నవ్వేళ నో
చెలికాడా యెదు రేగుదెంచి చెయిలో
    జే వైచుచుండాన నీ
చెలువంబైన సురూప మెల్ల గనుపిం
    చెన్ నేత్రసంతుష్టిగన్.

వయ్యాళి చను వేళ బరిమళాగతబాల
    మందగంధవహంబు మలయు వేళ
సరస మాడెడు వేళ మురిపంపు గారాబు
    ముదికి మాటలు గరపు వేళ
నవల వ్రాసెడు వేళ నలువురితో గూడ
    విందుగా విం దారగించు వేళ
నిదురవోయెడు వేళ నిండు కల్వల రేడు
    చల్లని వెన్నెలల్ చల్లు వేళ
నన్ని వేళల, వేయేల ? యంతె కాదు
సర్వకాలసర్వావస్థసమయములను
జ్ఞాపకము వచ్చుచుండువుగాని యిప్పుడు
వచ్చినవిధంబు భేదంబు ప్రాణసఖుడ !

డెంద ముప్పొంగ కన్ను లానందబాష్ప
సంయుతము లయ్యె, మొగము హర్షప్రపూర్ణ
మయ్యె, వెంటనే యొక్క పద్యము స్ఫురించె,
వద్దియే పెక్కుపద్యంబు లయ్యె సఖుడ !

వెలియో నిక్కువమో మదీయసుమనో
    విభ్రాంతియో మాయయో

కలయో రేఁదో యెఱుంగ నెట్లయిన ద్వ
త్కల్యాణరూపంబు క
న్నులఁగఁ గట్టినయట్లు గన్పడుట, సం
తోషంబు వాటిల్లుటఁ
గలదే యంచు దలంతు గాని, యది ని
క్కం బంచు నూహించెదఁ."

పై పద్యములు పంపిన ఉత్తరముతోపాటు ఆ కవరులోనే ఉన్న మరియొక ఉత్తరములో నిట్లున్నది:

*Between the hours of four & three P. M. 15-5-15.*

"ప్రాణసఖా! చెలికాడా!
హృదయమిత్రమా! నెచ్చెలీ
ప్రియవయస్యా!"

అని సంబోధించి—

"ఎఱుగవా? నీహృదంతర సరోవరనిరం
తరతరంగానీకనటనహంస?"

ఇత్యాదిగా పద్యాలు పంపినాడు.

అప్పటికి మా స్కూలు ఫైనలు పరీక్షాఫలితాలింకా రాలేదు. అప్పుడే అతడు ఎంత చక్కని పద్యాలు చెప్పేవాడో చెప్పడానికి కా దిది ఉదాహరించినది. పరిపక్వబుద్ధి కలవారు మాత్రము ఎంతమంది ఇంత చక్కని పద్యములు చెప్పగలరో ఆలోచించమని సహృదయులను ప్రశ్నింతును.

అతడు స్కూలు ఫైనలు చదువుచుండగానే 'విజయధ్వజము' అనే నవల వ్రాసి ఒక పోటీకి పంపినాడు. అది ఏ పోటీయో నా కిప్పుడు జ్ఞాపకము లేదు. విజ్ఞానచంద్రికవారి దై యుంటుంది. ఆ పోటీకి వచ్చిన నవల లన్నిటిలో ఇదియు, మరియొకటియు మాత్రమే ఉత్తమములుగా నిర్ణయించినా రట. ఇందులో దేనికి బహుమతి ఈయవలెనో తేలక పరీక్షకులు చాలాకాలము—సంవత్సరాలు—ఆలోచించినారు. తుదకు, పోటీ పెట్టిన వారికి బహుమాన మీయగల స్థితి తగ్గినందువల్ల కాబోలు, నా రది కూడ పంపివేసినారు. బహుమతి ఎవ్వరికీ ఇయ్యలేదు. ఆ నవలవ్రాతప్రతి ఇప్పటికిని అతని బావమరది చిరంజీవి కర్తల శివప్రసాద్ వద్ద ఉన్నట్లు తెలియుచున్నది. నా కెప్పుడూ పూర్తిగా ఆ నవల చదువుట తటస్థించలేదు.

ఇంటరుమీడియేటు ఇద్దరమూ తోడుగా కొంత తప్పినందున మూడేళ్లు చదివినాము. అప్పుడు సెప్టెంబరుపరీక్షలు లేవు. ఇంటరుసీనియరు చదువుచుండగా నాకు సాహితీసమితిసభాపతులతో పరిచయ మైనది. ఆయన నాకంటె ఎనిమిదేళ్లు పెద్ద. ఆయనద్వారా శ్రీయుతులు వీరరాఘవస్వామి, శివకామేశ్వరరావు, పూర్ణశర్మ, బాబూరావు, వెంకటసుబ్బయ్యగార్లతో ...అనగా సమితితో పరిచయమైనది. నాద్వారా రాజశేఖరరావుకు వారితో పరిచయము ఐనది. దానితో ఉభయులమూ ప్రపంచములో పడ్డాము.

గుంటూరులో అప్పుడు బి. ఏ. క్లాసు లేదు. నేను చెన్నపట్నమూ, అతడు బందరూ వెళ్లినాము చదువుకు! మా దేహములు దూర మైనప్పటికీ ఉత్తరముల ద్వారా మా స్నేహము నిలుపుకొనసాగితిమి. బి. ఏ. చదువుచుండగా నా కతడు వ్రాసిన ఉత్తరాలు చదివే వరకూ అతడు చదువు కవసర మైన డబ్బుకై ఎంత బాధ పడుచుండెనో నాకు బాగా తెలియదు. మాతండ్రిగారి చాటున ఉన్న నా కట్టి బాధ తెలిసే అవకాశము లేదు. ఎన్నిమారు లతడు ధనసహాయమునకై శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి యొద్దకును, శ్రీ కె. వి. లక్ష్మణరావుపంతులుగారియొద్దకును నన్ను వెళ్లుమని వ్రాసెనో నేను చెప్పలేను. ధనసహాయమునకై ఇతరుల నర్థించుట నే నెరుగను. అందుచేత నేను వారి దర్శనము స్వయముగా చేయుటకు చెల్లక అతనికి దగ్గర బంధువును, మా ఇద్దరకు మిత్రమును అగు శ్రీ బుద్ధిరాజు సుబ్బారావుకు చెప్పి వారికి చెప్పించువాడను. వారల సహాయము అతనికి ఎంతో తోడ్పడియుండును!

ఆమధ్య ఆ ఉత్తరాలు చదువగా నాగుండె తరుగుకొని పోయినది. విజయధ్వజమునకు బహుమానము రాకపోవుటవల్ల అనా డతనికి రావలసిన గౌరవము రాలే దనే పరితపించితినిగాని దానితోపాటు రావలసిన

ధనము రానందున అతని కెంత ఆశాభంగ మైనదో నే నప్పుడు ఊహించలేదు.

బి. ఏ. చదువుచుండగా అతడు వ్రాసిన ఉత్తరా లన్నీ ధనాభావమునుగూర్చి, అనారోగ్యమునుగూర్చి! కాని ఇంటరు చదువుచుండగానే అతనికి బాధలు ఎక్కువైనవి. ౫-౭-౧౭ వ ఎనిమిది పేజీల ఉత్తరము వ్రాస్తూ ఇట్లా ప్రారంభించినాడు:

*" I always rightly see that without closely reading your letters and with a superficial study, there is one characteristic feature, which pervades through your writings, and which pervading one has drawn me more and more towards you, and that feature is without any prolix statement, the spontaneous expression of your genuine love."*

ఈవిధంగా ప్రారంభించి (ఇందులో నే నేమీ దిద్దలేదు. కామాలుకూడా అతనివే), కొంతదూరము పోయి తన అనుభవాలు తెలిపినాడు.

*"When I came up to the High School classes and realised, I boast, my powers, and being ignorant of my limitations, I indulged in high aspirations of life. As an impatient idealist, I determined to reach the destination at as early an age as possible, made some progress in literary compositions, and was successful so far that they were quite juvenile and betrayed my want of vocabulary. As soon as I stepped into the second year class, I contemplated to make it a period of preparation without composing a line of poetry. But Lo! Fate waited for me!.....When my period of preparation became a period of constant nervous debility etc. my hopes began to fail.*

*" These evil instances necessarily drive me to the conclusion that I must be rotten in this, and at last, become an easy prey to death, destitute of intellectual advancement and the fulfilment of my life purpose.*

*" I think you are aware of the fact tha I always aim high. Do you think that it is ridiculous on my part to aspire to become a great literary thinker, having a vast knowledge of political economic and religious including social problems of the world, with their solutions."*

ఇక నాలుగై దేండ్లకు దేహయాత్ర చాలించు ననగా ఇట్టి ఉత్తర మతడు వ్రాయుట చిత్రము. ౧౯౧౭ ప్రాంతములో తెలుగుదేశములోని యువకవులకు ఎట్టి ఆదర్శము లుండెడివో రాజశేఖరుని ఉత్తరము విశదము చేయగలదు. అందులో ఎంత పసితనము గోచరించినను, కేవలము చౌకగా పేరు తెచ్చుకొనవలెనను ప్రయత్నము ఏ కోశము నా కనిపించదే! ఈకాలపు యువకవులే కాక పెద్దలుకూడ రాజశేఖరుని పసితనపు ఆదర్శములను అనుకరించినచో కృతార్థులు కాగలరేమో కదా!

ఈ ఉన్నతాదర్శములను మనస్సులో పెట్టుకొని కొన్నాళ్లకు 'బృందావనము' అను కావ్య మతడు ప్రారంభించినాడు. బమ్మెరపోతన దశమస్కంధము పూర్వభాగ మంతా అతని మనోవీథిలో చిత్రిత మైనది. పోతనవాక్కులోని తేనె రాజశేఖరుని వాక్కులో మిళిత మైపోయినది. కాని అది పోతనఅనుకరణ కాదు. కవులకు విద్వత్తు ఎందుకు? సంస్కారమునకు. అట్టి సంస్కారము పోతనవాక్కులచే రాజశేఖరునికి కలిగినది. రాజశేఖరుని గోగోపగోపికలు కృష్ణాన్వేషణము ప్రారంభించినారు. ఈ అన్వేషణములో ఒక నూతనభావ మావేశించినది.

రాజశేఖరుని శ్రీకృష్ణుడు గొల్లపడుచులను మురళులకొలిపించిన గొల్లపడుచువాడు కాడు. అతడు

భారతధర్మమును ఉద్ధరించు భగవంతుడు. అతడు వేణు నాదముచే లోకము నంతటిని సామరస్యములో లీనము చేయు గానరసికుడు. ఆ శ్రీకృష్ణుడు కనపడలేదు. అతనికై అన్వేషణము బృందావనము!

"కనబడవోయి కృష్ణ, చిరు
గంటల నాట్యము సల్పవోయి, నీ
యనుపమజాయమానకరు
ణామృతముం గురిపింపవోయి, మా
మనసులలోన నివ్వటిలు
మాంద్యములం దొలగింపవోయి, మో
హన మొనరింపవోయి సచ
రాచరమైన ప్రపంచజాలమున్."

... ... ... ...

"ఆ యమునానదీజలత
రంగరవంబున లీన మయ్యెనో
వాయురవాను కోరియయి
వాయువులో బరదేశ మేగెనో
కోయిలకూయితో గలసి
'కూ'యను శబ్దముగాగ మా చెనో
యేరొండ చేరెనో జగతి
కింపగు వేణునినాద మక్కటా!"

ఈ బృందావనములోని పద్యములు చదివినప్పుడు మాకొంట్లకు ఆ శ్రీకృష్ణుడు రాజశేఖరుడుగానే భాసించి భావావేశము కలిగించి కన్నీరు కార్పించుట చోద్యము కాదు. ఈ బృందావనము వ్రాయుచు కొద్ది కాలము గుంటూరుటవును హైస్కూలులోను, తర్వాత దుగ్గిరాలలోను, ఆపిమ్మట నందిగామలోను ఉపాధ్యాయుడుగా ఉండెను. నందిగామలో ఉండి స్కూలుఫైనలు పరీక్షలకు అసిస్టెంటుసూపరింటెండెంటుగా బెజవాడ వచ్చి పని పూర్తిచేసికొన్నాడు. బజారునుండి వస్తువులు తీసికొని ఇంటికి వెళ్లదలచినాడు. ఊరిలో బండిలో ఉండగానే కలరా తగిలినది. బెజవాడ వదలలేకపోయినాడు. మర్నాడు అకస్మాత్తుగా చనిపోయినాడు. పరీక్షలమధ్య సంవత్సరాదినాడు సెలవు రాగా గుంటూరు వచ్చి నన్ను చూచి పోయినాడు. మరునాడే కలరా! ఆ కలరాకూడ అతనికొరకే వచ్చినది. అప్పుడు బెజవాడలో కలరా లేదు. ఖననముచేసిన అతని శవమునుకూడ నక్కలు లాగివేసినవని తర్వాత కొన్నాళ్లకు నాకు తెలిసినది. బెజవాడ వెళ్లినప్పుడు తరుచుగా నాకాళ్లు గవర్నరుపేటప్రక్కకు కృష్ణలోనున్న రుద్రభూమిలోనికి నన్ను లాగికొనిపోవును. అతడు అక్కడ నున్నాడా? ఏమి యజ్ఞానము! ఆ ప్రదేశములో నేను సంచరించిన పర్యాయములు శతాధికముగా నుండును. అతని కళ్యములే నాకాళ్లనో కళ్లనో పలుమారు పడియుండును. కాని గుర్తింపగలనా?

అవసానకాలమునకు అతడు వ్రాయుచున్న గ్రంథములు బృందావనము కాక, సోమవారమహాత్మ్యము, విజయనగరసామ్రాజ్యస్థాపనము అను నాటకములు, చంద్రహాసవిలాసము అను ప్రబంధము నున్నవట! అవి ఏమైనవో తెలియదు. అతడు వ్రాసిన పుస్తకాలు ఎన్ని ఉండెనో కూడా చెప్పలేను.

నందిగామలో నత డుండగా అతనికి శ్రీశేషాద్రిరమణకవులలో ఒక్కరితో స్నేహమయినది. ఆయన ఇట్లు విలపించినాడు:

"కలకలలాడు నీ నగుమొ
గం బిక గానగరాదు, భావముం
జులమగు నీదు కైత చెవి
సోకదు మా కిక, నీ ప్రశాంతసు
శీలరమణీయమూర్తి కన
జాలు నదృష్టము కల్గ దింక, నీ
చెలిమికి శాశ్వతర్పణము
జేసెద గైకొను రాజశేఖరా!"

నాకీ దుర్వార్త వారమురోజులకు గాని తెలియలేదు. అప్పటికి నాకు ఇప్పు డున్న పూర్వాచారాభిమానము లేదు. కాని వెంటనే చిత్రముగా ఆశౌచము వచ్చినట్లు తోచినది. సమీపవర్తియైన శ్రీమాన్ కొమాండూరి కృష్ణమాచార్యులుగారికి అనుభవము చెప్పగా ఆయన విని ఆ మిత్రుని మృతికిగూడ ఆశౌచ మున్నదని నిర్వచించినాడు.

బృందావనములో అతడు వ్రాసిన కృష్ణవిరహగీతము లన్నీ నాకు అతని విరహగీతములుగా అన్వ

యించును. ఇరవైరేండ్లయిపోయినను అవి ఒంటరిగా చదివినప్పుడు నాకు కన్నీళ్లు ధారగా రాకమానవు. అతడు దుందుభిచైత్ర శుద్ధ తదియనాడు (౩౧-౩-౨౨) ఈ లోకయాత్ర చాలించెను. కొంతకాలమునకు చైత్ర మాసములో నాకు స్మృతి కలిగి 'వాసంతస్మృతి' అనే పద్యాలు చెప్పినాను.

"నవచూతావళి పల్లవింపగ వసం
 తప్రేమచేతం బిగం
తవనాంతంబుల మత్తబంభరము చిం
 తాగానముల్ సేయగా
చివురుల్ వెట్టె ప్రసూనకోమల సుధా
 స్నిగ్ధాత్మసీమం దురం
తవియోగవ్యథ నాకు మిత్రమృదుహా
 ర్దంబుల్ స్మృతింబారుటన్."

కాని మిత్రవియోగము కావ్యవస్తువుగా చేసి కొన్నందుకు నాకే సిగ్గైనది. అందుపై 'కవికాశిన్యము' వ్రాసి ఆపిమ్మట 'కాలధిక్కృతి' వ్రాసినాను. ఇంత కాలమైనను అతని స్మృతికి వ్రాయుదలచిన పద్య కావ్యసంపుటి ఇంకా పూర్తి కాలేదు.

రాజశేఖరుని స్మరణ మరి లోకమున కేందుకు ? అతని నవల 'విజయధ్వజము' పెద్ద పోటీలో బహుమతి పొందుటకు తగినదిగా అధికారులు నిర్ణయించినందున ప్రశస్తమైనదని ఊహింపవచ్చును. కాని అతని 'బృందా వనము' పద్యములు ఇప్పటికి లభ్యమైనంతవరకు భద్ర పరచుకొన్నను తెలుగుభాషకు అలంకారముగా ఉండును. అమరుకకవి ఎన్ని శ్లోకములు వ్రాసెను ? పుష్పబాణవిలాస మెంత ? గ్రే ఎన్ని పద్యములు వ్రాసి నను అతని ఎలిజీ ఇంగ్లీషుభాష మరచిపోవునా ! ఫిట్జ్ గెరాల్డు ఎన్ని కావ్యములు వ్రాసినా అతని 'ఓమారు ఖయ్యాము' మరతుమా ? రాజశేఖరుని 'బృందావనము' ఆంధ్రసహృదయులు మరచినచో ఆంధ్రకవితాదేవి కిరీటములోని రత్నమొకటి పోగొట్టుకొనుటయే !



# అప్పాజీ

[ఏకాంక రూపకము]

●

శ్రీ ఖావరాజు వెంకటకృష్ణరావు

---

[శ్రీకృష్ణదేవరాయలవారి పరిణయగాథ ఈ రూపకమందలి కథావస్తువు. రాయలవారిని స్వయముగా జూచి, విజయనగరమందు కొంతకాల ముండిన బుడతకీచు ఫెర్నాఓ నన్నిజ అనునాతడు వ్రాసి పెట్టిన వృత్తాంతము ఈ రూపకమునకు మూలాధారము. శ్రీ కృష్ణదేవరాయలవారికి చిన్ననాటి వలపుసాని చిన్నమ్మ అను పేరుగల, నిరుపమానసౌందర్యలావణ్యమూర్తి, ఒక వేశ్యాంగన ఉండెను. తా నెప్పటికైన మహారాజు లయినచో తప్పక యామెను పెండ్లియాడి దేవేరిని చేయుదు నని శ్రీ కృష్ణదేవరాయలు చిన్నమ్మకు వాగ్దాన మిచ్చెను. ఆయన విజయనగరసింహాసనాధ్యక్షుడైన తరువాత చిన్నమ్మపై వలపు నిలుపజాలక రహస్యముగా ఆమెసదన మునకు బోవుచుండెను. మంత్రి తిమ్మరసు ఆ వృత్తాంతమెఱిగి చిన్నమ్మతోడి సాంగత్యము విజయనగరసామ్రాజ్యమునకు విపత్తు కలుగజేయగల దని వారింపజూచెను. కాని కృష్ణరాయలు చిన్నమ్మను వీడజాలకపోయెను. చూచిచూచి మంత్రీశ్వరుడు కృష్ణసార్వభౌమునకు వేశ్యాంగనను పెండ్లిచేసి ఆమెను పట్టపురాణిని చేయ వెఱచెను. చివర .కా కథ యిట్లు నడచెను:—]

---

## మొదటి రంగము

[చంద్రగిరిలో చిన్నాదేవిభవనము. చిన్నాదేవి దాసి కాచమ్మ ప్రవేశము.]

చిన్నా : నిక్కముగ నా స్వామి నన్ను మఱచినాడందువే కాచా? ఇంత నిష్ఠురవృత్తిని-ఎన్నడును చూపి యెఱుగని యింత నిష్ఠురవృత్తిని - యిపు డేల పూనినా రందువే నా స్వామి?

కాచ : ఇందు రాయలవారి నిష్ఠురవృత్తి యేమున్నదమ్మా? స్వామివారు మిమ్ములను మఱచియున్నా రని మాత్రము నేను నమ్మజాలను.

చిన్నా : అవునే! నీ కెట్లు తెలియునే నా స్వామిచిత్తవృత్తి?

కాచ : అవునమ్మా! నా కెట్లు తెలియును? ఇప్పటికి ఇరువది యేండ్లనుండి, నాకు జ్ఞానము వచ్చిననాటనుండి మీయింట ఊడిగము చేయుచున్నాను. మిమ్ములను, స్వామివారిని—మీ! రుభయులు కలసిమెలసి తిరుగుచుండగా జూచిన రోజులు ఇంతవఱకు ఎన్ని లేవు?—ఊఁ, నా కెట్లు తెలియునమ్మా మా మహారాయలవారి చిత్తశుద్ధి? మా మహారాణిగారి చిత్తవృత్తి?

చిన్నా : ఇది పరిహాసమునకు తరుణము గాదు! కాచమ్మా! ఈ హృదయము కార్చిచ్చువాత బడిన వనమట్లు ఎట్లు రగుల్కొనిపోవుచున్నదో చూడు.

కాచ : ఇపు డింతలో ఏమి మునిగిపోయి వచ్చిన దమ్మా ముప్పు?

చిన్నా : నిజముగా నా స్వామికి నాపై అనురాగము కల దందువే?

కాచ : ఏమమ్మా మీ వెలితనము!

చిన్నా : నేను వెలనయితి నందువా కాచక్కా?

కాచ : కాకేమి దేవి?

చిన్నా : ఎట్లు ?

కాచ : మహారాయలవారికి దేవిగారిపై గల ప్రేమ అగ్గలము; నిరుపమాన మమ్మా!

చిన్నా : కాచా! ఆ మాట నిపు డెవరు నమ్ముదురు ?

కాచ : దోసము! దోస మమ్మా! ఎందుల కట్లూరక వాపోయెదరు ? మనసు నారడి పెట్టుకుని మాటి మాటికి కంట తడి పెట్టుకొనరాదు. మహారాయలవారు మిమ్ములను గాంధర్వమున పెండ్లియాడరో! శ్రీవారికి మీరు దేవేరులు గారో!

చిన్నా : స్వామివారికి నే నింతవఱకు భోగ పత్నిని గాని, ధర్మపత్ని నెపు డయితినే ?

కాచ: మహారాయలవారికి మీపట్ల భోగపత్నులు, ధర్మపత్నులు అన్న విచక్షణ లేదు. ఒకప్పుడు భోగ పత్నులుగా నున్నవారే ధర్మపత్నులయి, పట్టమహిషులుగూడ గావచ్చును!

చిన్నా : కాచమ్మా! నేటిమాట తలపవే! స్వామి నా సదనమునకు వేంచేసి నేటికి ఒక సంవత్సరము గడచెనే! చిరంజీవి వెంగళాంబజన్మదినోత్సవమునాడు వేంచేసియుండిరి. ఈ పుష్య శుద్ధ పూర్ణిమ నాటికి నా తల్లికి యిరువదేండ్లు నిండును గదే!

కాచ : శ్రీ వీరనృసింహరాయలవారు స్వామి వారికి రాజ్యము పట్టము గట్టనవధరించిననాటనుండి విశ్రాంతి యెక్కడ నమ్మా. సమరసన్నాహములతో, దండయాత్రలతో, యుద్ధములతో, ఎదిరించినవారిని బలిమి వాటించి అదిమిపట్టుటతో కాలము గడుపుచున్న మహారాయలవారికి తీరిక ఎక్కడ నమ్మా ?

చిన్నా : పదునాలుగేడుల కౌమార ప్రాయము నాడు, కన్నెమరులు నిలిపి, ఇన్నియేండ్లుగా భార్యవలె నేలుకొనిన వనితను, రాజ్యభారమును పూని నంతమాత్రాన తలపనైన తలపరాదే ?

కాచ : అమ్మా!—

చిన్నా : పుణ్యముచేసి పుట్టిన పుణ్యాంగనలు, కాంతు డవజ్ఞచేసిన నిలువజాలరు! కాయము వాయుదురు! కాచా, నేను—నా తపఃఫల మిట్లున్నది. నా జీవితము దీపిక లేని శూన్యగృహమ ట్లున్నదే!

కాచ : అమ్మా! ఈ రీతిగా విలపించుట—యింతటి ఉమ్మలిక—తమవంటి ధీరస్వాంతలకు తగదు. ఎంత వల పున్నను, రాజపరమేశ్వరుడు వనితాధీనుడై చరియింప వలను కాదు.

చిన్నా : నీవు వేయి మాటలు చెప్పుము! పది వేల సామెతలు దెలుపుము! స్వామి మేర దప్పినారందు నే.

కాచ : అసంభవ మమ్మా అది! ఆ మాట నేను నమ్మజాలను! దానికై మీరు నా కెట్టి శిక్ష విధించినను నేను సహింతును.

చిన్నా: స్వామివారిపై నీ కంత విశ్వాస మెట్లు కుదిరెనే ?

కాచ : మీకు జ్ఞాపక మున్నదో లేదో, కాని, మరల చెప్పెదను, వినుడు; జ్ఞాపకమునకు దెచ్చుకొనుడు! ఒకనాడు—కొన్ని యేండ్లక్రిందట—మీరుభయులు విజయనగరమున, అప్పటికింకను మామ నరసానాయనింగారు రాజ్యభారము పూనియున్నారు,—విలాసముగ, యథేచ్ఛగ జీవించిన దినములలో—ఆనందసంధాయకమగు క్రీడాసమయమున తమకంట కన్నీరు మున్నీరుగా ప్రవహించుట గాంచి, స్వామివారు తమ మోము పై కెత్తి—"ఈ వగపునకు, ఈ దుఃఖమునకు గారణ మేమి ? నాయెడ ఏమేని కపటవర్తనము కలుగదు కదా? ఎందుల కింత వలవంత ? ఎవ్వరైన నీ కప్రియము కలిగించి యుండిరా ?" అని గ్రుచ్చి గ్రుచ్చి అడిగినది మరచిపోయిరా ?

చిన్నా : (దుఃఖించును.)

కాచ : దుఃఖింపకుడు. దుఃఖించుట కేమియు కారణము కానరాదు. అప్పుడు స్వామివారు వారి హస్తములను తమ చెక్కిళ్లపై నుంచి, "దేవీ, నాయర్థప్రాణములు నీ యధీనములు—నీ వేది కోరిన నద్దానిని, నీకు ప్రియంబగునట్లు గావించెదను." అని వాగ్దాన మిచ్చియుండలేదో ?

చిన్నా : మగవారు క్రీడాసమయమున మగువల రంజింపజేయుటకు ఎట్టి వాగ్దానముల నైన జేయుదురు. మదనాతిరేకమున నాడిన బాసలు మగువలకు నమ్మిన సొమ్ము లగునటే !

కాచ : అమ్మా ! నిష్కారణముగ స్వామివారి మనశ్శుద్ధి శంకింపగారాదు.

చిన్నా : కాదే ! చెలీ ! ఒకచో మెలతకు మగనిపై వలపు మిక్కుటముగ నుండును. మరియొకచోట పతికి వనితపై అనురాగము తలమునుకల నుండును. మెలతకును, పతికిని ఉభయులకును వలపు సమముగా నుండు టరుదు. అది పూర్వజన్మవాసనవలన కలుగును.

కాచ : తమ యిద్దరి వలపు అట్టిదే నమ్మా !

చిన్నా : మహారాయలు తమ సుఖవినోదగోష్ఠులకు నన్ను భోగపత్నిగా స్వీకరించినారే గాని, ధర్మపత్నిగా నన్ను గ్రహింపలేదు.

కాచ : అట్లు వచియింప నెట్లు బుద్ధి వొడమినదమ్మా తమకు? విజయనగరరత్నసింహాసనాధ్యక్షులు భాషగెతప్పువరాయరగండాంకు లని యెరుగరా తాము?

చిన్నా : కాచమ్మా! ఎటనుండి వచ్చినదే నీకింత వెఱ్ఱి! రాజపరమేశ్వరుడు సామాన్యశూద్రాంగనను పెండ్లియాడి పట్టమహిషిని చేసికొనునటవే?

కాచ : అమ్మా ! అట్లనవలదు.

చిన్నా : పతి ప్రాణసదృశబంధువు, పతి దైవం, వేడుగడయు, జాతి సతులకు ; నప్పతియ కడు మేర దప్పిన గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా ! (దుఃఖించును).

కాచ : అమ్మా ! దుఃఖింపకుడు. స్వామివారి యందు అట్టి నిష్ఠురవృత్తి కానరాదు.

చిన్నా : ఆశ కలుగంగ నాడిన స్వామివారి మాటలు-స్వామివారి మాటలు - తలచుకొన్న శరీరము పులకిత మగుచున్నది. అంత ఔదాసీన్యము చూపిన నా స్వామి బాసాడి తప్పునేమో యన్న శంక యీ తనువును సప్తపాతాళముల క్రిందకు త్రోసివేయుచున్నది.

కాచ : అమ్మా ! వాపోవకుడు ! ఒత్తనిండు కన్నీరు ఒకసారి.

చిన్నా : ఇంతకాలమయినది. నా స్వామి నన్నొక్కసారికూడ తలచరమ్మా. కాచా, నే నింక బ్రదుకగలనే?

కాచ : దాసి అన్నమ్మ, అదిగో, వికసించిన వదన కమలముతో వడిగా బరుగెత్తుకొని యిటే వచ్చుచున్నది. శుభవార్త యేమయిన గొని వచ్చుచున్నదేమో, పోయి వత్తునా? (పోవును).

చిన్నా : ఎక్కడనే దాసి?

కాచ : (మరల ప్రవేశించి) అమ్మా. శుభవార్త! శుభవార్త ! స్వామివారు దేవిగారిని విజయనగరమునకు పయనము చేయింప సిబ్బంది నిచ్చి అప్పం తిమ్మయ నాయనింగారిని పంపినారు. రేపే ప్రయాణ మట!

చిన్నా : నమ్మటకు వీలు గానంతగా నున్నదే ఈశుభవార్త. స్వామివారు ఆహ్వానమంపిరటే? కాచా ! నీకును, శుభవార్త గొనివచ్చిన అన్నమ్మకును ఈ మణిహారములు మా ఆనందసూచకముగ గైకొనుడు !

## రెండవ రంగము

[మరికొన్నాళ్లకు. విజయనగరమున అర్ధరాత్రము దాటినది. బిజాపురమున ఇస్మాయిల్ అదిల్ ఖానుడు కల్బరిగె సుల్తానులను బందీకృతులనుచేసి సర్వతంత్రస్వతంత్రుడై రాజ్యము చేయుచుండెను. విజయనగరముపై దండయాత్ర సలిపి, దేశమును కొల్లగొట్టి, దోపిడిచేయదలచి, ఏతత్ప్రయత్నమున నున్నాడు. విజయనగరమందు వీరనృసింహరాయల మరణానంతరము అల్లకల్లోలములు ప్రబలుచుండిన వని చారులవలన విని ఆ యల్లరులను వృద్ధిచేయుటకు పన్నాగములు పన్నుచున్నాడు. బిజాపురపు వేగరులు గూఢముగ సంచరించుచు, విజయనగరమున ఏమి జరుగుచున్నదో ఎప్పటికప్పుడు, ఇస్మాయిల్ ఆదిల్ ఖానునకు తెలుపుచుండిరి. అట్టి వేగరు లిరువురు ఫకీరువేషములను ధరించి రాత్రులందు బిచ్చ మడుగుకొనుచున్నట్లు సంచరించుచు, వాడవాడల దిరుగుచు వార్తలను సేక

రించుచుండిరి. వారు—మహబత్ ఖాను, ఫీరూజ్ లారిలు ప్రవేశింతురు.]

మహ: సలామాలేఖుం! ఫీరూజ్ లారి సాహెబ్!

ఫీరూ: అలేఖుం సలాం! మహబత్ ఖాను వజీర్సాహేబ్!

మహ: భాయిజీ, కుశలమేగద! సుల్తానువారికి? వజీరు సాహెబువారికి?—బిజాపురంనుండి నేడో రేపో మీరు రాగల రనియు, కమలాపురం చెరువుగట్టు చెంత మూడవ రాజద్వారమునకు ఉత్తరముగానున్న ఏనుగుల బండక్రింద అర్ధరాత్రము గతించిన వెనుక, మిమ్ములను కలుసుకొనవలసిన దనియు నాకు సందేశ మంపినారు.

ఫీరూ: భాయిజీ, భుజబలరాయ మహారాయలు చన్న తరువాత విజయనగరమంతా చాలా అల్లకల్లోల ముగ నున్నదట! ఒక ప్రక్క భుజబలరాయు కుమారుని సింహాసనముమీద కూర్చుండబెట్టవలె నని ప్రయత్నములు సాగుచుండగా, కృష్ణరాయలు, ఆయన వృద్ధ మంత్రి సాళువ తిమ్మరుసు ఏవో పెద్ద యోచనలు చేయుచున్నారట. రాయలు కైజీతాలు ఏర్పాటు చేసి పెద్దలష్కరు తయారుచేయుచున్నాడట.

మహ: (అపవారించి) ఇక్కడ, నెలరోజుల క్రిందటి వరకు జరిగిన సమాచారమును అంతయు వజీరుఖానులవారికి వివరంగా తెలియపరచినాను. అటుతరువాత జరిగిన సమాచారం మీద్వారా పంపించ వలయును. భాయిజీ, ఏరోజు కారోజు నా కిక్కడ ప్రాణభయంగా నున్నది. విజయనగరదండనాయకుడు కొత్వాలు గోవిందరాజు బిజాపురచారులు ఎక్కడెక్కడ ఏయే వేషాలు ధరించి తిరుగుచున్నారో కనిపెట్టవలసిన దని—తలకు పట్టిన పేలను దువ్వి తీసి నట్లు తీయమని—నీటిమీద సయితము జాడలు తీయగల వేగరులను నియమించి, రాత్రి పగలు అని లేకుండా తిరిగి పరీక్షించి, వలవేసి పట్టుకొనుచున్నాడు. వాళ్ల చేతులలో పడితే కదలకుండా కాళ్లకు సంకెళ్లు వేసి హింసపెట్టి చంపుదురు.

ఫీరూ: ఆశ్చర్యం కలిగించుచున్నవి! మీ మాటలు!

మహ: ఇక రెండు మూడు రోజులలో నాకు తెలిసిన సమాచారము నంతయు వజీరు ఖాను సాహెబు వారికి చేర్పలేకపోయినచో అటుతరువాత నేను జీవంతో ఉంటానో, ఉండనో నిశ్చయంగా చెప్పలేను. నేను కూడబెట్టిన వార్తలన్నీ అతిత్వరితంగా వజీరు ఖానుగారికి తెలియజేయవలెను. ఫీరూజ్ సాహెబ్! గోవిందప్రధాని కండ్లెఱ్ఱచేసినచో చెరువులలో నీళ్లు కూడా యింకిపోయి, అందులో దాగినవారుకూడ బయటపడతారు.

ఫీరూ: అరే, బలే ఆశ్చర్యంగా వున్నది!

మహ: ఇప్పటి సమాచారం వింటే యింకా ఆశ్చర్యపడుదురు మీరు. నేను ఇపుడు తెలుపునది అతి శీఘ్రకాలంలో వజీరుఖానువారికి అందవలెను. వ్యవధి లేదు. రాయలు ముందు రాచూరు ముదుగల్లు రాజ్యములను సాధించి తన రాజ్యములో ఎప్పటిరీతిగా కలుపుకొనుటకు భగీరథప్రయత్నములు శ్రద్ధగా సాగించుచున్నాడు. తిమ్మరుసుమంత్రికి రాత్రింబవళ్లు విరామం లేదు. ఈ కవిలెలో, లేఖలతో సహా, అన్ని విషయములు వ్రాయబడియున్నవి.

ఫీరూ: మహబత్! ఈ కవిలెను వ్రాయించి వజీరుఖానువారికి సమర్పించుటలో మీ సాహసమును, మీ అఘటనఘటనాసామర్థ్యమును కొనియాడదగి యున్నది.

మహ: ఈ విజయనగరకోటగోడలు దాటించి ఈ కవిలెను సుల్తానువారికి సమర్పించుటలో నున్నది యింక మీ ప్రజ్ఞావిశేషములు!

ఫీరూ: అల్లా—బిస్మిల్లా!

మహ: కృష్ణరాయలు రబీల్ అవ్వల్ నెల ప్రవేశించినతోడనే దండయాత్రకు బయలుదేరునట. ఎటునైపునకో, ఎవ్వరిమీదకో! అది ఇంకను పరమరహస్యముగనే యున్నది. అంతరంగులయిన వేగరులకు, దండాధీసులలో ముఖ్యులకు తప్ప నితరు లెవ్వరికిని తెలియదు. తిమ్మరుసయ్య ఎడమచేయి ఏమి చేయుచున్నదో కుడిచేతికి సైతము తెలియనీయడు. కుడికన్ను చూచిన

దానిని ఎడమకన్ను చూడజాలదు. అసాధారణప్రతిభా శాలి అతడు.—అయినా...

ఫీరూ : ఏమి ఆగినారు ఏదో చెప్పవచ్చు?

మహ: ఆగలేదు. అటువంటి తిమ్మరుసుమంత్రిని, ఆయనకు సమాను డనదగిన ఆయనతమ్ముడు గోవింద రాజును, పట్టపగలే, చూచుచుండగా, ఇంద్రజాల మహేంద్రజాలం చేసి కండ్లల్లో దుమ్ముగొట్టి ఎటువంటి రహస్యములైనా జాడలంతీసే మాంత్రికుడు వేగరి వెంగయ్య ఉన్నాడు. వీరందరినికూడా మరుగుపెట్టి సంచరింపగల సాహసమూర్తి, ధైర్యశాలి, ప్రజ్ఞావంతుడు రాయలు.

ఫీరూ : అల్లా!

మహ : ఈ మహానగరం ఇరవైనాలుగు చదరపు మైళ్లలో, ఈ యేడు ప్రాకారములలో ఏమూల, ఏచెట్టు క్రింద, ఏబండప్రక్క, ఏమి జరుగుచున్నదీ రాయలకు తెలియుచుండును. మంత్రి తిమ్మరుసయ్యకు తెలియుచుండును. గోవిందరాజునకు తెలియుచుండును. ఇక్కడ వేగర్లు మారువేషాలతో, పగటి వేషాలతో రహస్యాలు సాధింతెదరు. ఇక రాయలమాట చెప్పనక్కరలేదు. మహాధైర్యసాహసములతో రాయలు నగరశోధన చేయును.

ఫీరూ: ఆశ్చర్యం!

మహ: రాయలు, ఎప్పుడు, ఏప్రాంతానికి, ఏ మారు వేషంతో పోవుచు వచ్చుచుండునో ఎరిగిన వారు ఎవ్వరును లేరు. తిమ్మరుసయ్యకు కూడా ఒక్కొక్కప్పుడు తెలియదు. రాయలవారి సాహసమును చూచి ఆ ముసలి మంత్రి తల బ్రద్దలు కొట్టుకొనును ఒక్కొక్కవేళ!

ఫీరూ : మరి యెట్లు?

మహ: అల్లీనబీ ఇక్కడి వ్యవహారములు కనిపెట్టుటకు జంగమవేషము ధరించి, సిద్ధేశ్వరు డను పేరుతో మూలమఠమందు ప్రవేశించి, బలగామె మఠమునుండి వచ్చినానని ప్రచురపరచి, శిష్యులద్వారా ఇక్కడి జాడలు తీయ నారంభించెను. అతడు బిజాపురమునుండి వచ్చిన తురక యని, మాయలాడని తిమ్మరుసు గోవిందయ్యగార్లు ఎట్లు గ్రహింపగలిగినారో—అల్లీనబీ వచ్చిన మూడవనాడు — అల్లీనబీశిరము శరీరము నుండి వేరుచేయబడినది. దినమొలతో మొండెమొక ప్రక్కను, శిరము మరియొక ప్రక్కను ఆ మఠము సింహద్వారమునందు వ్రేలాడగట్టబడెను. అంతదూర మెందులకు, నే నెవ్వడనో శోధించుటకు ఫకీరువేషధారు లయి వేగర్లు నావెంట దిరుగుచున్నారు. మంత్రి తిమ్మరుసయ్య కటాక్షముచే నా తల యెప్పు డెగిరి పోవునో!

ఫీరూ : తిమ్మరుసయ్యవంటి మహాప్రధాని బిజాపురంలో ఉంటే సుల్తానువారికి ఎంతో సహాయంగా ఉండును. పీష్వాగుండూపంతు ఉన్నారు, కాని—

మహ : భాయీ సాహేబ్! ఇంకొక ధోరణిలో పడి అసలు సమాచారం మీకు ఇంకా తెలుపలేదు. మళ్లీ ఎక్కడను అనెదరుసుడీ! తిమ్మరుసయ్యవంటి మంత్రి కాదుకదా ఆయనకున్న ప్రతిభలో ఒక వీసం అంశ కలవాడు కూడా బిజాపురరాజ్యంలో కానరాడు.

ఫీరూ : భాయిజీ! వజీరుఖాను సాహెబ్‌వారికి తిమ్మరుసయ్యవారి ప్రజ్ఞావిశేషములు తెలియునా?

మహ: అసలుమాట ఏమనగా—నగరశోధననిమిత్తము అప్పుడప్పుడు రాయలు, మహామంత్రి తిమ్మరుసు, దండనాథుడు గోవిందరాజు, రాయసం కొండమరుసు మొదలయినవారు ఒంటరిగాను, కలిసి గుంపుగాను, మారువేషాలతో రాత్రులందు పోవుచుందురు. ఒక్కొక్కప్పుడు రాయలు ఎవ్వరికిని తెలుపక ఒంటరిగానే పోవుచుండును. అది తిమ్మరుసయ్యకు కూడ తెలియదు.

ఫీరూ : రాయలకు ఎంత సాహసము! అర్ధరాత్రమున ఆ రాయల గుట్టు శత్రువు లెరిగిన విపత్తు రాదా?

మహ : గట్టిగా మాటలాడకుము! జాగ్రత! ప్రమత్తుడవు గాకుము! ఇక్కడ గాలికి సయితము చెవులున్నవి. వార్తలు గొనిపోవుటకు గాలికి సయితము నాలుక లున్నవి. ఆ విషయ మటుండనిమ్ము. రాయలకు వయసునాటి వలపుసాని - లంజపెండ్లము - అత్యంత రూపలావణ్యవతి యొకతె గలదు. రాయ లామెను వీడి యుండజాలక చంద్రగిరినుండి యిక్కడికి రప్పించు

కొన్నాడు. ఆమె కొక కూతురుగూడ గలదట. ఆమె వచ్చినప్పటినుండియు నగరుశోధన కని మిష పెట్టి ఒరు లెఱుగకుండ రహస్యముగ, విశ్వాసపాత్రుడైన యొక అంగరక్షకుని సాహాయ్యమున, రాయలు ఆ వలపుసాని యింటికి రాత్రులందు బోవుచు వచ్చుచుండును.

ఫీరూ : తిమ్మరుసు మంత్రి కీ విషయము తెలియునా ?

మహ : ఇంతవఱకు తెలిసినట్లు కనబడదు.

ఫీరూ : ఇపుడు నా కంతయు బోధపడినది. మహబత్! మన వేగర్లు జాగరూకత విడిచి ప్రవర్తింప రాదు. దొరికిన యవకాశమును పోనివ్వరాదు. కృష్ణ రాయలవంటి మహారాయలు విజయనగర సింహాసన స్థుడై యుండుట మన సుల్తానువారి కెప్పటికైనను అపాయకరమే.

మహ: ఫీరూజ్, బాగుగా గ్రహించితిరి. మీ రీ నగరమును విడిచిపోవుటకు ముందు మన వేగరులకు, శోధకులకు నొక సందేశ మిచ్చి పోవలయును సుడీ !

ఫీరూ : మంత్రి తిమ్మరుసుకు మహారాయల ప్రవర్తనము తెలిసినచో తప్పక అరికట్టకమానడు. ఆయన గారు వెంటనే ఏదేని యొక యుపాయము నూహించును. మన ప్రయత్నములు విఫలమగునట్లు ఎదురు పన్నాగములు కూడ పన్నగలరు. మన తలలుగూడ తెగి యూడిపడ గలవు. బిజాపురమునకు ఈ వర్తమానముల నిప్పుడే అశ్వికులద్వారా అందజేయుదును...... పోయివత్తునా ?

మహ : నేనుకూడా యిప్పుడే మిమ్ములను విడిచి పోవలయును. దూరమున దయ్యములు తిరుగుచున్నవి. ఏమయిన విపరీతము వాటిల్లగలదు. రేపటి అపరాహ్ణమున మరల కలీముల్లా మసీదులో కలుసుకొందుము. అల్లావారి దయ యున్నయెడల ఈలోపుగా మనవారి నిద్దరిని కలుసుకొని క్రొత్త క్రొత్త వార్త లేమయిన నున్న గొనివత్తును.

ఫీరూ : ఎవరో రాజభటులు గావలయును వచ్చుచున్నారు.

మహ : పడి కావలివారు. యమకింకరులు. వారి కంట బడకుండ తప్పించుకొని పొండు. వారి చేజిక్కిన ప్రాణములు నిల్వవు.

ఫీరూ : సలామ్.

మహ : అల్లా బిస్మిల్లా.

(నిష్క్రమింతురు)

## మూడవ రంగము

[విజయనగరమున. చిన్నాదేవిభవనము జాము దాటిన రాత్రి వేళ.

ప్రవేశము — చిన్నా దేవి, దాసి ఓబలమ్మ, దాసి కాచమ్మ.]

ఓబలమ్మ: అమ్మా, అమ్మగారండీ...ఎక్కడున్నారే, దేవి ?

కాచ : ఏమే అంత రొజుకొనుచు వచ్చినావు! ఏమి వార్తలు తెచ్చినావు?

ఓబ : దేవిగా రెక్కడనే? మహారాయలవారు వేంచేయుచున్నారు. అందల మిప్పుడే దిగినారు.

చిన్నా: స్వామివారి పాదకమలములను కడిగి అడుగు దమ్ములకు మడుపులతో తడి యొత్తివారటే ? స్వామి వారికి వింజామర లెక్కడనే? కర్పూరనీరాజన మిచ్చిరే? హెగ్గడి కత్తె లెక్కడ నున్నారు? సావళో పరాకులు తెల్పవే స్వామివారికి.

కాచ : ఎందులకు దేవీ, మీ కింత సంభ్రమము? స్వామివారికి రాజోపచారములు జరుపుటకు పరి చారికలు సిద్ధముగ నున్నారు.

చిన్నా : కటికచెత్తములవారు స్వామివారి ముంగిట నడచివచ్చుచున్నారో? రాజపరమేశ్వరులకు హెచ్చరికలు తెలుపుచుండిరే ?

ఓబ : స్వామివారు నందనవనమునందు నవకంబ మంటపమందు రత్నకంబళముపై నమర్చిన పూసెజ్జ యందు వేంచేసియున్నారట! కావలి నీలమ్మ సౌంజ్ఞ చేయుచున్నది.

చిన్నా : ఎంతటి మందబుద్ధినమ్మా నేను. స్వామికి ఎదురేగి మంగళనీరాజన మిచ్చి శ్రీపాదములకు నమస్కరించుటకు దోడుకొని రానైతిని. నా కేల అట్టి

బుద్ధి పొడమదో. నా స్వామి కోమలహృదయ మెంత నొచ్చుకొనునో. పదవే. నాస్వామిసన్నిధికి నడువవే.

కాచ : అమ్మా! మహారాయలు ఇటే వేంచేయుచున్నారు. నందనవనమునుండి. దాసి తిమ్మక్క భుజముపై కై దండ సాచి—స్వామివారి సౌందర్య మేమని వర్ణింపను? ఆకంచుకాగడవెలుగులో. ముందు. ఏమి లావణ్యమే, ఏమి ఠీవియే. మూరు రాయర గండాంకము అరియెడమ కాలిపై ఎట్లు గునిసియాడుచున్నదో.

చిన్నా : ఎక్కడ నున్నారే నాస్వామి, ఎక్కడ నున్నారే నాస్వామి? ఓసీ మందబుద్ధీ! తగటు బంగరు పళ్లెము, కర్పూరమును ఇటు తేవే. నేను కూర్చిన విర జాజి పూదండ ఎక్కడనే? శీఘ్రముగ తెప్పింపవే.

కాచ : దేవీ, అన్నియు మీ చెంతనే యున్నవి. పళ్లెరమున పెట్టి పట్టుకొని వచ్చుచున్నది మీదాసి ఓబలమ్మ!

చిన్నా : ఎక్కడనే?

ఓబ : అమ్మా, తమ చేతులు సంభ్రమమున వడకుచున్నవమ్మా. తలిరాకువంటి తనువు మీయది. బంగరుపళ్లెము తమ చేతులనుండి నీరాజన మిచ్చు వేళ—జారిపడగలదు. నన్నుకూడ పట్టుకొననిండు. స్వామివారి కంఠసీమను అలంకరింపుడు—వారికి ప్రీతి యైన జాజిపూమాలతో.

చిన్నా : స్వామికి వింజామర లెక్కడనే? చెల్వనాయకి ఎచ్చటనే? ఛత్రములు బట్టవే.

కాచ: అన్నియు సిద్ధముగ నున్నవి. పరిచారకులము మేము మహారాయలవారికి రాజోపచారములందు లోపము రానిచ్చి, మీ యుభయుల ఆగ్రహమునకును గురి కాలేము దేవీ! ఆయాసపడవలదు! అమ్మా.

చిన్నా : నా స్వామి! నా స్వామి! అనుగ్రహింపబడితిని.

కాచ: స్వామివారికి తమపై అత్యంతానురాగము కలదు కావుననే పట్టాభిషిక్తులయినను, అత్యవసర రాజకార్యము లున్నను, మన సదనమునకు స్వయముగా వేంచేసినారు.

చిన్నా : నా స్వామికి జయమగు గాక.

కృష్ణ : దేవీ, నీవు సమర్పించిన ఈ పూమాల ఎంత మనోహరముగా నున్నది!

చిన్నా : అనుగ్రహింపబడితిని.

కృష్ణ : మేమును ధన్యుల మైతిమి.

చిన్నా : ప్రభూ!...

కృష్ణ : (అర్ధోక్తిలో) ఆగితి వేమి? దేవీ!

చిన్నా : ఏమియును లేదు, ప్రభూ!

కృష్ణ : ఏదియో యోచనాప్రవాహమునందు కొట్టుకొనిపోవుచున్నావు కాబోలు!

చిన్నా : కాచా, స్వామివారికి సుఖాసనము ఎక్కడ నుంచితివే?

కృష్ణ : దేవీ, అమర్చియుంచిన పూసెజ్జపై సుఖాసీనుడనై యున్నాను. ఎందులకీ సంభ్రమము దేవీ! ఏమి నీ తను వింత కాగుచున్నది?

చిన్నా : ప్రభూ! నేను మందబుద్ధిని! మందభాగ్యను గూడ!

కృష్ణ : చిన్నాదేవీ!

చిన్నా : స్వామి, తాము సుక్షత్రియకులసంజాతులు. త్రిసముద్రవేలావలయితాఖండభూమండలి నేలు సార్వభౌములు. విజయనగరరత్నసింహాసనారూఢులైన రాజపరమేశ్వరులు. నేను పూత మెలంగు పచరించునట్టి కులముదానను. మహారాయలు మాబోంట్ల నివాసములకు రాదగదు. దేవరవారి కింత శ్రమకలిగించిన తమ పాదదాసి నమస్కరించుచున్నది. నా తప్పు కాచి రక్షింపుడు.

కృష్ణ : దేవీ, నీ పాపటి బొట్టులోని రత్నములు నా పాదములకు నొప్పి కలిగించుచున్నవి.

చిన్నా : దేవి శబ్దమును స్వామివారు నాకుప యోగింప జనదు. నే ననర్హను!

కృష్ణ : హృదయేశ్వరీ!

చిన్నా : ఒకనాడు ఒసగిన వాగ్దానమును స్వామివారు ఇప్పుడు తప్పనిసరిగ నెరవేర్పవక్కర

లేదు. స్వామివారి యనుగ్రహము నెప్పటియట్ల నుండిన నంతియ చాలును.

ఓబ: అమ్మా! స్వామివారికి విజయనగర సార్వభౌములకు 'భాషగ తప్పువ రాయర గండాంకము' ఫల క్రమాగత మైనది.

చిన్నా: నావంటి సామాన్యవనిత కొసగిన భాష తప్పుట విశేషము గాదు.

కృష్ణ: హృదయేశ్వరీ!

ఓబ: అమ్మా, స్వామివారు వనితాధీనులు గారమ్మా!

చిన్నా: స్వామిని దూషించుట లేదు నేను. నా స్వామి వేంచేసి నా గృహము పావనము చేసినారు. ఇంతియే చాలును. ఇది మహాభాగ్యము కాదే!

కృష్ణ: చిన్నాదేవి! ఆనాడు, తొలుత చంద్రగిరిలో పట్టాభిషిక్తులమయినది మొదలు నేటివఱకు, ఈ యేడాదిలోపల నిన్ను తలచుకొనని దిన మొక్కటికూడ లే దనియా నీ కలుకుమాటలు? ముందు చనిన దివములలో నున్న తీరిక, అప్పటి పరిస్థితులు ఈ రాజ్యభారమును పూనిన దాదిగా లే వని, మారిపోయిన వని నీ వెఱుగజాలకున్నావు.

చిన్నా: ఎఱుగుదును స్వామీ! ఎఱుగ కేమిటి? అందులకే మఱచితిరో, త్రోవ తప్పితిరో, జాగ్రతను విడనాడితిరో, ప్రభు విట్లు వేంచేసియున్నారని యూహించుచున్నాను. "వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కనగాద యేరికిన్?"

కాచ: అమ్మా, స్వామివారు త్రోవ తప్పను లేదు. ప్రమత్తులై చరించుటయు లేదు. శ్రీకృష్ణదేవ మహారాయల హృదయఫలకమున చిన్నాదేవులు చిత్రితమై హత్తుకొని యున్నా రని లోకు లనుకొనుచునే యున్నారు. చిన్నాదేవమ్మ కృష్ణరాయలవారిపై నిలిపిన కన్నెమరులు గాఢముగ నాటుకొనియున్న వని గూడ లోకు లెఱుగుదురు.

కృష్ణ: చిన్నాదేవీ!—

చిన్నా: స్వామివారి మనోవీథిని అలముకొని యున్న మేఘముల గతు లెఱుగనిదానను గాను. మహారాయలట! మూర్ధాభిషిక్తులట! చిన్నవాడు వలపు నిలిపిన ఒక సామాన్యవనితకొఱకు జంకు గొంకును లేక యీ మెయిలు సొచ్చినాడట! లోకులు విన్న నీ వార్తను దూషింపరో? విపరీతములు పుట్టవో? విపత్తులు సంభవింపవో? ఇక మహాప్రధానుల చెవిని బడిన ప్రమాదము సంఘటిల్లదే? మక్కువ యున్నచో మగువను తన సాన్నిధ్యమునకు రప్పించుకొని సుఖించుట రాజులకు పాడి.

కృష్ణ: చిన్నాదేవీ.

చిన్నా: సామాన్యకులమున బుట్టినదానను. స్వామివారి కటాక్షమునకు పాత్రురాల నైనదానను. కాని అంతమాత్రమునకే దేవిపదమున కర్హురాలను కాజాలను. నా ప్రభువు, మన్ననతో నన్ను తమ సన్నిధికి రప్పించుకొన దగునే?

కాచ: అమ్మా, మీరు అవిచారముగ బలుకుచున్నారు. మహారాయలు మిమ్ములను తమ సన్నిధికి రప్పించుకొన సమ్మతము గాకనే ఇటకు వేంచేసి యున్నారు.

చిన్నా: నా స్వామి యిటకు వేంచేయుట నా భాగ్యమే యగును గాని, అది యేమి? వగర్చుకొనుచు వచ్చుచున్నది చెల్వమ్మ? కాచా, ఏమో తెలిసికొని రమ్ము. ఇంతరాత్రివేళ ఏమి విడ్డూరము వాటిల్లినదో?

కాచ: విశేష మేమియును లేదు. మీకవితాగురువులు, అల్లసాని పెద్దన్నయ్యంగారు వేంచేసి యున్నారట.

చిన్నా: ఇంత యర్ధరాత్రమున!—ఎన్నడు...

కృష్ణ: పెద్దనకవీంద్రులు ఇపు డేల వచ్చిరిటకు? ఏ నిటవచ్చియుండుట పెద్దనకవి యెఱుగరాదు! చిన్నాదేవీ! నేను పోయి రావలయు.

చిన్నా: ఎఱిగియే వచ్చియుందు రని నాకు ఊహ పొడముచున్నది ప్రభూ!...మరల నాపై ఎన్నడు ప్రసరించునో స్వామివారి కటాక్షము!

కృష్ణ: దేవీ, వెఱవకుము.

(నిష్క్రమించును)

చిన్నా: ఓసి కాచా, స్వామివారి కటాక్షమును బడసి, అందలమెక్కించి, పీడోక్కలు సమర్పించి వారిని

నే సాగనంపించునంతకు, గురుదేవులను అభ్యంతర మందిరమునందు సుఖాసీనమందు వేంచేయింపుము. వారికి శ్రమ మపనయింపను ఉపచారములు చేయుచుండవలయు నని పరిచారికలకు నా యాజ్ఞ దెలుపుము. పొమ్ము—ఏమి ? ఇంతలో తిరిగి వచ్చుచున్నావు ?

కాచ : అమ్మా, కవీంద్రులు అభ్యంతరమందిరమున విశ్రమింపక, తమ కేదో అత్యవసరముగ నొక విషయమును వినిపింపదలచి తమ రుండు తావునకే వచ్చుచున్నామని సెల విచ్చినారు.

చిన్నా : చిత్రముగ నున్నది కవీంద్రుల రాక ! మంచిది!...ఆంధ్ర కవితా పితామహులకు, నా గురుదేవులకు సాష్టాంగ నమస్కారములు.

పెద్దన : కళ్యాణమస్తు. శుభమస్తు. మనోవాంఛా ఫలసిద్ధిరస్తు.

చిన్నా : గురుదేవులు ఈ శిష్యురాలి సదనము పావనము చేయబూనుట మహాభాగ్యము. గురుదేవులకు కుశలమే కద ?

పెద్ద : మాకు కుశలమే.

చిన్నా : మరి ?

పెద్ద : ఇంత ప్రొద్దుపోయిన వేళ నీ ప్రాసాదమునకు నేను వచ్చిన కారణము తెలిసికొన కుతూహలములో నుందువు.

చిన్నా : చిత్తము.

పెద్ద : చిన్నమ్మా ! ఈనాటి పరిస్థితులు విజయనగరమునకు మిక్కిలి విపత్కరములుగా నున్నవి సుమా !

చిన్నా : గురుదేవా ! అంతయు అవగతమైనది.

పెద్ద : మహారాయలు నీమీద వలపుచొప్పున రాజ్యసంరక్షణభారమును పరిత్యజించి ఆత్మరక్షణమును మఱచి ప్రవర్తించుచున్నారు. నీవు కడు జాగరూకతతో మెలగవలయును సుమా.

చిన్నా : చిత్తము. కవీంద్రులానతిచ్చిన రీతి— నేనుకూడ అప్రమత్తనై చరించుచున్నాను. కాని గురుదేవా, హృదయము వ్రయ్యలగుచున్నది. నా ప్రాణబంధువు. పతి. దైవము. నా సర్వము. నా స్వామి. భవాదృశులకు తెలియరాని విషయ మేమున్నది ?

పెద్ద : నీవు విజయనగరసామ్రాజ్యము క్షేమము కోరుదానవేని, కృష్ణదేవరాయమహారాయల మనసు నారడిపెట్టకుము.

చిన్నా : గురుదేవా ! (దుఃఖించును)

పెద్ద : చిన్నమ్మా, దుఃఖింపకుము.

"ఎవ్వడు మీ తెలుంగక య
థేచ్ఛ సుఖైకరతిం జరింపగా
నవ్వుల వంశహాని, వ్రత
హాని, యశోధనహాని పుట్టు, దా
నవ్వెడ గమ్మనుష్యపశు
వయ్యు వివేకి చెడుఁ జగంబునఁ
నవ్వగజాలు రౌరవము
నం బడు జాలును నింద పాలునై."

చిన్నా : అయ్యో, నే నెంత మందభాగ్యరాలను!

"నోములు నోచినమ్మలు మ
నోరథముల్ దయివాఱ నిత్తఱిం
దామరతంపరై ప్రియులు
దారువిహారము సల్ప, వీరిలో
నీపెయిదుఃఖశీలనను నే జీవింప దరంబె ?

(మూర్ఛపోవును)

## నాల్గవ రంగము

[మరికొన్నాళ్లకు. మంత్రి తిమ్మరుసుగారి ప్రాసాదము. అభ్యంతరమందిరమున తిమ్మరుసుమంత్రి ఆలోచనానిమగ్నుడైయుండ, వారి సన్నిధి కార్తి అవసరం నరసయ్య ప్రవేశించును.]

నరస : జయము జయము శిరఃప్రధానులకు. అవసరం నరసయ్య సాష్టాంగదండప్రణామములు.

తిమ్మ : నరసయ్యా, ఎక్కడినుండి నీరాక ?

నర : దేవరా, మలయకూట ప్రాసాదమునుండి.

తిమ్మ : ఇంత ప్రొద్దు పోయిన వేళ ?—రెండు జాములు దాటియుండవచ్చును ! ఇప్పుడు వచ్చుటకు ప్రబలకారణ ముండవలయును ! ఏమి వృత్తాంతములు?

నర : దేవరా, అంతయు తా మూహించిన రీతిగా జరిగినది. జరుగుచున్నది.

తిమ్మ : మహారాయలు అంతఃపురమున పవ్వళింప లేదా? ప్రతిదినమట్లు నేడుకూడ నొంటరిగ నగరిపరిశోధనమునకు బోయి యుండిరా?

నర : దేవరచిత్తము.

తిమ్మ : తమ్ముడు గోవిందయ్య ఏమి చేయుచున్నాడు?

నర : మహామంత్రి గోవిందయ్యగారికి ప్రతిక్షణమును ఎక్కడ ఏమిజరుగుచున్నదియు తెలియుచున్నది. అన్నగారి ఆజ్ఞాబలమున వారు అప్రమత్తులైయున్నారు. మహారాయలవారు నగరశోధనకు బోవుచుండగ శ్రీవారికి వెనుక, శ్రీవారికి తెలియకుండ కొంద్రాజు మొదలయిన సాయుధులైన చారులను బంపుచున్నారు. ఎట్టి ప్రమాదము సంభవించునో యని వీరభటులు, జెట్టీలు కొందరు వెనువెంట నిశ్శబ్దముగ నడచుచున్నారు.

తిమ్మ : మహారాయల వెంట నేమయిన పరివారమున్నదా?

నర : చెప్ప వలని కాదు దేవరా! మహారాయలవారు కొంత మేర పాదచారులై పోవుచుందురు. కొంతదూరము ఎక్కడనుండియో వచ్చు అందలమెక్కి పోవుచుందురు. అప్పుడప్పుడు అశ్వారూఢులై అరుగుచుందురు కొంతదూరము.

తిమ్మ : ఈ వివరముల నన్నింటిని గోవిందయ్య సరిగా గుర్తించునా?

నర : దేవరచిత్తము.

తిమ్మ : ఔరా, ఎంత సాహసము! విజయనగర మహాసామ్రాజ్యమునంతటను అప్రమత్తులై సంచరించు గూఢచారులుగూడ మన మహారాయలను పట్టుకొనలేకున్నారు!

నర : శిరఃప్రధానులకు ఒక వృత్తాంతమును విన్నవింతును. మన్నించి అవధరింతురు గాక! నిన్నటిరేయి మహారాయలవారు, మూడవప్రాకారమునందు పాదచారులై పోవుచుండ, ఏదియో గుసగుసగా మాటలాడుకొనుచు ఇద్దరు—ఒకడు ముసల్మానుడు, రెండవ వాడు జంగముడు - శివయోగి — శ్రీవారిని సమీపించి సంభాషణలోనికి దింపి, శ్రీవారిని గుర్తించుటకు ప్రయత్నము చేసిరట! అపుడు మహామంత్రి గోవిందయ్యగారి వీరభటులు, చారులును గలసి, ఆదుర్మార్గులను బిజాపుర వేగర్లనుగా గుర్తించి, ముహూర్తమాత్రములో నా యిరువురిని వలవేసి బంధించి చేపలను బట్టినట్టు పట్టుకొని నగరరక్షకుని సన్నిధికి గొనిపోయిరి. వా రిరువురును మహారాయలవారికి అపాయము దలపెట్టి కాచుకొని యున్నట్లు వారివద్ద దొరికిన రెండు ఉత్తరములనుబట్టి, బిజాపురమునుండి వచ్చిన వాటివలన దెలిసెను.

తిమ్మ : ఈ కథనంతయు పొద్దుటనే వింటిని. తరువాత నేమి జరిగెను?

నరస : దేవరవా రూహింపజాలని దే మున్నది? మంత్రి గోవిందయ్యగారు వా రిరువురిని చిత్రవధ చేయించి రాజద్వారగోపురములకు వ్రేలాడగట్టించినారు.

తిమ్మ : నరసయ్యా, అవసరముగా నిపుడు నీవు గొనివచ్చిన వార్త లేమి?

నరస : నేటిరాత్రి గూడ మహారాయలవారు మలయకూటప్రాసాదాంతఃపురమున పవ్వళించలేదు. హెగ్గడికత్తెలు, ఊడిగం బాచన్న, అడపం తిమ్మనాయడు, సముఖం చెన్నప్ప మొదలయినవా రెవ్వరికిని మహారాయల వృత్తాంతము తెలియదు.

తిమ్మ : విజయనగరప్రాకారములలోని తొమ్మిది గోపురద్వారములుగూడ మూయబడియున్నవి గదా. నా యాజ్ఞలేకుండ ఎవరు వచ్చినను తెల్లవారినపిమ్మట గూడ కవాటములు తెరువరాదు. మహారాయలే వచ్చినను తెరువరాదు. చిన్నాదేవమ్మగారి భవనముచుట్టును గోవిందయ్యగారు పడికావలివాండ్రను ఈవలనే నియమించినారు కదా.

నరస : దేవరచిత్తము.

తిమ్మ : ఇంక మహారాయలు ఎట్లు తప్పించుకొని పోగలరు? కాదు. ఇంక మహారాయలవారికి భయము

లేదు. ఈవలనకు అప్పుడే ఈ సాహసకార్యమువలన రెండు పర్యాయములు ప్రాణోపద్రవము తప్పినది.

నరస : దేవర అప్రమత్తత !

తిమ్మ : నరసయ్యా, నీ విప్పుడు పోవలయును. అల్లసాని పెద్దన్నగారిని, మహారాజపురోహితులు సర్వతోముఖయాజులు యజ్ఞనారాయణ దీక్షితుల వారిని, వేదపండితులు వెంకట్రామశాస్త్రిలుగారిని మేము అత్యవసరముగ కలసి సంప్రతింపవలసియున్నది. వీరెల్లరు వేర్వేఱ మాకు దర్శన మీయవలయును. తెలిసినది కదా ?

నరస : దేవరచిత్తము. పోయిరా సెలవు దయచేయుడు. (నిష్క్రమించును.)

తిమ్మ : మంచిది. కొండా, ఎవడురా? సేవకు డక్కడ? కావలి ఎక్కడ?

కొండ : ప్రభువువారి ఆజ్ఞ.

తిమ్మ : శీతకాలమయినను, నాకు ఉష్ణబాధగా నున్నది. ఆరామమందు ఆకసముక్రింద నాకు శయ్య నమరింపుము.

కొండ : దేవర చిత్తము !

## ఐదవ రంగము

[మరికొన్ని దినములకు. మలయకూటప్రాసాదమున కృష్ణదేవమహారాయల దర్శనముకొఱకు ప్రాతఃకాలముననే శిరఃప్రధాని తిమ్మరసుమంత్రి వచ్చెను. అభ్యంతర మందిరమున కృష్ణదేవరాయలు, మంత్రి తిమ్మరసు ప్రవేశింతురు.]

మంత్రి : జయము, జయము ! విజయనగర రత్నసింహాసనాధ్యక్షులకు అభ్యుదయపరంపరావాప్తి రస్తు. శ్రీ కృష్ణదేవ మహారాయలవారికి, రాజపరమేశ్వరులకు కుశలమే కదా ?

శ్రీకృష్ణ: కర్ణాటాంధ్ర సామ్రాజ్య ధౌరంధర్యులకు, శిరఃప్రధానులకు, మా కాప్తసచివులకు నమస్కరింతుము.

తిమ్మ: మహారాయలవారు ఈప్రాతస్సమయమున సావధానమనస్కులై యున్నారని తలంతును. విన్నపమొకటి చేయవలయును. రాచూరు, ముదుగల్లు కోటలపై దండయాత్ర సాగింపను ఏలినవారు అవధరించిన తెలుగున—కురకాణ్యము పై కార్యము చేసేవారలు గావున-వలసిన సైన్యము సంధానము చేయబడినది.

కృష్ణ : ఎంత శీఘ్రకాలములో చేయగలిగితిరి ! తిమ్మరుసయ్యా, అఘటనఘటనాసామర్థ్యము మీకే గలదు.

తిమ్మ : ఏలినవారి ఆజ్ఞాబలము. స్వామివారి సైన్యసమీక్ష మొదటిసారి నగరమునకు వెలుపల యేర్పరచితిమి. కొండనాయనిపల్లె సంకలాపురముల చెంత విజయస్కంధావారమును నిర్మించినారు. ఏలినవారి గుడారములు విజయస్కంధావారము నడిమిభాగమున వేయబడినవి. ఆరువేల యేనుగులు, గుఱ్ఱాలు ఇరువైనాలుగు వేలు, కాల్బలము రెండులక్షలును సంతరించినాము. కైజీతమున సమకూర్చినా మీ సైన్యమును అంతయును. ఏలినవారీ మహాసైన్యమును నేటి యుదయమున సమీక్షచాయ నవధరింపవలయును.

కృష్ణ : లెస్సగా నున్నది. మాకు ఆశ్చర్యమును, ఆనందమును కలిగించిన శిరఃప్రధానుల సామర్థ్యము కొనియాడి బహూకరింప దగియున్నది. అయ్యా, ఇవే తమ కుచితమైన సప్తాంగము ! అపరంజిసరిగతో నల్లిన పట్టుకుళ్లాయి, పట్టుకబాయి, ఇవే శాలి, చౌకట్లు, పీతాంబరం, ఇవే గంధము, కస్తూరి, కర్పూర తాంబూలం, ఆభరణములు. శిరఃప్రధానులను సత్కరించి మేము ధన్యుల మైతిమి !

తిమ్మ : దేవరవారి కటాక్షము.

కృష్ణ : ప్రస్థానముహూర్త మిప్పుడే గద ?

తిమ్మ: దేవర శ్రీచిత్తము. దేవరవారు మదహస్తిపై నెక్కి రావలయును.

కృష్ణ : మా శిరఃప్రధానులు మా వెనుకనే కూర్చుండ వలయును.

తిమ్మ: దేవర శ్రీచిత్తము. రాయసం కొండమరుసు అయ్యమరుసులు, దళవాయి గోవిందయ్య, మహాపేవాని పెమ్మసాని రామలింగయ, సముఖస్థుడు రాయసింహాసనం త్ర్యంబకదేవుడు, మహానాయంకరాచార్య

ఓబలనాయకుడు, మహామండలేశ్వర అరవీటి బుక్క రాజు, అవుకువారు, ఆదిగా గలవా రందరు అశ్వారూఢులై ముందువెనుకల ఇరుపార్శ్వములందు అనుసరించి రాగలరు.

కృష్ణ: లెస్సగా నున్నది.

(అంతట మంగళతూర్యారావములు, శేహూ ధ్వనులు చెలరేగును.)

(అప్పుడు మాగధి బిరుదుగద్య ఈ రీతిగా పఠించును:)

జయజయ స్వస్తిశ్రీ సంతతవేంకటాచలపతి చరణారవిందసేవాకందళితసామ్రాజ్యసుఖోప భోగ! సమస్తసద్గుణాభిరామ! సకలవసుంధరాభారధరణ ధురంధర! నిస్తులప్రతాపతపనోదయ! నిరస్తపరిపంథి సామంతాధికారాంధకార! తుళువవంశాలంకార! శరణాగతవజ్రపంజర! మహాదానకంకణ! మణికంకణ! శౌర్యసహాయ! ఈశ్వరనరసరాజప్రియతనూజ! నాగాంబాగర్భశుక్తిముక్తాఫలా! శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయర గండ! భాషగె తప్పువ రాయరగండ! శ్రీకృష్ణదేవమహారాయా! విజయీ భవ! దిగ్విజయీ భవ!

(మంగళధ్వనులు. మరల కృష్ణదేవమహారాయలు. గజారూఢుడై బయలుదేరును.)

## ఆరవ రంగము

[శ్రీకృష్ణదేవరాయలు, మంత్రి తిమ్మరసు మద హస్తిపై కూర్చుండి సంభాషించుకొనుచుందురు.]

తిమ్మ: మహారాయలవారికి ఏదులఖానుని సైన్యబల మెంత గలదో, బిజాపురసేనానులు ఎంత సాహస శౌర్యములు, ఎంతటి రణకౌశలమును గలవారో విశదమే కదా!

కృష్ణ: అయ్యా! మన సమరసన్నాహములు బిజాపురమువారికి తెలియకుండునా? ఇసామయిలు కడు దుర్మార్గుడు. తన ప్రభువుకం ద్రోహమొనరించి, విశ్వసించిన ప్రభువుకుమాళ్లను చెఱయుం దుంచినాడు.

తిమ్మ: అతడు కృతఘ్నుడు; శిక్షింపదగినవాడు. శ్రీవీరనృసింహరాయలవారు రాచూరు ముదుగల్లుసీమలను సాధించు భారమును ఏలినవారిపై నుంచి స్వర్గస్థులైనారు.

కృష్ణ: అంతే కాదు తిమ్మరసయ్యగారు! ఉదయగిరిరాజ్యము మొదలుకొని కొండవీడు, కొండపల్లి సీమలవఱకును గల ఆంధ్రమండలభాగమును సాధించి విజయనగరసామ్రాజ్యమునందు చేర్పవలయు నని సాళువ నరసింహరాయలవారి సంకల్పము. అన్నగారి సంకల్పముకూడ నదియే గద. కావున మా పూర్వుల యభిలాష దీర్పను భారము మాయందు కలదు!

తిమ్మ: దేవరవారు లెస్సగా అవధరించినారు.

కృష్ణ: మనము రాచూరి ముదుగల్లుకోటలు సాధింపబోయినచో గజపతి సామంతులు ఉదయగిరి నుండి వచ్చి చెంజి చంద్రగిరి రాజ్యములపై బడగలరు.

తిమ్మ: దేవరవారు సామ్రాజ్యరక్షణమందు అప్రమత్తులై యోచించుచున్నారు. మహాభాగ్య మిది. కాని...

కృష్ణ: అయ్యా, అర్ధోక్తిలో ఆగినారు? ఏమి యోచన చేయుచున్నారు శిరఃప్రధానులు?

తిమ్మ: యోచన యేమియు లేదు. దేవరవారి చిత్తము సామ్రాజ్యరక్షణయందు దగిలియుండినది గదా, యితర రక్షణోపాయముల నేమేమి తలపెట్టియున్నారో యని యోచించుచున్నాను.

కృష్ణ: అటు ఉదయగిరివారిని అదుపులో నుంచవలయును. ఇటు విజయనగరమును సంరక్షించుకొనవలయును.

తిమ్మ: దేవరచిత్తము!

కృష్ణ: ఈ మహాసైన్యమును, అమరనాయకుల సైన్యమును కలిపి మూడు భాగములు చేసి, ఒకటి విజయనగరసామ్రాజ్యభద్రస్థితికి నగరమున నిలిపి, మిగిలిన రెండు భాగములతో మేము తుంగభద్రాపై కార్యం సాగింపదలచినాము.

తిమ్మ : దేవరవారి ఊహ చక్కగా నున్నది. గజపతి గర్వమున ప్రమత్తుడైయున్నాడని వింటిమి. కావున ఉదయగిరినుండి ప్రస్తుతము మనకే భయమును కలుగబోదు. విజయనగరరక్షణకు దేవరవారు విశ్వసించిన దండనాయకు డెవ్వరు ?

కృష్ణ : శిరఃప్రధానులు ఈ నియామకము మాచేత చేయింపదలచిన ట్లూహింతుము.

తిమ్మ : మహారాయలవారు ధురంధరులు. రాజపరమేశ్వరులకు విశ్వాసపాత్రుడయిన భాగ్యశాలి ఎవ్వరైయుండురా యని యోచించుచున్నాను.

కృష్ణ : దీని కింత పెద్ద యోచన పనిలేదు? తిమ్మరుసయ్యగారు ! కలడు కదా తమ సోదరుడు గోవిందయ్యగారు. వారినే నగరరక్షకులుగా నియమించెదము.

తిమ్మ : మహాభాగ్యము. ఏలినవారికి విశ్వాసపాత్రులమైన భృత్యులము. సర్వదా కృతజ్ఞులము. మా యుత్సాహ ప్రభు మంత్ర శక్తులు, ఉపాయ బుద్ధి ప్రాణములు దేవరవారి సేవ కుపయోగపడుట మా భాగ్యము. ఈ ప్రభుసేవకుని దొక విన్నపము కలదు స్వామి !

కృష్ణ : అవశ్యము సెలవీయుడు.

తిమ్మ : మహాప్రసాదము. సామ్రాజ్యభద్రస్థితికి, విజయనగరసంరక్షణకు, తురకాణ్యంమీద కార్యం చేయుటకొరకు కైజీతసైన్యమంతయును సంతరించుట యందు స్వయముగా రాజకార్యమును పరిశ్రమించి చక్కబెట్టుకొనుటలో నిరుపమానప్రజ్ఞాధురంధర్యములను జూపుచున్న మహారాయలవారు — ఈ హిందూమహాసామ్రాజ్యభద్రస్థితికి మూలాధారమైన మానప్రాణధనము లనుగూడ అతిసాహసాతిరేకమున లెక్కసేయకున్నారు.

కృష్ణ : శిరఃప్రధానుల వాక్యరచన నిగూఢమై, సూటిగా అర్థమగుటలేదు.

తిమ్మ : ఏ విపరీతపరిస్థితులందు ఈ మహాసామ్రాజ్యము ఇంకను ఊపిరియాడకుండ కొట్టుకొనుచున్నదో ఏలినవారికి తెలియని విషయము గాదు.

కృష్ణ : తిమ్మరుసయ్యగారు, తమవంటి నియోగులు మాకు శిరఃప్రధానులై రాచకార్యము చక్కబెట్టుచుండ...

తిమ్మ : ఏలినవారు నా విన్నపము పూర్తిగా నవధరింతురుగాక. ఏలినవారి శ్రీచిత్తము మా భాగ్యవిశేషము. దేవరవారిని శ్రీ వీరనృసింహరాయలవారు ఏ కారణమున విజయనగరరత్నసింహాసనముపై నభిషేకింప నవధరించి ముద్దుటుంగర మిచ్చిరో, ఇంతకు పూర్వమే ఏలినవారు సెలవిచ్చియున్నారు.

కృష్ణ : మహాప్రధాను లేమంటిరి ? సరిగా నాలకింపలేదు.

తిమ్మ : దేవరవారు నగరశోధనకు ఒంటరిగా బోయినపుడు రెండు పర్యాయములు బిజాపురపు తురకవేగరులు తలపెట్టిన ఘోరకార్యములు...

కృష్ణ : తిమ్మరుసయ్యగారు, మేమును ఆ తరుణములందు మిక్కిలి జాగరూకులమై ప్రవర్తించితిమి.

తిమ్మ : ఆ రీతి నొంటరిగ బోవుట సాహసము ! విపరీతమైన సాహసము. ఏలినవారికి అపాయము తప్పుట విజయనగరహిందూరాజ్యరమాసౌభాగ్యగరిమ కారణము గాని దేవరవారి అప్రమత్తత గాజాలదు. క్షమింతురుగాక ! ఇస్మాయిలుఖానుప్రయత్నములే, తలంపులే సిద్ధించినచో, విజయనగరసామ్రాజ్యమేమయి యుండెనో. అట్టి అమంగళము నా కంఠమున ప్రాణమున్నంతకాలము జరుగనేరదు.

కృష్ణ : శిరఃప్రధానుల భావము ?

తిమ్మరుసు : దేవరవారు ఎఱుగని దేమున్నది? వాత్స్యాయనుడు కామసూత్రములందు "బహవశ్చ కామవశగాః సగణా ఏవ వినష్టా శ్రూయంతే", "న త్వేవ పరభవన మీశ్వరః ప్రవిశేత్" అని ఇత్యాదిగా శాసించినాడు. లోకహితుడైన రాజు ఇంద్రియనిగ్రహము కలవాడుగా నుండవలయును. మూర్ధాభిషిక్తుడు విషయాభిలాషియై వేశ్యాంగనయిలు సొరరాదు. అది మానప్రాణభంగములకు కారణము.

కృష్ణ : తిమ్మరుసయ్యగారు ?

తిమ్మ : మహారాయలు నా హితవును తిరస్కరింపదలచినచో, ఈ శిరఃప్రధానత్వమును, ఈరాజ్య సంరక్షణభారమును ఈ క్షణమె యేలినవారు విశ్వాస పాత్రులయిన మరియొకరికి ఒసగవచ్చును. నేను నిశ్చింతతో నుందును.

కృష్ణ : తిమ్మరుసయ్యా.

తిమ్మ : దేవరవారికి అమంగళము శాంతించును గాక. నేదేని హాని వాటిల్లినచో ఈ హిందూసామ్రాజ్యము గతి యేమి కావలయును స్వామీ ?

కృష్ణ : తిమ్మరుసయ్యా, తా మెఱుగని దేమున్నది? ఆమె వేశ్యాంగనయే కావచ్చును. కాని యామె పాణిగ్రహణము నేనాడో జరిగినది. ఇరువది రెండేండ్లుగా మా యిరువురి దాంపత్యగాథ సాగినది. ఆమె నా మనోనయనప్రాణవల్లభ !

తిమ్మ : దేవరవారు చిన్నమ్మగారిని అంతఃపురమునకే రప్పించుకొనవదసును. ఒక సామాన్యవనితకై మూరురాయరగండడు ఇట్లు చరింపదగదు. ఇది రాజధర్మమునకు, లోకధర్మమునకు గూడ విరుద్ధము.

కృష్ణ : ఆమెను—తాము వచించిన రీతి ఒక సామాన్యవనితను — విజయనగరసార్వభౌముడు తన అంతఃపురమున ప్రవేశపెట్టదలచుట రాజధర్మమునకు విరుద్ధము కాదే? లోకులు విన్న నవ్వరే ?

తిమ్మ: అటులయిన దేవరవారు చిన్నమ్మగారిపై మనసు త్రిప్పుకొనజాలరు ?

కృష్ణ : తిమ్మరుసయ్యా, అది అసంభవము. అదియునుగాక నేను ఆమె కొక సమయమున వాగ్దాన మిచ్చియుంటిని.

తిమ్మ : దేవర శ్రీ చిత్తము. ఏలినవారికి....

కృష్ణ : అయ్యా! తిమ్మరుసయ్యా! తా మీ రీతి బలుకదగదు. నేనును విన నెఱుగను. విజయనగర సామ్రాజ్యరక్షణమును వీడజాలను; చిన్నాదేవి కిచ్చిన వాగ్దానమును తప్పజాలను. ఆమె నా హృదయేశ్వరి.

తిమ్మ: దేవరవారు సుక్షత్రియ వంశసంభూతులు. సామాన్యస్త్రీని పెండ్లియాడుట యొకటి, ఆమెను పట్టమహిషిని చేయదలచుట యొకటి, ఇట్టి విపరీత మెందయిన వింటిమే మందు ?

కృష్ణ : అయ్యా, తిమ్మరుసుమంత్రీ, తాము మాకు ఇష్టసచివులు, పితృసమానులు.

తిమ్మ: ఏలినవారు ఈవిషయమును పునరాలోచన చేయదగును. ఈ భృత్యుని హితవు నవధరింప వేడెదను.

కృష్ణ : అయ్యా !

తిమ్మ : మహారాయలవారు విజయస్కంధావారమును ప్రవేశించుచున్నారు. మంగళతూర్యారావములు చెలరేగుచున్నవి. సైన్యాధ్యక్షులు, దండనాథులు, పడవాళ్లు, మన్నెదొరలు వారి వారి గౌరవ మర్యాద సంప్రదాయానుపూర్వకముగ నిలువబడి యేలినవారికి సాహోబళాలు చెల్లుచున్నారు. వీరలాంధనముగ రాజపరమేశ్వరునికి వందన మిడుచున్నారు.

స్కంధావార : స్వస్తిశ్రీ హిందూరాజ్యరమారమణా! జయీ భవ, దిగ్విజయీ భవ. రాజాధిరాజ రాజపరమేశ ! జయీ భవ, దిగ్విజయీ భవ. శ్రీకృష్ణదేవరాయమహేంద్రా! జయీ భవ, దిగ్విజయీ భవ!

బట్టు :
"శ్రీ వెంకటేశపదప
ద్మావేశితసదయహృదయ, హరనిటలనట
త్పావకపరిభావిమహః
ప్రావృతనిఖిలాశ! కృష్ణరాయమహీశా!"

జయీ భవ, దిగ్విజయీ భవ! (మంగళతూర్యారావములు, శంఖధ్వనులు.)

## ఏడవ రంగము

[మరికొన్ని దినములకు. సాళ్వతిమ్మరసు మంత్రీశ్వరుని మందిరము. ప్రవేశము అవసరం నరసరాజు.]

తిమ్మ : నరసయ్యా, ఎంత సేపయినది నీవు ప్రవేశించి? కార్య మేరీతి సాగుచున్నది ?

నరస : మహారాయలవారు శిరఃప్రధానులకు సయితము దర్శన మీయ వెఱచుచున్నారట.

తిమ్మ : ఈమాట నాకు వింతగా నున్నది నరసయ్యా. మహారాయలవా రెక్కడ, నే నెక్కడ? ఎంత

తారతమ్యము. రాజపరమేశ్వరునకు అనుగ్రహము తప్పిన నన్ను ఈ క్షణము నగరులోనికి రావలదని శాసింతురు. రాజసేవ ఇట్టిది. నేడు రమ్మనవచ్చును, రేపు పొమ్మనవచ్చును. ప్రభువుల చిత్తవృత్తులు, జవరాండ్ర చిత్తవృత్తులు, పసిబాలుర చిత్తవృత్తులు నొక్కరీతిగ నుండును.

నరస : నిన్న రేయి చాల ప్రొద్దుపోవువఱకు మహారాయలవారు పెద్దనకవీంద్రులతో ఇష్టాగోష్ఠి సలిపినారు.

తిమ్మ : భళిరే, పాచిక చక్కగా పారినది ! తరువాత?

నరస : మహారాయలవారు పెద్దనగారిని వీడ్కొలుపుచు గద్దియ డిగ్గి "హితుడవు; చతురవచోనిధివి; ఈ కార్యమును సాళ్వతిమ్మమంత్రీశ్వరులతో నాలోచించి అనుకూలము చేయవలయు, ఇప్పట్టున ఎవ్వరీడు చేరొక్కన మీకు ?" అనుచు పెద్దనగారి హస్తద్వయమును తన కరకమలములం దుంచికొని పల్కిరట.

తిమ్మరుసు : నరసయ్యా, పెద్దన కవీంద్రులు వచ్చువేళ అయినది.

నరస : అదె సేవకుడు వచ్చుచున్నాడు— పెద్దన కవీంద్రుల రాక తెలుపుటకు గావలయు.

సేవ : జయము, జయము సకలప్రధానశేఖరులకు. ఆంధ్రకవితాపితామహ అల్లసాని పెద్దన కవీంద్రులు ఏలినవారి దర్శనార్థ మేతెంచినారు.

తిమ్మ : నరసరాజా, నీవు పోవచ్చును. తక్కిన కార్యమును అత్యవసరముగా పూర్తిచేయుము. పెద్దన కవీంద్రులను ప్రవేశపెట్టుము కొండా.

సేవ : చిత్తము.

తిమ్మ : ఆంధ్రకవితాపితామహా ! దయచేయుడు.

అ. పె : సకలప్రధానగుణగౌరవోన్నతి గల శిరఃప్రధానులకు, సాళ్వతిమ్మసచివేంద్రులకు అభివాదములు!

తిమ్మ : అభివాదము కవీంద్రా. కార్య మేరీతి సాగుచున్నది ?

పెద్దన: తా మూహించిన రీతిగనే సాగుచున్నది. చివరకు మహారాయలువారు భాగవతములోని పద్యమును—

"బ్రదుకవచ్చుగాక బహుబంధనములైన
వచ్చుగాక లేమి వచ్చుగాక,
జీవధనములైన జెడుగాక, పడుగాక
మాట దిరుగలేరు మానధనులు"

అని చదివి వినిపించినారు.

తిమ్మ : ఇట్లు జరుగునని నేను తొలుతనే యూహించితిని.

పెద్ద : కర్తవ్య మేమి యూహించితిరి ? వ్యవహారము శ్రుతి మించి రాగమున బడినది.

తిమ్మ: ప్రభువు చిన్నాదేవమ్మను పెండ్లియాడవలయును. తప్పదు. కాని యిం దొక ధర్మసమస్య వ్యాసఘట్టమువలె ఎదుర్కొనుచున్నది.

అ. పె: శిరఃప్రధానులు, అమరేంద్రునికి బృహస్పతి యమరిన రీతి, శ్రీకృష్ణదేవమహారాయసార్వభౌములకు అమరిన మీకు సాధ్యముగాని సమస్యాఘట్ట మే ముండును ?

తిమ్మ : పట్టాభిషేకానంతరము కళ్యాణము జరిగినచో నా వధువు పట్టమహిషియగును అని వేదపండితులు, స్మృతి ధర్మశాస్త్రవేత్తలు వెంకట్రామశాస్త్రులవా రనుచున్నారు. చిన్నాదేవియు రాణిగారు గావచ్చునుగాని శ్రీ తిరుమలదేవమ్మగారు పట్టమహిషి కదా ?

అ. పె : అటులయిన మహామంత్రులవా రే మాలోచించిరి ?

తిమ్మ : విజయనగర కర్ణాట సామ్రాజ్యమునకు వాటిల్లిన లోపములన్నియు నేడు వీరప్రతాప శ్రీ వీరకృష్ణదేవమహారాయలవారివలన దీరవలయు. ఆ సార్వభౌముని శ్రీ చిత్తానుసారముగ వర్తించినగాని సామ్రాజ్యమునకు క్షేమమునకు మారుగా ముప్పు వాటిల్లగలదు.

అ. పె : శిరఃప్రధానుల యుపాయము మహారాయలకు విన్నవింతును.

తిమ్మ : కవీంద్రా, సర్వము సిద్ధమైయున్నది.

పెద్ద : కల్యాణపరంపరావాప్తిరస్తు !

తిమ్మ : తథాస్తు ! కవివాక్కు రిత్తవోదు.

## ఎనిమిదవ రంగము

[మరికొన్ని దినములకు. సాళువ తిమ్మరుసు మంత్రిశేఖరుని బుద్ధివిశేషముచేత శ్రీ కృష్ణరాయల పట్టాభిషేకమహోత్సవము మరల జరిగెను. ఈసారి మునుపటియట్లు ఒంటరిగా గాక తిరుమలదేవీసహితుడై పట్టాభిషిక్తు డయ్యెను. దేవునికి ఏటేట కల్యాణమహోత్సవము జరిగినరీతి రాయలకు తిరుమలదేవీ కల్యాణమును తిమ్మరుసుమంత్రి ముందు జరిపించెను. పిదప చిన్నాదేవి నిచ్చి పెండ్లి గావించెను. తిరుమల దేవియు, చిన్నాదేవియు తనకు గూర్చు ప్రియభార్యలుగా, పట్టమహిషులుగా శ్రీ కృష్ణరాయలు ధరావలయమునకు బట్టము గట్టుకొనెను. శ్రీభూదేవులట్లు ఉభయపార్శ్వములందు అమరియుండ శ్రీమన్మహావిష్ణువవలె కృష్ణరాయలు ప్రకాశించుచు, కల్యాణవేదికమీదినుండి దిగెను. ఆ శుభసమయమున మంగళవాద్యఘోషలు చెలరేగును. సమస్తసామంతరాజలోకము హర్షాంబువులు తొలుకాడుచుండ జయ వెట్టుదురు. అప్పుడు ఆస్థాన కవులు దీవించిన దీవనలు-

పెద్దన :

కరుణాకర వేంకటవిభు
చరణస్మరణప్రసంగాతిమతి ఈ
శ్వరనరసింహమహీభృ
ద్వరనందన కృష్ణరాయధరణీపతికిన్.

అభ్యుదయపరంపరావాప్తిరస్తు. అఖండదిగ్విజయోఽస్తు!

శ్రీఖండశీతనగము
ధ్యాఖండకీర్తిమండలాఖండల వి
ద్యాఖేలనభోజసుధీ
శేఖరుడవు కృష్ణరాయ లీలామదనా!
నిత్యకళ్యాణసౌభాగ్య మస్తు!

నంది తిమ్మన :

శ్రీ వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయక, కవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయమహీశా.

"తిరుమలదేవీవల్లభ,
కరుణామయహృదయ, రాజకంఠీరవ, యీ
శ్వర వరసభూపురందర
వరనందన బాసదప్పవరగండాంకా!

విజయోఽస్తు, విజయోఽస్తు. అఖండలక్ష్మీప్రసాదసిద్ధి రస్తు. చిరాయు రస్తు!

కృష్ణ: కవుల దీవనలు మాకు సకలశుభముల నొసగుగావుత. ఏము కృతార్థుల మైతిమి. ఇంకను శ్రీసాళ్వ తిమ్మమహామంత్రీశ్వరులకు మా నమస్కృతులు. కన్నతండ్రివలె మాకోర్కెలు తీర్చిన శిరఃప్రధానులకు మా వందనములు. చిన్ననాటనుండి పెంచి పెద్దజేసి విద్యాబుద్ధులు, రాజనీతి, శస్త్రాస్త్రకౌశలములు, సంగ్రామపద్ధతులు ఆదిగాగల విద్యలనెల్ల సాంతముగ నేర్పి విద్యానగరరత్నసింహాసనాధ్యక్షుని చేసినది యొక యెత్తు; ఈ చిన్నాదేవిని మాకు దేవేరిని జేసినది, మా 'బాస' దప్పకుండ జేసినది యొక యెత్తు. నిక్కముగ తామె మాకు జనకసదృశులు! అయ్యా, అప్పాజీ! ఇదె మరల నమస్కరించుచున్నాము.

పెద్ద: ఇది యెంతటి మహాభాగ్యము, మంత్రీశ్వరా!

"అయ్య యనిపించుకొంటివి
నెయ్యంబున కృష్ణరాయనృపపుంగవుచే,
నయ్యా, నీసరి యేరీ
తియ్యని విలుకాడవయ్య తిమ్మరుసయ్యా!"

బట్టువాడు :

శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వరా!
బాసగె తప్పువ రాయరగండ!
మూరురాయర గండ! కర్ణాటేశ్వర!
కృష్ణదేవమహారాయసార్వభౌమశిరఃప్రధానా!
సకలాగమనీతిశాస్త్రపారావారా!
శ్రీసాళ్వతిమ్మదండనాయక!
జయీభవ, దిగ్విజయీభవ!

కృష్ణ: అప్పాజీ, ఏము సర్వథా ధన్యులము, కృతజ్ఞులమును.

తిమ్మ: దేవర యొక్కరు మాత్రము కాదు; సకల హిందూసామ్రాజ్యమును, మేమును ఏలినవారి భృత్యులము, ధన్యులము. మాయందరి మనోరథము లీడేరినవి.

బట్టు :

జయ జయ కన్నడరాజ్యరమారమణా!
జయ జయ రాజాధిరాజరాజపరమేశా!
జయ జయ తిరుమలదేవీహృదయేశ్వర!
జయ జయ చిన్నమదేవీజీవితనాయక!
జయ జయ మలయకూటహర్మ్యవిహారీ!
జయ జయ భువనవిజయాఖ్య సౌధవిహారీ!
జయ జయ హిందూరాజ్యరమాధురంధరగ్రామణీ!
జయ.

# భారతదేశము-కామన్వెల్త్ సభ్యత్వం

శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు

ప్రపంచవిభజన స్థిరపడిపోయింది. ఏదేశంకూడా ఎంతో కాలం ఎటూ మొగ్గక తటస్థంగా ఉండగల రోజులుకూడా క్రమంగా గతిస్తున్నవి. ఏ మూల భగ్గుమన్నా, ఆ జ్వాలలు ప్రపంచం నాలుగుమూలలకూ వ్యాపించడానికి అనుకూలంగా పరిస్థితులుకూడా మారుతూఉన్నవి. కనుక ఏ దేశమైనా సరే, తన్ను తాను రక్షించుకోవడానికి ఏదో ఒక ఆసరా చూచుకోనక తప్పనిసరి అవుతున్నది. మనం ఒకరి జోలికి పోవడం లేదు కాబట్టి, ఒకరు మన జోలికి రారని మనస్సును సమాధానపరుచుకొని కాలక్షేపం చేయడం ఇప్పుడే సాధ్యం గాకుండా ఉంది. ఇకముందు అలాంటి ఆలోచనలకే అవకాశం ఉండదు. రక్షణ వ్యవహారాల్లో గాని, ఆర్థికవ్యాపారవిషయాల్లో గాని ప్రపంచంలో ఏ దేశమూ స్వయంసమృద్ధంగా లేదు. ద్వితీయప్రపంచసంగ్రామంలో దాదాపు అన్ని దేశాలూ అన్నివిధాలా చితికిపోయినవి. ఒక్క అమెరికా మాత్రం తన కాళ్లపై తాను నిలబడగలగడమే గాక, ఇతరదేశాలనుకూడా నిలబెట్టగల శక్తిని కలిగిఉంది. అయినా ఇతరరాజ్యాలను త్రోసిరాజనలేకుండా ఉంది. యూరపుపునరుద్ధరణపథకం యూరపురాజ్యాలకు ఎంత అవసరమో, అమెరికాకూ అంత అవసరమే. అదేవి ంగా ఉత్తరఅట్లాంటిక్ రక్షణఒడంబడిక యూరపుదేశాలకు ఎంత అవసరమో అమెరికాకూ అంతే అవసరం. అమెరికాదేశమే ఆవిధంగా స్వీయ అభివృద్ధికి, స్వీయరక్షణకు ప్రపంచరాజ్యాలను కూడగట్టుకోవలసివస్తే, భారతదేశంలాంటి కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొందిన దేశాలు ఎవరితోనూ ఏవిధమైన సంబంధమూ పెట్టుకోనక స్వతంత్రంగా ఉండగలవా? ఆవిధంగా "మాకు ఇంకొకరి పొత్తు అవసరం లేదు" అని ఆ దేశాలు ఎంతకాలం తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలవు? చైనాగతి ఏ మైందో, బర్మా ఏం కాబోతూఉన్నదో ప్రత్యక్షంగా చూస్తూ ఉన్నాం. రష్యా, బ్రిటన్, అమెరికాలు ఎంత తాపత్రయపడుతూఉన్నవో ప్రత్యక్షంగా చూస్తూ ఉన్నాం. ఇన్నీ చూస్తూ మనం ఎవ్వరి సహాయాన్నీ, ఎవ్వరి సహకారాన్నీ అభిలషించకుండా, అర్థించకుండా ఎలా ఉండగలం?

భారతప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఇవన్నీ గమనించే, దేశావసరాలను గ్రహించే, దేశక్షేమాన్ని కాంక్షించే కామన్వెల్తుప్రధానమంత్రుల ఒడంబడికపై సంతకం చేశారనడానికి సందేహం లేదు. రాజ్యాంగ పరిషత్తుఅధ్యక్షుడు రాజేంద్రప్రసాదు అఖిలభారత కాంగ్రెస్ సంఘసమావేశంలో లండన్ ఒడంబడికను సమర్థిస్తూ పండిట్ నెహ్రూసత్సంకల్పాన్ని శంకించడం మహాపచారం అనీ, ఆ విధంగా అనుమానించడం భారతజాతినే అవమానించడం అనీ హెచ్చరించారు. ఒకప్పుడు దేశంకోసరం ప్రాణాన్ని అర్పించడానికి కూడా వెనుకాడని దేశభక్తులు మాతృదేశానికి ద్రోహం చేసిన సందర్భాలు చరిత్రలో ఉండకపోవు. కాని పండిట్ నెహ్రూవిషయంలో ఆవిధంగా అభిప్రాయపడేందుకు దాఖలా ఏమీ లేదు. యథార్థదృష్టితో ప్రస్తుతపరిస్థితులను పరిశీలించితే, లండన్ ఒడంబడికకు సమ్మతింపకపోయినట్లయితే పండిట్ నెహ్రూ భారతదేశానికి చాలా అన్యాయం చేసినవాడు అయ్యేవాడని అభిప్రాయపడవలసివస్తుంది. ఒకవిధంగా లండన్ నిర్ణయం భారతదేశానికి, పండిట్ నెహ్రూకూ అఖండ విజయం అనే చెప్పాలి. "బ్రిటిష్ కామన్వెల్తు" అనే పేరును మార్చి "యునైటెడ్ కామన్వెల్త్ ఆఫ్ నేషన్స్" అని నామకరణం చేస్తే బర్మాకూడా కామన్వెల్తులో ఉండిపోతుం దని ౧౯౪౭ వ సంవత్సరంలో

బర్మా ప్రధానమంత్రి థాకిన్ నూ ప్రకటించారు. ఆనాడు బర్మా సాధింపలేకపోయిన మార్పును ఈనాడు భారతదేశం సాధించింది. ఈ మార్పే ౧౯౪౭ లో జరిగివుంటే బర్మాచరిత్రే మరోకవిధంగా ఉండేది. కామన్వెల్తు ఇప్పటికంటే ఇంకా ఎక్కువ బలంగా ఉండేది. కామన్వెల్తుస్వరూపంలో వచ్చిన ఈ మార్పు వల్ల బర్మా తన పూర్వనిర్ణయాన్ని పునరాలోచించు కొనడానికి అవకాశం చిక్కింది. ఇదే లండన్ ఒడంబడిక ప్రత్యేకత.

కామన్వెల్తుసభ్యత్వం కేవలం ఆ దేశాల ఇష్టాయిష్టాలపై ఆధారపడిందే అనీ, ఇందులో నిర్బంధం అనేది ఏమీ లేదనీ ఈ లండన్ ఒడంబడిక అసందిగ్ధంగా వెల్లడిచేస్తున్నది. భారతదేశం ఈ కామన్వెల్తునుండి వైతొలగడానికి నిశ్చయించుకుంటే ఈ క్షణం బయటికి వచ్చివేయవచ్చు. అలాగే బర్మా తిరిగి కామన్వెల్తులో చేరదల్చుకుంటే ఇప్పుడే చేరి పోవచ్చు. ౧౯౨౬ వ సంవత్సరంలో ఓం ప్రథమంగా బ్రిటిష్ అధినివేశాలు అంటూ బ్రిటిష్ సామ్రాజ్యం లోని సంపూర్ణ స్వాతంత్ర్యం, స్వపరిపాలనాధికారం గల రాజ్యాలకూటమి ఏర్పడినప్పట్నుంచీ ఆ అధినివేశాలకు బ్రిటన్‌తోనూ, బ్రిటిష్ కామన్వెల్తుతోనూ తమ సంబంధబాంధవ్యాలను నిర్ణయించుకునే అధికారం ఉంటూనే వచ్చింది. బ్రిటిష్ కామన్వెల్తు నిర్వచనంలోనే ఈ విషయం ఇమిడివుంది. ౧౯౨౬ వ సంవత్సరంలో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్యసమావేశంలో ఈ అధినివేశనిర్వచనం జరిగింది. "బ్రిటిష్ కామన్వెల్తు జాతులుగ ఐచ్ఛికముగ సంఘటితమైన సంపూర్ణ స్వపరిపాలనాధికారంగల తెగలు" అనే ఈ నిర్వచనం. అప్పుడే ఈ స్వపరిపాలనాధికారానికి ఏమైనా పరిమితి అంటూ ఉన్నదా అనే అనుమానం కొందరికి కలిగింది. ఏ అధినివేశమైనా, తనకు ఈ కామన్వెల్తులో ఉండేందుకు ఇష్టం లేకపోతే, ఆ కామన్వెల్తులోనుంచి వైతొలగడానికి స్వాతంత్ర్యం, హక్కు ఆ అధినివేశానికి ఉన్నదా అని దక్షిణాఫ్రికా జనరల్ హెర్ట్జాగ్, ఐర్లెండ్ కాస్‌గ్రేవ్ ప్రశ్నించారు. బ్రిటన్ యుద్ధానికి దిగితే ఏ అధినివేశమైనా సరే, బ్రిటన్‌పక్షాన యుద్ధానికి దిగకుండా బ్రిటిష్ అధినివేశంగా ఉండగలదా అని వీరు అడిగారు. అయితే అప్పట్లో ఈ ప్రశ్నలకు ఖచ్చితమైన సమాధానం రాలేదు. విడిపోయే అధికారంగురించి ఈ నిర్వచనంలో ఏమీ లేదని, ఆయా దేశాలు తమ ఇష్టంమీద బ్రిటిష్ కామన్వెల్తుగా ఏర్పడిన వనీ, కామన్వెల్తులో చేరడంలోనే ఈ స్వాతంత్ర్యం ఉన్నదనీ ౧౯౨౬ సామ్రాజ్యసభలో పాల్గొన్న బ్రిటిష్ రాజ్యాంగవేత్తలు వాదించారు. ౧౯౪౨ వ సంవత్సరంలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ అధినివేశాలకు కామన్వెల్తులో చేరడానికి ఎంత స్వాతంత్ర్యం ఉన్నదో కామన్వెల్తునుండి విడిపోవడానికీ అంత స్వాతంత్ర్యం ఉన్నదని స్పష్టంచేయడానికి పూర్వమే, దక్షిణ ఆఫ్రికా, ఐర్లెండ్ ఈ సమస్యను పరిష్కారం చేసి వేసినవి. ౧౯౩౭ వ సంవత్సరంలో ఐర్లెండ్ నూతన్న రాజ్యాంగశాసనాన్ని చేసినప్పుడు ఐర్లెండ్ ప్రతిపత్తిలో గాని, బ్రిటిష్ కామన్వెల్తువ్యవస్థలో గాని మార్పేమీ రాలేదని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. బ్రిటిష్ సార్వభౌముడికి ఐర్లెండ్ దేశాంగవ్యవహారాల్లో ఏమీ సంబంధం లేదనీ, ఐరిష్‌మంత్రులు గాని, ప్రభుత్వోద్యోగులు గాని రాజభక్తిప్రమాణం చేయ నవసరం లేదనీ ఈ నూతనరాజ్యాంగం స్పష్టంచేసింది. ౧౯౩౯ యుద్ధం వచ్చేసరికి ఐర్లెండ్ విదేశాంగవ్యవహారాల్లో కూడా స్వతంత్రంగానే వ్యవహరించ నారంభించింది. బ్రిటిష్ కామన్వెల్తులో ఉంటూనే బ్రిటన్, ఇతర కామన్వెల్తురాజ్యాలూ యుద్ధంలోకి దిగినా, ఐర్లెండు మాత్రం తటస్థంగానే ఉండిపోయింది. ౧౯౨౬ వ సంవత్సరంలో సందిగ్ధంగా ఉన్న విషయం ౧౯౩౯ లో విస్పష్టమైంది.

దాదాపు అదే సమయంలో ౧౯౩౯ సెప్టెంబరు ౪ వ తేదీన దక్షిణఆఫ్రికా యూనియను పార్లమెంట్, యుద్ధంలో బ్రిటన్‌పక్షాన తన దేశం పాల్గొనాలా, అవసరం లేదా అనే విషయాన్ని నిర్ధారణ చేయడానికి సమావేశమైంది. అప్పటి దక్షిణాఫ్రికా ప్రధానమంత్రి జనరల్ హెర్ట్జాగ్ దక్షిణాఫ్రికా తటస్థంగా ఉండాలని ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదనపై జరిగిన చర్చవల్ల ఒక్క విషయం స్పష్టమైంది.

"బ్రిటన్ యుద్ధానికి దిగినంతమాత్రాన దక్షిణాఫ్రికాకూడా యుద్ధానికి దిగ నవసరం లేదు. వెస్టు మినిస్టర్ శాసనం ప్రకారం దక్షిణాఫ్రికా యుద్ధంలో పాల్గొనక తటస్థంగా ఉండవచ్చు. అయితే అవిధంగా తటస్థంగా ఉండడం దక్షిణాఫ్రికాకే హానికరం" అని యూనియన్ పార్లమెంట్ తీర్మానం చేసింది.

౧౯౩౯ యుద్ధంరోజుల భారతజాతీయకాంగ్రెస్ అనుసరించిన విధానంకూడా ఇందుకు భిన్నంగా లేదు. బ్రిటిష్ సామ్రాజ్యంలోని అధినివేశరాజ్యాలు యుద్ధంలో చేరడమూ, చేరకపోవడమూ అనే ప్రధాన సమస్యను వాటికవి సంపూర్ణస్వాతంత్ర్యంతో పరిష్కారం చేసుకుంటే, బ్రిటిష్‌సామ్రాజ్యదేశంగా ఉంటున్న భారతదేశంపక్షాన బ్రిటిష్‌ప్రభుత్వమే నిశ్చయించింది. ఆ నిర్ణయం చేసే అధికారం భారతప్రజలకు ఉండాలనే కాంగ్రెస్ ఆనాడు కోరింది. యుద్ధంచేయడమూ, చేయకపోవడమూ అనే అత్యంత ప్రధానప్రశ్నకు సమాధానం చెప్పే హక్కు, అధికారం భారతప్రజలకు ఉంటే, వారికి యథార్థమైన సంపూర్ణస్వాతంత్ర్యం ఉన్నట్లే స్పష్ట మౌతుంది. ఆ స్వాతంత్ర్యాన్ని అధినివేశప్రతిపత్తి అని అన్నా, సంపూర్ణస్వపరిపాలనాధికారం అని అన్నా బాధ లేదు. ఐర్లెండ్ రిపబ్లిక్‌గానే ఉంటూ బ్రిటిష్‌కామన్వెల్తులో పది సంవత్సరాలు ఉన్నది. ౧౯౪౯ లోనే విదేశాంగసంబంధాల శాసనాన్ని రద్దు చేసి బ్రిటిష్ సార్వభౌమునితో గల సంబంధాన్ని పూర్తిగా వదులుకున్నది. భారతదేశం లండన్ఒడంబడికను అంగీకరించడంవల్ల ౧౯౪౯ కి పూర్వం ఐర్లెండ్‌కు బ్రిటిష్ కామన్వెల్తులో ఏవిధమైన స్థానం, హోదా ఉన్నవో భారతదేశానికీ అమాదిరి హోదా, స్థానమూ ఏర్పడింది. ౧౯౩౭ నుంచి ౧౯౪౯ వరకూ ఐర్లెండ్‌చరిత్రను పరిశీలించితే ఈ లండన్ఒడంబడికవల్ల భారతదేశ స్వాతంత్ర్యం ఏమీ పరిమితం కాలే దనీ, కా దనీ స్పష్ట మౌతుంది. ఇందులో ఒకరి బలవంతంకూడా ఏమీ లేదు. బర్మావిషయంలో అప్పటి (౧౯౪౭) ఇండియా, బర్మాకార్యదర్శి లార్డు లిస్టోవెల్ లార్డ్స్ సభలో చేసిన ప్రకటనవల్ల ఇంకా ఎవరికైనా, ఏమైనా అనుమానాలు ఉంటే పూర్తిగా నివృత్తికాగలవు.

*"We do not regard membership of the Common-wealth as something to be thrust by force upon a reluctant people, but as a priceless privilege granted only to those who deeply desire it and are conscious of its obligations as well as of its advantages. The essence of the Common-wealth relationship is that it is a free association of nations with a common purpose, who belong together because they have decided of their own volition to give and to take their fair share in a world-wide partnership."*

లార్డు లిస్టోవెల్ ౧౯౪౭ నవంబరు ౨౫ వ తేదీన చేసిన ఈ విస్పష్టప్రకటననే కామన్వెల్తు ప్రధానమంత్రుల సభ పునరుద్ఘాటించింది. ౧౯౪౯ ఏప్రిల్ ౨౭ వ తేదీన కామన్వెల్తుప్రధానమంత్రుల సమావేశం ఫలప్రదంగా ముగిసినతరువాత వెలువడిన అధికారప్రకటన కామన్వెల్తుసభ్యత్వం ప్రాతిపదిక హక్కులు, బాధ్యతలను ప్రత్యేకంగా పేర్కొన్నది. ఈ సమావేశం ముఖ్యంగా భారతదేశం సర్వాధికార సమన్వితస్వతంత్రరిపబ్లిక్ అయినతరువాతకూడా కామన్వెల్తులో ఉండేందుకు వీలున్నదా, లేదా అనే విషయాన్ని విచారించడానికే జరిగింది. రిపబ్లికు రాజ్యాంగాన్ని ఆమోదించిన ఐర్లెండ్ కామన్వెల్తులో ౧౨ సంవత్సరాలు ఉండడానికి వీలైతే భారతదేశం మాత్రం కామన్వెల్తుసభ్యత్వాన్ని ఎందుకు పొంద లేదు ? అయితే ఐర్లెండుకూ, భారతదేశానికీ ఒక్క విషయంలో తేడా ఉంది. రిపబ్లికను భారతదేశం విదేశాంగవ్యవహారాల్లో గాని బ్రిటిష్‌సార్వభౌముని గుర్తించదు. బ్రిటిష్‌రాజు భారతదేశం వస్తే ఇతర రాజ్యాల అధిపతులను ఏవిధంగా గౌరవించి, సత్కరిస్తుందో, అదేవిధంగా గౌరవించి సత్కరిస్తుంది భారతదేశం అనీ, భారతదేశఅధిపతి రిపబ్లిక్ అధ్యక్షుడే గాని బ్రిటిష్‌రాజు గా దనీ పండిట్ నెహ్రూ విస్పష్టంచేశాడు. ఇతర కామన్వెల్తురాజ్యాలకుమాత్రం బ్రిటిష్‌రాజే అధిపతి. ప్రతికామన్వెల్తురాజ్యంలోనూ

బ్రిటిష్ రాజు ప్రతినిధి—గవర్నరుజనరలు—ఒకడు ఉంటాడు. భారతదేశంలోమాత్రం బ్రిటిష్‌రాజుతరఫున వ్యవహారం జరిపే గవర్నరుజనరల్ ఎవ్వరూ ఉండరు. ఇదే భారతదేశానికీ, ఇతరకామన్వెల్తుదేశాలకూ ఉన్న వ్యత్యాసం. అయితే ఇతరరాజ్యాలతోపాటు భారతదేశంకూడా బ్రిటిష్‌రాజును "కామన్వెల్తు అధిపతి" గా అంగీకరించింది. ఇంతకుపూర్వం బ్రిటన్‌రాజు బ్రిటన్‌కూ, బ్రిటిష్‌అధినివేశాలకూ, ఉత్తరఐర్లెండ్‌కూ రాజుగానూ, భారతదేశానికి చక్రవర్తిగానూ ఉండేవాడు. ఈ మార్పువల్ల బ్రిటన్ రాజు ఒక్క బ్రిటన్‌కే రాజుగా, కామన్వెల్తుకూటమి ఐక్యతకు చిహ్నంగా, కామన్వెల్తుకు అధిపతిగా ఉంటాడు.

"కామన్వెల్తుఐక్యతకు చిహ్నం" అనే మాటలకు అర్థం ఏమిటి అని ఏప్రిల్ ౨౮ వ తేదీన పత్రికా విలేఖరులు అడిగిన ప్రశ్నలకు "శబ్దకోశం" చూడమని ఉపప్రధానమంత్రి సర్దార్ పటేల్ సమాధానం చెప్పారు. కామన్వెల్తుస్వరూపంలో కలిగిన ఈ మార్పుల ప్రాధాన్యము క్రమేణాగాని విదితం గాదు. భారతదేశం రిపబ్లికనురాజ్యంగాన్ని అనుసరించడానికి దేశంలోని రాచరికాలు, సంస్థానాలు ప్రతిబంధకం కానప్పుడు బ్రిటిష్‌కామన్వెల్తుకు ఒక రాజు అధిపతిగా ఉండడంకూడా ప్రతిబంధకం కానవసరం లేదు. ఏమైనా లండన్ఒడంబడిక భారతజాతీయాభిమానానికి గాని, స్వతంత్రభారతదేశప్రతిష్ఠా, గౌరవాలకు గాని భంగం కల్గించదని లండన్ ప్రకటనే స్పష్టం చేస్తున్నది.

కామన్వెల్తులో చేరడంవల్ల భారతదేశస్వాతంత్ర్యం ఏవిధంగానూ పరిమితం గాదని ౧౯౩౯ యుద్ధం విషయంలో దక్షిణాఫ్రికా, ఐర్లెండ్ అనుసరించిన విధానాలు ధ్రువపరచినవి. దక్షిణఆఫ్రికా-భారతదేశ తగాయిదాల్లోనూ, ఇండియా - పాకిస్థాన్ వ్యవహారాల్లోనూ మరొక కామన్వెల్తురాజ్యం గాని, బ్రిటన్‌గాని ప్రమేయం కల్గించుకొనకపోవడంవల్ల కామన్వెల్తు రాజ్యాల తగాదాల్లో మధ్యవర్తిత్వం నెరపడానికిగాని, రాజీచేయడానికిగాని ప్రయత్నించే ఒక శాశ్వతమైన ఏర్పాటుకూడా ఏమీ లేదని స్పష్టమైంది. కామన్వెల్తులో సభ్యత్వంగల రాజ్యాలన్నింటికి సమానమైన హోదా, ఒకేవిధమైన హక్కులు ఉంటవని ౧౯౨౬ వ సంవత్సరంలో వెలువడ్డ బాల్ఫర్ ప్రకటన అసందిగ్ధంగా స్పష్టంచేసింది. ౧౯౩౮ వ సంవత్సరంలో కెనడా ప్రధానమంత్రి మెకన్జీకింగ్ బ్రిటిష్‌సామ్రాజ్యభాగాలుగాఉన్న అధినివేశాల సంపూర్ణస్వాతంత్ర్యంగురించి చేసిన ప్రకటనకూడా ఈ అభిప్రాయానికి బలం ఇస్తున్నది. "బ్రిటిష్ సామ్రాజ్యదేశాల్లో కొన్ని యుద్ధంలోకి దిగితే, కేవలం బ్రిటిష్‌సామ్రాజ్యభాగాలైనంతమాత్రాన ఇతరరాజ్యాలు ఆ దేశాలపక్షాన యుద్ధం చేయాలనే నిర్బంధం ఏమీ లేదు" అని మెకన్జీకింగ్ ఆ సందర్భంలో ప్రకటించాడు.

వీటన్నింటివల్లా ఒక్క విషయం స్పష్టమౌతున్నది. రాజకీయ వ్యవహారాలకు సంబంధించినంతవరకు కామన్వెల్తు సభ్యత్వంవల్ల దేశస్వాతంత్ర్యానికి ఎలాంటి భంగం కలగదు. కాని ఒక కామన్వెల్తురాజ్యం ఒక రాజకీయఆర్థికసమస్యవిషయంలో ఒక విధానాన్ని అనుసరింపదలచినప్పుడు, ఆ విధానాన్ని ముందుగా ఇతర కామన్వెల్తుప్రభుత్వాలకు తెలియచేయవలసి ఉంటుంది. వారి అభిప్రాయాల ప్రకారం వ్యవహరించకపోయినా, వారి అభిప్రాయాలను తెలుసుకొన్నమీదటగాని ఆ విధానాన్ని అమలుజరపడానికి అవకాశం లేదు. భారతదేశానికి అధినివేశప్రతిపత్తిని ప్రసాదించడానికి ముందు బ్రిటిష్‌ప్రభుత్వం తన నిర్ణయాన్ని ఇతర అధినివేశాలన్నింటికి తెలియచేసింది. ఆ అధినివేశాల్లో ఏ అధినివేశం ప్రతికూలించినా, బ్రిటన్ తన నిర్ణయాన్ని మార్చుకునేది కాదు. అయినా కామన్వెల్తుసభ్యత్వంవల్ల ఏర్పడిన ప్రధాన బాధ్యతలలో ఈవిధంగా ఇతర కామన్వెల్తురాజ్యాలకు ముందుగా తన నిర్ణయాన్ని తెలియపరచడమనేది ఒకటి. బ్రిటన్ ౧౯౩౬ వ సంవత్సరపు బ్రిటన్-ఈజిప్టు ఒడంబడికను సవరించి, ఈజిప్టునుండి తన సేనలను ఉపసంహరించడానికి నిర్ణయించుకొన్నప్పుడు ఆ నిర్ణయాన్ని ముందుగానే ఇతరఅధినివేశాలకు

రాజ్యాల అభివృద్ధికి ఏమీ సహాయం చేయలే దని నాలుగుమాసాలక్రితం ఏర్పడిన తూర్పుయూరపు ఆర్థిక సమాఖ్య నిర్మాణం, అందుకు సంబంధించిన నిబంధనలను పరిశీలించితే స్పష్ట మౌతుంది. పైగా రష్యాను ఆశ్రయించితే ఏ దేశమూ తన రాజకీయస్వాతంత్ర్యాన్ని నిలుపుకోలేదు. రష్యాలో చేరడమంటే కమ్యూనిస్టువిధానాన్ని అంగీకరించినట్లు, కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించినట్లే. చకొస్లొవేకియా చరిత్ర ఈ విషయాన్ని స్పష్టంచేసింది. కామన్వెల్తులో భారతదేశం చేరికను విమర్శించినవా రెవ్వరూ కమ్యూనిస్టువిధానానికి, కమ్యూనిస్టువ్యవస్థకూ సుముఖంగాలేరు. భారతదేశం కామన్వెల్తులో ఉండకపోతే బ్రిటనునుండిగాని, అమెరికానుండిగాని అవగింజంత సహాయాన్నయినా పొందలేదు. పేమాపాంతంలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సంఘసమావేశములో లండన్ ఒడంబడికను సమర్థించుచూ ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఈ విషయాన్ని చక్కగా వివరించారు: "లండన్ నిర్ణయం ఇతరులకు విషప్రాయం కావొచ్చు; భారతదేశానికీ, కాంగ్రెస్‌కూమాత్రం అలా గాదు. భారత స్వాతంత్ర్యాన్ని సుస్థిరంచేయడానికీ, ప్రపంచశాంతికి కృషిచేయు శక్తులను బలపరచడానికీ ఈ ఒడంబడిక ఉపయోగపడుతుంది. ప్రపంచశాంతికివచ్చే నాలుగైదు సంవత్సరాలూ చాలా ప్రధాన మైనవి. ఆర్థికంగా బలంగా లేకపోతే ప్రపంచరాజకీయాల్లో మనం ఏమీ చేయలేము. మనం ఆర్థికంగా ముందుకు సాగిపోవడానికి, అభివృద్ధి చెందడానికీ లండన్ నిర్ణయం మనకు అవకాశం ఇస్తుంది. ఆ అవకాశం మన జాతీయాభిమానానికి ఆత్మగౌరవానికీ భంగం కలగకుండానే లభిస్తుంది."

కామన్వెల్తులో ఉండిపోవడమువల్ల ప్రత్యేక ఒడంబడికలు చేసుకోనవలసిన అవసరం లేకుండానే భారతదేశానికీ, ఇతరకామన్వెల్తురాజ్యాలకూ వర్తక వాణిజ్యలావాదేవీల్లో ప్రత్యేక సదుపాయాలూ, సౌకర్యాలూ లభిస్తవి. అయితే అట్టి ఏర్పాట్లు ఇతర రాజ్యాలతో ప్రత్యేకఒడంబడికలను చేసుకోనడానికి ప్రతిబంధకాలు కావడం లేదు. యుగస్లావియా, చకొస్లొవేకియా, స్విట్జర్లాండ్ మొదలైన దేశాలతో భారతదేశం వాణిజ్యఒడంబడికలను చేసుకొన్నది. రష్యాతో వ్యాపారలావాదేవీలను సాగిస్తూఉన్నది. భారతదేశం రష్యాతో చేరితే ఇతరదేశాలతో ఈ విధంగా వ్యవహరించలేదు. బ్రిటిష్ కామన్వెల్తుతో గనుకనే రిపబ్లికను రాజ్యాంగాన్ని అంగీకరించి పూర్వపు సంబంధాలను యథాప్రకారంగా ఉంచుకో కల్గింది. లండన్ ఒడంబడికను సమర్థించడానికి ఇదొక్కటే చాలు.





Courtesy : Archeological Survey of India.

శ్రవ్యనాటిక :

# నాగశిల్పి

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

మహాబోధివిజ్ఞానమును పొందిన తరువాత బుద్ధుడు బోధివృక్షపు ఇరుగుపొరుగుల నున్న అనేక స్థలములలో ధ్యానసమాధిని కొన్ని వారములు గడపె నని వినయపిటకమున గలదు. రెండవవారము చివర ముచిలింద వృక్షమునొద్దకు వెళ్లి యా చెట్టు మొదట ఆ పరమయోగి 'బాసెనపెట్టు' వేసికొని నిశ్శ్రేయసానందమును అనుభవించుచు ఏడుదినములు గడపెనట.

అప్పుడు అకాలములో పెద్ద మబ్బుపట్టి ఆ యేడుదినములును చలిగాలితో కూడిన వానముసురు పట్టినదట. ముచిలిందవృక్ష అధినివాసి కాబోలు ముచిలిందు డను నాగరాజు తన నివాసమునుండి వెలుపలికివచ్చి బుద్ధుని శరీరముచుట్టును ఏడుసారులు తనతోకను చుట్టలుచుట్టి తన పెద్ద పడగలను ఆ మహాత్ముని తలమీద గొడుగు విధమున బట్టి యిట్లనుకొనె నట : "ఏ చలియు బుద్ధునికి తాకకుండును గాక! ఏ యుష్ణమును బుద్ధునికి సోకకుండును గాక! ఏ క్రిమికీటకములును, ఏ గాలియు బుద్ధుని సమీపింపకుండును గాక!" ధ్యానసమాధినున్న బుద్ధునికి ముచిలిందుడు తన శరీరమును జుట్టవేసె నను తెలివియే లేకపోయెను.

ఏడుదినములకాల మిట్లు గాలియు, వానయు చెలరేగెను. తదనంతరము ఆకాశము నిర్మలమై తెరపిగా నుండుట చూచి నాగరాజు ముచిలిందుడు బుద్ధుని శరీరమునకు కవచమువలె సంఘటించిన తన చుట్టలను దీసివేసి, బ్రాహ్మణయువకుని రూపమును ధరించి అంజలిపట్టి నమస్కరించుచు బుద్ధుని ముందు నిలబడెను.

బుద్ధుని గాలివాననుంచి కాపాడిన ఈ ముచిలిందగాథ కొద్ది పంక్తులలో సంక్షేపముగా నిదానకథ అను బౌద్ధగ్రంథమునగూడ నున్నది. అయితే ఇది మారధర్షణము—మారుని తనయలు బుద్ధుని మహాబోధివిజ్ఞానము పొందుటకు విఘ్నము కలిగించిన గాథకు—పిదప వచ్చును. ఈ నిదానకథ ననుసరించి మారప్రలోభనము అయిదవ వారములోను, ముచిలిందుడు బుద్ధుని కాపాడుట మహాబోధియనంతరము ఆఱవవారములోను జరగినది. నాగరాజు తన తోకను బుద్ధుని శరీరముచుట్టు కవచమువలె నమరించి కాపాడుచుండిన కాలమున బుద్ధుడు గంధకుటిలోనుండి విముక్తిసుఖము ననుభవించుచుండిన ట్లుండె నని నిదానకథ తెలుపుచున్నది.

లలితవిస్తరము బుద్ధుని జీవితమును దెలుపు గ్రంథము. దీనిలోగూడ ఈ ముచిలిందగాథ కలదు. విశేషమేమన, ఇందు బుద్ధుని ముచిలిందు డొక్కడే కాక నాలుగుదిశలనుంచి వచ్చి యితర నాగరాజులుకూడ కాపాడిరని చెప్పబడినది. ఇందరు నాగరాజులును బుద్ధుని శరీరముచుట్టును తమ తోకలను కవచములవలెను, శిరముమీద తమ పడగలను ఛత్రములంగను అమరించి ఆ పరమపురుషుని కాపాడుచుండినతరి వారు మేరువగము ననుకరించుచుండిరట. ఈ లలితవిస్తరము ప్రకారము మారప్రలోభనము నాలుగవ వారములోను, నాగరాజగాథ అయిదవ వారములోను జరగినది.

మహావస్తు అను బౌద్ధగ్రంథమునగూడ ఈ ముచిలిందగాథ సంక్షేపముగ గలదు. ఈ గ్రంథము ననుసరించి ముచిలిందుడు వృక్షాధిదైవముగ దోచును.

ముచిలిందగాథ ఈ విధముగా ఒకరీతిని ప్రసిద్ధమయినదే—అది యే వారమున జరిగిన దేమి. కాని ఈ గాథను శిల్పమున అరుదుగా చూడగలము. బుద్ధజీవితమునకు సంబంధించిన కథాభాగములు అనేకములు శిల్పమున కానవచ్చుచున్నను ఈ ముచిలిందగాథ మాత్రము ఎక్కువగా శిల్పిజనాదరమును పొందలేదు అదెందువల్లనో. శిల్పమున ఈ భావమును చిత్రించుట కష్ట మనియేమో శిల్పు లీ గాథను స్వీకరించలేదు. హిందూదేశ మంతటిలోని బౌద్ధశిల్పమును పరిశీలించినచో ఈ గాథ మూడునాలుగుచోట్ల మాత్రమే చిత్రితమయిన దని తెలియగలదు. వీటిలో కడు పురాతన మయినది సాంచీలో నున్నది.

సాంచీస్తూపము దక్షిణసింహద్వారము తోరణపు రాతికమ్ములమీద ఈ గాథ చిత్రితమయినది. దీనిని [illegible] మిప్పు డక్కడి స్థానికచిత్ర వస్తుప్రదర్శనశాలలో కనుగొనగలము. ఈ తోరణపు కమ్మిమీద ఎగువ నొక [illegible] పుష్పమాలాలంకృతమైన ముచిలిందవృక్షము చిత్రిత మయినది. ఈ వృక్షమున కుభయపార్శ్వములందును [illegible] హస్తములందు పూలమాలలు ధరించి అంతరిక్షగాము లైన కిన్నరు లున్నారు. ఆ వృక్షమునందు శూన్యముగ నున్న ఆసనమువలన బుద్ధుని యునికి సూచిత మయినది. ఆయాసనమునకు ముందు శిలలమీద అయిదుపడగలు ధరించి మానవాకృతిని నాగరాజు ఉపవిష్టు డయియున్నాడు. అతని రాణులు నాగిను లిరువురు అతనికి చెరియొక ప్రక్కను సుఖాసనాసీను లయినారు. వారి పరిచారికలు వారివెనుక నిలబడి వారికి వింజామరలు వీచుచున్నారు. బౌద్ధకళాభిజ్ఞుల యూహ ననుసరించి ముచిలిందగాథను తెలుపుచిత్ర మిది.

సాంచీస్తూపము దక్షిణద్వారము ఆంధ్ర-సాతవాహనభూపతి శ్రీశాతకర్ణి కాలమున క్రీస్తుకు పూర్వమే నిర్మించినది. ఈ దక్షిణద్వారతోరణము అత్యంత మనోహరశిల్ప విరాజిత మయినది. ఈ తోరణము నడికమ్మిమీదనున్న ఈ క్రింది శాసనమువలన ఆంధ్రరాజుల కాలములో ఇది నిర్మిత మయినట్టు తెలియుచున్నది:

"రాఞో సిరి సాతకణిస ఆవెసణిస వాసిఠీపుతస ఆనందస దానం."

ఈశాసనమును ప్రకటించినవారు 'ఆవెసణిస' అనుపదమునకు శిల్పుల కధ్యక్షుడు—*the foreman of the artisans*—అని యర్థము చెప్పినారు. 'ఆవెశనం' అనగా 'ఆవేశనము'—*work-shop*, శిల్పశాల. ఇందువలన పై శాసనము అర్థ మిది: శ్రీ శాతకర్ణిరాజు శిల్పుల కధ్యక్షుడు వాసిష్ఠీపుత్రుడయిన ఆనందుని దానము. ఈ శాసనము ననుసరించి ఈ ముచిలిందగాథను రాతిమీద గండరించిన మొట్టమొదటి హిందూదేశీయులు ఆంధ్రు లని వేరే చెప్పనక్కరలేదు.

ఈ గాథను రాతిమీద గానవగు మరియొక ప్రదేశము అమరావతి. ఇక్కడ ఈ గాథను చూపిన తీరు వేరు. ఇక్కడి చిత్రములో ప్రభాపరివేషముతోడి బుద్ధుని మూర్తియే యున్నది. బుద్ధుడు నాగరాజు తోక చుట్టలమీద పద్మాసనము వేసికొని కూర్చున్నాడు. నాగరాజు తన అయిదుతలల పడగను బుద్ధునిపైని ఉంచి శిరసు అతనిని కాపాడుచున్నట్లు చూపబడినది. అమరావతిలో ఈ కథావస్తువును చిత్రించిన పద్ధతి గ్రంథస్థ మయిన గాథకు నిజముగా పరిపోక భిన్నముగా నున్నప్పటికిని దానియంత మనోహరముగాను, అంత నిపుణము గాను చెక్కిన శిల్పమును హిందూదేశపు అటు తరువాతి శిల్పములో అరుదుగా చూడగలము.

ఇక సారనాథులో మరొకచోట శిల్పి ఈ గాథను రాతిమీద చెక్కినారు కాని యది సామాన్య మయినది; ఇందు కళానిపుణత లేదు.

ముచిలిందగాథ హిందూదేశమునకు తూర్పున బౌద్ధమతము వ్యాపించిన ద్వీపములలోను దేశములలోను ప్రజారంజకముగా నున్నట్టు కాన్పించును. అక్కడి శిల్పచిత్రములలో ఈగాథ తరచుగా గానవచ్చును. కాంబోడియా, బోరోబుదూరు ప్రాంతాల కీ గాథ అమరావతినుంచియే వెళ్లినట్లు గొప్ప బౌద్ధకళావిమర్శ కుడు యమ్. ఫూషే అభిప్రాయపడుచున్నాడు.

ఇన్నిచోట్ల చిత్రములను మించినది, విశిష్టమయినది, కళావైదగ్ధ్యము గలది నాగార్జునుని కొండలో ఇక్ష్వాకువంశపు మహారాజు వీరపురుషదత్తుని మేనయత్త శాంతిశ్రీ కట్టించిన మహాచైత్యములోని శిలాఫలకముల మీద చెక్కిన శిల్పకృతి. ఇది ఒక అనల్ప శిల్పమహాకావ్యమే.

'నాగశిల్పి' అను ఈ నాటిక నాగార్జునుని కొండలోని శిల్పమును భావనలో ఉంచుకొని రచియించిన ఊహాచిత్రము. ఆ శిల్పచిత్రమును చక్కగా పరిశీలింపగా తోచిన మనోభావముల కీ నాటిక రూపకల్పనము. శిల్పచిత్రములోని విన్నాణమును చదువరులు గ్రహించుటకు వీలుగ ఆ శిల్పచిత్రముపటముకూడ ఇందు చూపరుపబడినది.

### ౧-వ రంగము

ధనకటకంలో కోమ్మోజు ఇల్లు.

(తిప్పోజు, అతని కొడుకు కొమ్మోజు, మనుమడు ఉల్లప్ప)

కొమ్మోజు—(వెటకారంతోను, కోపంతోను) ఇదిగో! ఎక్కడినుంచో వూడిపడ్డారు! వేళకు తిండికి రావడానికికూడా తీరిక లేకుండా వుంది. ఎక్కడికి దయచేశారు?

ఉల్లప్ప—(మాటాడడు)

కొమ్మోజు— (కోపంతో) నిన్నే నయ్యా ఉల్లప్పా! ఎక్కడికి వెళ్లా వింతసేపు? ఇంటిమాటే జ్ఞాపకం లేదు! ఏం చేస్తున్నావు? నిన్నే. ఎక్కడికి వెళ్లావంటే మాటాడవేమిరా?

తిప్పోజు—వాడి మీదమీదికి వెడుతున్నావు, కొడతావేమిట్రా వాణ్ణి?—(మనుమడితో) వెళ్లు, నాయనా! పో. అన్నం తిను.

కొమ్మె—వెనక వేసుకురావయ్యా వాణ్ణి. అందుకనే వాడు మరీ ఆ విధంగా తయారవుతున్నాడు.

తిప్పే—ఇంక కొన్నాళ్లు పోతే వాడికే వస్తుంది జ్ఞానం. మా నాయనా గొప్పవా డవుతాడు.

కొమ్మె—అవుతా డవుతాడు! (విసుగుదలతో) ఇప్పటి కొక బొమ్మ గీయలేడు, వులితో పట్టుమని ,పదిగడియలసేపు కొట్టలేడు. వచ్చా యప్పుడే పద్యాలు గొల్లు వచ్చా యబ్బాయిగారికి!— ఎక్కడికి వెళ్లావురా?

తిప్పే—(ఉల్లప్పను దగ్గరకు తీసుకుని తల నిమురుతూ) అన్నీ వస్తాయి. అన్నీ తెలుస్తాయి.— (ఉల్లప్పతో) వేళకు తిండికి రాద్దూ? నాయనా! ఉల్లప్పా! చూడు, అప్పుడే ఎంత పొద్దోయిందో! జాముర్రాత్రి పైనయింది.

ఉల్లప్ప— (కొంచెం తేరుకొని) లేదు తాతయ్యా! ఎక్కడికీ వెళ్లలేదు. మన మహాసేనాధిపతిగారు కావాలన్నారటవచ్చే వైశాఖపున్నమనాటి మహాచైత్యానికి సమర్పించేటందుకు, పినతాత రాతిమీద చెక్కడానికి నమూనా బొమ్మ గీస్తూంటే చూస్తూ కూర్చున్నా నక్కడ.

కొమ్మె—(చిరాకుతో) ఆ మాట ఇందాకానే ఏడిస్తే యేం? పోనీ ఆయనదగ్గిర పని నేర్చుకొన్నా బాగానే వుండును.

తిప్పే—అట్లాగే నేర్చుకొంటాడు లేరా. ఎక్కడో అక్కడ నేర్చుకొంటాడు.

కొమ్మె— (ఉల్లప్పతో) చూడు, వాళ్ల కన్నోజాగారి చేతన్నని చూడు. వా డప్పుడే ఎంతవా డయినాడో. వయసులో వాడికీ నీకూ ఏడాదో ఏడన్నర్ధమో లేదా.

తిప్పే—(ఉల్లప్పశిరము ముద్దాడుతూ) అంతకంటేనూ గొప్పవా డవుతాడు మా నాయన.— (ఉల్లప్పతో) ఓ ఉల్లప్పా! బాబు! మీ అమ్మ నీకోసం కనిపెట్టుకుంది కాబోలు. వెళ్లు, ఊఁ.

ఉల్లప్ప—పినతాత 'చీకటిపడింది, లేరా. తిండికి ఏం వెడతా విప్పు డింటికి. భోంచేసి రాత్రి కిక్కడ పడుకో. లే పొద్దున్న వెడుదువుగానిలే' అన్నాడు. 'నేను వెళ్లాలి. మా నాన్న కోప్పడతా' డన్నాను. ఇంతలో అక్కబొమ్మ వచ్చి 'మధ్యాహ్నం ఎప్పుడనగా తిన్నావో, రెండు మెతుకులు నోట్లో వేసుకుపో. బుర్రావంటే నీ కిష్టంగా! ఆ బుర్రావు పెరుగు పోస్తాను. గడ్డలాంటి పెరుగు. జొన్నసంకటీ, ఇంత గడ్డపెరుగూ పోసుకొని తిందువుగాని లే' అంది. పినతాత 'లేరా' అన్నాడు.

కొమ్మె—తిండి తినే వచ్చావా ఏమిటి? అయిందీ అరగింపు! సరే అయితే.

ఉల్లప్ప—ఆఁ. తినే వచ్చాను. తిన్నాక నే నుండను వెళ్లాలంటే పినతాత దిగబెట్టడానికి కూడా వచ్చాడు.

తిప్పే—పోతన్న వచ్చాడా ఏమిటి? కనబడకుండానే వెళ్లాడేం?

ఉల్లప్ప—ఇక్కడికి రాలేదు. మన వీధి మలుపు దాకా వచ్చాడు. 'ఇంక నేను వెళ్లగలనులే. నువ్వు వెళ్లు తాతా' అన్నాను. అక్కణ్నుంచి ఆయన వెళ్లిపోయాడు. నే నింటి కొచ్చాను.

కొమ్మె—(ఉల్లప్పతో) మరి అ మాట చెప్పవేం—అన్నం తిన్నానని! మీఅమ్మ నీకోసం కనిపెట్టుకు కూర్చుంది. తినమని చెప్పు—ఊఁ, ఎందుకులే అట్లా వీధిలోకి వెళ్లాలి. నేనే చెప్పి వడతానులే. (వెళ్లును.)

తిప్పే—రా! నాయనా! ఇక్కడ పడుకొందాం. చూడు. ఆ వొత్తి కొంచెం తగ్గించి మరీరా. ప్రమిదలో ఆముదం ఉందా? వొత్తి మరీ గంటలా వెలుగుతోంది.

ఉల్లప్ప—వుంది. (వత్తి తగ్గించును).

తిప్పే—ఊఁ. చాల్లే. ఇంక తగ్గించకు. రా నాయనా!—మరి నువ్వు పని నేర్చుకోకపోతే ఎట్లాగ చెప్పు. నువ్వు ఎంచక్కటి బొమ్మలు చెక్కాలి, ఎంచక్కటి బొమ్మలు వ్రాయాలి. గొప్పవాడవు కావాలి. చేతన్న ఎంచక్కా వ్రాస్తున్నాడు. ఎట్లా చెక్కుతున్నాడో చూడు. మన చేతులో ఎంతటి పనితనం

వుంటే అంత గౌరవం. మన్ని రాజులు, రాణులు, మంత్రులు అందరూ గౌరవిస్తారు. ఫలానావా శిల్పి యని పేరు తెచ్చుకోవాలి.

ఉల్లప్ప—అవును తాతయ్యా! నే నెరగనా? చూడు, నే నెట్లాంటి బొమ్మలు చెక్కుతానో?

తిప్పో—ఏమో, ఏం చేస్తావో, ఇంతవర కేమీ చెయ్యలేదు. నాయనా! పనికూటానికి పోయి కొత్త నాన్న దగ్గిర నేర్చుకో నాయనా పని.

ఉల్లప్ప—పనికూటంలో, ఏముంది తాతయ్యా! మన తలలో వుంది కాని. పని నేర్చుకోడ మెంత? అవును కాని ఇదిగో తాతయ్యా! పినతాత ఓ కథ చెప్పాడు.

తిప్పో—ఏమి టాకథ?

ఉల్లప్ప—పూర్వం ముచిళిందుడని ఓ నాగరాజు ఉండేవాడట...

తిప్పో—ఇదా? ముచిళిందుడి కథా? నాకు తెలుసులే—ఊఁ, ఆ కథ?

ఉల్లప్ప—నీకు తెలుసా తాతయ్యా? తెలిస్తే చెప్పు చూతాం.

తిప్పో—పూర్వం బుద్ధస్వామి ఒక చెట్టుకింద కూర్చుని తపస్సు చేస్తున్నాడట. తపస్సుకి కూర్చున్నప్పటినుంచీ...

ఉల్లప్ప—ఆఁ! ఇదే యిదే! ఊఁ, తర్వాత?

తిప్పో—తపస్సుకి కూర్చున్నప్పటినుంచీ దట్టంగా ముచ్చేసి ఆకాలంలో వారంరోజులు వానా గాలీ నట. అప్పుడు స్వామితపస్సుకు భంగం కలగకుండా ఉండా లని ముచిళిందు డనే నాగరాజు తన అయిదు పడగలూ విప్పి వాన కురవకుండా గాలి తగలకుండా ఆ స్వామిని ఏడు రోజులు కాపాడాడట.— తెలుసుకాదూ నీకు. నాగులు బుద్ధస్వామికి పరమ భక్తులు. ఈ కథేనా?

ఉల్లప్ప—అవు నిదే. కాని తాతయ్యా! పడగలు స్వామిమీద పెడితే తల తడవదుకాని వొళ్లు తడవదూ? గాలి వేయదూ?

తిప్పో—అదే చిత్రం! నాగరాజు తన పడగలు ఆస్వామితలపైని పెట్టి గబ్బబ్బబ్బా ఆ స్వామిచుట్టూ రాత్రీ పగలూ ఆ ఏడురోజులూ తిరుగుతూనే వున్నాడట. ఆ తిరుగుడువేగానికి నాగరాజుతోక స్వామివొంటిచుట్టూ కవచంలా అమరి, ఆస్వామిమీద వొక్క చినుకుకూడా పడలేదట; రవంత గాలయినా తగలలేదట. చిత్ర మేమున్నది ఈ కథలో?

ఉల్లప్ప—అది కాదు; పినతాత అన్నాడు— 'అబ్బీ! దీన్ని రాతిమీద చెక్కగలవటరా?' అని.

తిప్పో—ఏ మన్నావు నువ్వు?

ఉల్లప్ప—మాతాతయ్య చెక్కగల డన్నాను.

తిప్పో—(నవ్వుతూ) ఏమన్నా డేమిటి పిన తాత?

ఉల్లప్ప—(నవ్వుతూ) 'ఓరి పుల్లాయా! నువ్వు చెయ్యగలవా అని అడిగితే మాతాత చెక్కగల డంటా వేమిట్రా' అన్నాడు. (సాలోచనగా) ఎవరైనా చెక్కగలరా అది, తాతయ్యా?

తిప్పో—(నవ్వుతూ) నువ్వన్నావుగా మీ తాతయ్య చెక్కుతాడని.

ఉల్లప్ప—చెప్పు తాతయ్యా!

తిప్పో—ఆహా!—ఈ కథ ఇదివరకే చెక్కారు.

ఉల్లప్ప—(ఆశ్చర్యంతోను, ఆత్రంతోను) చెక్కారా? ఎక్కడ, ఎక్కడ తాతయ్యా!

తిప్పో—ఏం, నువ్వు చూడలేదూ? మన మహాచైత్యంలోనే.

ఉల్ల—మన పెద్దచైత్యంలోనే—కన్నుబెన్ను వొద్దు నుంది? ఎట్లా చెక్కారు?

తిప్పో—మనం బొమ్మ లెట్లా చెక్కుతామో అట్లాగే.

ఉల్లప్ప—కాదు తాతయ్యా! అ దెట్లా చూపారు?

తిప్పో—ఆ నాగరాజు తన తోకచుట్టలు చుట్టి కాని పడగలు విప్పివుంటే, ఆ తోకచుట్టమీద బుద్ధస్వామి కూర్చున్నట్టు చూపారు.

ఉల్లప్ప—దానిలో గొప్పదనం ఏ ముంది?

తిప్పో—ఏం ?

ఉల్లప్ప—ఆ చుట్టమీద కూర్చుంటే స్వామికి గా లెందుకు తగలదు ? వా నెందుకు కురవదు వొంటి మీద ?

తిప్పో—మరి రాతిమీద అన్ని భావాలూ చూపా లంటే కష్టం కాదూ? ఏ లవుతుందా ?

ఉల్లప్ప—గాలీ వానా తగలకుండా నాగ రాజు స్వామిని రక్షిస్తున్నట్టు తెలవడ మెట్లా ? తెల వకపోతే ఆ కథ చెక్కడ మెందుకు?—నువ్వు చెక్క లేవు తాతయ్యా అట్లా తెలిసేలాగ ?

తిప్పో—నే నయితేమాత్రం అట్లా చూపడం కష్టంకాదూ?—నిద్ర వస్తున్నదా ?

ఉల్లప్ప—లేదు తాతయ్యా !

తిప్పో—ఉలుకూ పలుకూ లేకపోతేను—నిద్ర పోతున్నా వేమో ?

ఉల్లప్ప—ఏం లేదు తాతయ్యా ! ఎట్లాగా అని...

తిప్పో—ఏమి ఎట్లాగ ?

ఉల్లప్ప—తెలిసేటట్టు చెక్కడం ఎట్లాగ అని. (అబ్బాయీ ! అని లోపలినుంచి కేక)

తిప్పో—వెళ్లు. మీ అమ్మ పక్క వేసింది కావును, పిలుస్తోంది. వెళ్లు తరువాత ఆలోచిద్దువు గాని. లే, వెళ్లు.

౨-వ రంగము

ధనకటకంలో బుద్ధజయంతి.

(గొప్ప ఉత్సవం, మహాకోలాహలం. మహా చైత్యప్రాకారంలో ఒకమూల ఉల్లప్ప, చేతన్న.)

చేత—ఇంకా ఇక్కడే వున్నావు? కూడా వస్తావా నని కొన్నాను. ఇంకా చూడడం కాలేదూ ఈ చిత్రం ?

ఉల్లప్ప—ఎంతసేపు చూస్తేమాత్రం, తనివి తీరటం లేదు. చూసినప్పుడల్లా ఆనందం కలుగు తోంది—ఈ నలగిరిదమనం. ఏవేవో క్రొత్తక్రొత్త భావాలు ! దీన్ని ఏ మహానుభావుడు చెక్కాడో కాని—చూడు. స్వామిని చంపడానికి దేవదత్తుడు వీథివెంట వదలిన పట్టపుటేనుగు నలగిరి ఎంత భీకరంగా వస్తోందో ! అది దారిలో అడ్డంవచ్చినవారిని తొక్క స్తోంది. తొండానికి చుట్టబెడుతోంది. తప్పుకోండి, తప్పుకోం డని వీథివెంట వచ్చే పోయేవారు జనాన్ని భయంతోను, ఖంగారుతోను చేతు లెత్తి ఎట్లా వారి స్తున్నారో—ఎదురుగా రావద్దని. ఈ గంద్రగోళం చూడడానికి స్త్రీలు పిల్లపాపలతో మేడ లెక్కి, మిద్దె లెక్కి ఎట్లా చూస్తున్నారో. వారి మొహాలూ కళ్లూ చూడు. ఆ మొహాలలో భయము, ఆదుర్దా, ఖంగారు ఎట్లా చూపాడో శిల్పి ! చూ డిక్కడ, అంతటి భయంకరమైన యేనుగూ ఎదురుగా వస్తున్న స్వామి దగ్గిరికి వెళ్లి ఆయనపాదాలకు మ్రొక్కుతోంది. స్వామిమొహంలో ఆ మహాశాంతం, జనుల మొహా లలో ఆ యక్కజం చూడు. మనస్సులోని భావాలు ఎంత స్ఫుటంగా, నేర్పుగా మొహంలోకి దింపాడు శిల్పి ! ఎంత గొప్ప ఆచార్యుడో ఆయన. చేతులెత్తి జోహారు చెయ్యాలి. భావం చిత్రించడమే ప్రజ్ఞ !

చేత—ఇ దొక్కటేనా యేమిటి? ఈ చిత్రా లన్నీ అంతే. ఒకదాని కొకటి తీసిపోదు.

ఉల్లప్ప—చిత్రా లెన్నయినా ఉన్నాయి. కాని అన్నీ, యిటువంటివి కావు. ప్రతిశిల్పి చెక్కిన వాటిలో శిరోభూషణములైన విగ్రహాలు ఒకటో రెండో ఉంటాయి.

చేత—మిగిలిన వన్నీ గొప్పవి కా దంటావా ?

ఉల్ల—అన్నీ ఒక్కలాటివే అనను. గొప్ప శిల్పి ప్రజ్ఞ అతను చెక్కిన ప్రతిచిత్రంలోను కనబడు తుంది. కాని ప్రతిభమాత్రం ఏ వొకటి రెంటిలో మాత్రమే విశదమవుతుంది. నూటికి కోటికి ఒక గొప్ప శిల్పి వుంటాడు. గీసిందల్లా చిత్రమే అయి, గండ రించిందల్లా బొమ్మే అయితే ఇంక కాని దేది ?

చేత—ఈ బొమ్మ చూడు. ఇదిమాత్రం బాగా లేదూ ? నాగరాజూ నాగినీ స్వామిని ఆరాధిస్తున్నట్టు ఎంత బాగా చెక్కాడో ! ఈ నాగిని మొహం చూడు.

ఉల్లప్ప—ఆఁ! దానిలో ఏం విశేషం వుంది?

చేత—మొహం ఎంత అందంగా వుందో?

ఉల్లప్ప—చెక్కడం అభ్యాసమయితే ఆమాత్రం అందమయిన రూపం ఎవరైనా చెక్కుతారు. రూపం చిత్రించడం కాదు, భావం చిత్రించడమే కష్టం. అన్నట్టు, నాగరాజంటే జ్ఞాపకం వచ్చింది. నాగరాజుతోకచుట్టమీద స్వామి తపస్సు చేస్తున్నట్టు, ఆయనతలమీద నాగరాజు పడగలు విప్పినట్టు చెక్కిన చిత్రం ఉందట. అ దెక్కడ?

చేత—నువ్వు చూడలేదూ? అదిగో అక్కడ. రా, చూపిస్తాను. ఇటు ఇటు—ఇదిగో!

ఉల్లప్ప—ఇదా? చాలాసార్లు చూశా నిది. కథ తెలవక ఇది ఫలాని దని గుర్తుపట్టలేకపోయాను.

చేత—బాగా చెక్కారు కాదూ? స్వామిని పాముచుట్టమీద ఎంత బాగా చెక్కారో. ఇదా అని ఇట్టే పెదవి విరిచే కావు. అందంగా లేదూ చిత్రం? స్వామిమొహం చూడు. ఎంత ప్రశాంతంగా వుందో, జీవం వుట్టిపడుతూ ఎంత అందంగా వుందో.

ఉల్లప్ప—చూడడానికి బొమ్మ అందంగా ఉండడం కాదు ప్రధానం.

చేత—జీవం వుట్టిపడుతూ బొమ్మ అందంగా లేకపోతే ఏమి వుంటే నేమి, ఏం లేకపోతే నేమి?

ఉల్లప్ప—భావంకాని రూపం కాదు ప్రధానం. అందమైన బొమ్మ చెక్కడం గొప్ప కాదు. భావం చిత్రించడమే కష్టం. ఆఖరికి జన్మకంతకూ అటువంటి భావస్ఫోరకమైన ఉత్తమచిత్రం ఒక్కటి చెక్కినా చాలు. మనస్సులో ఏదో ఒక ఉద్దేశం, ఒక భావం పెట్టుకొనేగా బొమ్మ చెక్కుతాం. ఏ భావం తెలియ జేయడానికి ఆ బొమ్మ వ్రాశామో ఆ భావం స్ఫుటంగా కనబడకపోతే ఇం కెందుకు అది చెక్కడం?

చేత—ఏం, ఇప్పు డీ బొమ్మ కేం లోపం వచ్చింది?

ఉల్లప్ప—ఎందుకోసం, ఏభావం తెలపడానికి చెక్కారో చెప్పు, ఈ చిత్రం? ఈ కథేమిటి?

చేత—ఏ భావం తెలపడానికి చెక్కారో, కథేమిటో నాకు తెలవదు.

ఉల్లప్ప—మరి కథ తెలవకుండా వాదిస్తావేం? బొమ్మ అందంగా లే దన్ను. కాని శిల్పి తెలపాలనుకొన్న భావాన్ని తెలపలేకపోయాడు. అటువంటప్పుడు అతని ప్రయత్నం విఫలమయినట్టేగా?

చేత—ఏం తెలపాలి?

ఉల్లప్ప—నాగరాజు స్వామిచుట్టూ తిరుగుతూ స్వామికి గాలీ వానా తగలకుండా ఆయన్ను కాపాడినట్టు చూపాలని శిల్పిఉద్దేశం. ఆ వుద్దేశం బొమ్మలో స్ఫురిస్తోందా? ఇది ముచిళిందు డనే నాగరాజుగాథట, మా తాతయ్య చెప్పాడు.

చేత—అయితే ఆ శిల్పి కేమీ చేతకా దంటావు —(వెటకారంగా) ఓరి బాబో! మొనగాడు పుట్టాడురా. పూర్వులు గొప్పవారికికూడా తప్పులు పడుతున్నాడురా బాబు!

ఉల్లప్ప—ఆ శిల్పి కేమీ చేతకా దని నే ననను. అతను గొప్పవాడు కా దనను. కాని అతడు తాను తెలపదలచిన భావాన్ని సరిగా తెలపలే దంటాను. అదీ తప్పే?

చేత—నువ్వు వారికంటె మొనగాడవనా?

ఉల్లప్ప—ప్రతిభా,ప్రజ్ఞా ఒక్కవారి సొత్తేనా? మనం పనికిమాలిన వాళ్లమే? మనం తెలివితక్కువవాళ్ల మనుకొంటే మన పూర్వులను తెలివితక్కువవాళ్లన్నట్టు కాదూ? జ్ఞాపకం ఉంచుకో. సింహంకడుపున సింహపు పిల్లలే పుడతాయి.

చేత—ఈ వుత్సవంలో నువ్వెన్ని బొమ్మలు గీసి ప్రదర్శించావు?

ఉల్లప్ప—ఏవీ ప్రదర్శించలేదు. ప్రదర్శించకపోతే?

చేత—ఇంతవరకొక్క రేఖాచిత్రం గీయలేదు. ఒక్కబొమ్మ చెక్కలేదు నువ్వు. మన పూర్వులను వెక్కిరిస్తున్నావు!

ఉల్లప్ప—తప్పొప్పులు చెప్పడం వెక్కిరింపా?

చేత—ఉల్లప్పా! పోనీ, ఈ గాథలోని భావం ను నెట్లా ప్రదర్శిస్తావు చెప్పు.

ఉల్లప్ప—నా కింకా తోచలేదు. దాన్ని నేను చిత్రిస్తా నని చెప్పలేదు.

చేత—ఇంతేనా మరి? నువ్వు చిత్రించలేనప్పుడు మన పూర్వుల చిత్రాలలో తప్పులు పట్టగూడదు.

ఉల్లప్ప—మన పూర్వులు చేసిన పొరపాటు లేమిటో తెలుసుకోకపోతే ఇక మనం అభివృద్ధి పొందడం ఎట్లా?

చేత—(వెటకారంగా నవ్వుతూ) తప్పులు పట్టి అభివృద్ధి పొందా లంటావు. భేష్! బాగుందిరా ఉల్లప్పా! మన పూర్వులను తప్పపట్టా లంటావు మనం గొప్పవాళ్ల మవడానికి. భేష్ బాగుందిరా ఉల్లప్పా! (వెటకారపునవ్వు.)

(ఉల్లప్పా! ఉల్లప్పా! అని దూరాన కేకలు.)

చేత—అరుగో మీనాన్నా, అమ్మా నిన్ను వెతుక్కుంటూవస్తున్నట్టున్నారు!

(ప్రవేశము కొమ్మోజు, అతని భార్య ఎర్రక్క)

కొమ్మోజు—ఇదుగో అబ్బాయి! చేతన్నా ఇక్కడే వున్నాడు!

ఎర్రక్క—(ఆత్రంతో) నాయనా! ఇక్కడున్నావా? ఎక్కడా కనబడకపోతే ఎక్కడ తప్పిపోయావో, ఏమయిపోయినావో అని అబ్బ! మాయ ప్రాణం హడిలిపోయింది. ఏంప్రజ! ఏంప్రజ! వేల యీనినట్టు ఎక్కడినుంచి వచ్చారో—ఇక్కడున్నావటరా నాయనా! ఏం చేస్తున్నార్రా ఇక్కడ?

కొమ్మోజు—(చేతన్నతో) చేతన్నా! మా దొడ్డబేరం కొట్టావులే. మీనాన్న చెప్పాడు—నువ్వు గీసిన బొమ్మలకు మంచి బేరం వచ్చిందట. ఏదో చిత్రం, జ్ఞాపకం లేదు, దానిని గండరించి యిస్తే వేలగిరి ప్రభువు అయిదునూర్ల బంగారం ఇస్తా నన్నాడట. బాగుందిలే నీ పని. ప్రయోజకుడ వయినావు. ఎందుకు మావాడూ వున్నాడు. పొట్టి తెలివితక్కువ నాగన్న!

ఎర్రక్క—నాయనా! ఒక్క బొమ్మయినా సంబరంలో పెట్టావు కాదుకద?

చేత—పై కట్లా వున్నాడు కాని, మీవాడసాధ్యుడమ్మా పిన్నీ! నే నిట్లా వెళ్లివస్తాను. (నిష్క్రమించును.)

కొమ్మోజు—అవు నవును అసాధ్యుడే, తెలుస్తూనే వుందిగా వాడి పనితనం. ఆరునెల్లనుంచి, ఆరునెల్లనుంచినుమా, పోరుతున్నాను స్వామిజయంతికి తయారుచెయ్యరా పది బొమ్మలని. ఊఁహూఁ! ఒక్కటి—వో పెట్టుకొన్నట్టు—గీస్తేనా?

ఎర్రక్క—మళ్లీ విప్పారూ కవిలెకట్ట? ఇక మీ కేమీ పనిలేదు. వాణ్ని వేళా పాళా, స్థలమూ తావూ లేకుండా దుయ్యబట్టడంతో సరి మీకు.

కొమ్మోజు—(వెటకారంగా) సంబరమంతా అక్కడుంటే ఈమూ లేం చేస్తున్నా రయ్యగారు! ఆ సంబరంలోకి వచ్చిన బొమ్మలయినా ఏది ఎట్లా గీశారో చూసి అఘోరించరాదూ?

ఎర్రక్క—ఇంక చాల్లెండి. సంబరం నాడయినా సాధింపే, పండుగనాడయినా పడతిట్లే. అ వో రూరుకోరు. మా నాయన ఎప్పుడూ గీస్తూనే వుంటాడు. వాడు మాత్రం ఊరుకొన్నాడా యేమిటి? వాడూ రాస్తాడు. వాడూ చెక్కుతాడు.—పదరా నాయనా!

కొమ్మోజు—అ కొడుక్కి ఈ తల్లికీ సరిపోయింది. ఊఁ. పదండి. (అందరు నిష్క్రమణ)

## 3-వ రంగము

### ధనకటక బౌద్ధవిహారంలో.

### కొన్నేళ్ల అనంతరం.

[బౌద్ధాచార్యుడు తిష్యరక్షితుడు, సేవకుడు, దేవన్న ప్రవేశము]

తిష్య—బోధివృక్షం దగ్గిర పువ్వులు, పళ్లు, సుగంధద్రవ్యాలు అన్నీ సిద్ధంగా వున్నాయి కాదూ? దేవన్నా! ఇంకా ఇక్కడ మామిడాకుల తోరణాలు కట్టలే దేం?

దేవ—ఎంతసేపండి. కట్టేస్తాం.

(అరు గంటలు వినబడతాయి.)

తిష్య—అప్పుడే ఆరు గడియలు కొట్టారు. ఇంకెంత, కొద్దిసేపటిలోనే వచ్చేస్తుం దావిడ.

దేవ—ఎవరు బాబు, రావడం ?

తిష్య—మన మహారాజులుంగారు వీరపురుష దత్తులవారు లేరూ ? వారి మేనత్త శాంతిశ్రీమహాదేవి గారు. ఆవిడ విజయపురినుంచి పనిమీద ఈ వూరు వచ్చింది. మన విహారానికి ఒకసారి దయచేయవలసిం దని ఆహ్వానించాం ఆవిణ్ణి.

(దూరాన కలకలం. మంగళవాద్యాలు. క్రమంగా చేరువకు వస్తున్నట్టు వినబడుతు).

తిష్య—(వినుట అభినయించి) అదిగో కలకలం! వస్తున్నట్టున్నారు మహాదేవిగారు. దగ్గిరికి వచ్చేశారు. దేవన్నా! ఏవీ పళ్లూ పుష్పాలూను. వచ్చేశారు!— ఇట్లా తే.

(మహాదేవికి స్వాగతం చెపుతూ) మహాదేవి గారికి స్వాగతం. ఈ పురాతనమహావిహారంలోని పరివ్రాజకుల పక్షాన దయాధర్మస్వరూప, మహాదాన పత్ని శ్రీశ్రీశ్రీ శాంతిశ్రీ మహాదేవిగారికి గౌరవాదర పురస్సరంగా స్వాగత మిస్తున్నాము. ఇదిగో! ఈ పళ్లూ ఫలాలూ స్వీకరించండి. మీరు కలకాలం వర్ధిల్లా లని మా కోరిక.

శాంతిశ్రీ—ధనకటకమహావిహారంలోని మహాపరివ్రాజకమండలిచేత అనుగ్రహింపబడినాను. ధన్యను. ఇక్కడి పరివ్రాజకు లందరికీ శ్రీ తథాగతులవారి సేవా సత్కారాలూ, ధర్మాధ్యయనమూ నిరంతరాయంగా సాగుతున్నాయా ? ఆచార్యదేవులకూ విద్యార్థిబృందానికీ భద్రమే కద ?

తిష్య—మహారాజులుంగారి అనుగ్రహంవల్లా, మహాదేవివారు—తమ ఆదరాభిమానాలవల్లా అన్ని కార్యాలూ నిరంతరాయంగా సాగుతున్నాయి. శ్రీశ్రీశ్రీ వీరపురుషదత్తమహారాజులుంగారి పరిపాలనలో మా కందరికీ క్షేమమే. తమరు మ మ్మందరినీ వేయికళ్లతో కని పెడుతూంటే మాకు భద్రాని కేం తక్కువ తల్లీ!— మా విహారానికి దయచేసి చాలాకాల మయిం దను కొంటాను.

శాంతి—అయిదారేళ్లయినా అయివుంటుంది. అప్పటికీ ఇప్పటికీ ప్రదేశంలో చాలా మార్పున్నట్టుంది.

తిష్య—మన విహారంలో విద్య నభ్యసించే నిమిత్తం దేశదేశాలనుంచి వస్తున్న విద్యార్థులకూ, వారికి బోధించే ఆచార్యులకూ చోటు చాలక కొత్త వసతి గృహాలూ, విద్యామండపాలూ కట్టించవలసివచ్చింది. వెనుక తమ రిక్కడికి విజయంచేసినప్పుడు ఈ గృహాలు, మండపాలు లేవు. రండి — విహారం సందర్శింతురు గాని. ఇదిగో ఇది ధర్మవణిజుడు శాంతిభద్రుడు కట్టించిన వసతిగృహం. ఇందులో వందమందికి వసతి. కాశ్మీరదేశాగతులయిన థేరులకోసం కట్టించిన విహార మిది. అటు ఇంకా ఉన్నాయి ఇటువంటి భవనాలు. వెనుక తమరు విజయంచేసినప్పటికి కేవీ లే వను కొంటాను.

శాంతి—అవును. ఇక్కడ పుష్పవనం ఉండే దని జ్ఞాపకం.

తిష్య—ఈ బోధివృక్షం చల్లని నీడను ఈ యాసనంమీద మహాదేవివారు ఆసీనలు కావా లని మా కోరిక.

శాంతి—అనుగృహీతను.

తిష్య—ఈ దివసాన మా విహారానికి సాక్షాత్తు మహాప్రజాపతి గౌతమి వచ్చిన ట్టుంది.

శాంతి—ఆ విధంగా భావించడం మీకు నా మీదగల వాత్సల్యాభిమానవిశేషంతక్క మరొకటి కాదు. (దూరాన బౌద్ధధర్మపఠనం)

తిష్య—అదుగో ! వారు ఆచార్యబృందం. తమకు పుష్పఫలాదికములు సమర్పించి ఆతిథ్యగౌరవం నెరపుతున్నారు.

శాంతి—సంతోషం. వినమ్రతతో అందుకొం టున్నాను. ఇంతకంటె కావలసిన దేముంది ? పూజ్యులూ, పుణ్యమూర్తులూ మీ ఆశీర్వాదాలే నాకు కావలసినవి. ఆచార్యవర్యులకు నా ప్రణామాంజలి.

తిష్య—ఇదుగో ! వీరు విద్యార్థిబృందం.— వారు చీనాదేశీయులు; ఈపక్క వీరు భోటదేశం వారు. ఈ మధ్యవారు కాశ్మీర, గాంధారదేశవాసులు. ఈనడుమ భోటదేశీయులు తమ దేశంలోని దూపంగ్ నగరంలో మన యీ విద్యాపీఠం నమూనామీద ఒక

విద్యాపీఠం స్థాపించా లని ప్రయత్నమట. అక్కడి నుండి వచ్చిన నవకర్మకాధ్యక్షులు మన విహారం చూసి సంగతులన్నీ విచారించుకొని మొన్ననే త్రయోదశినాడు వెళ్లారు.

శాంతి—చాలా సంతోషం. అంతటి దూర దేశంలో మన యీ ధనకటకవిద్యాపీఠం నమూనామీద విద్యాపీఠం నిర్మిస్తున్నా రంటే మనకు కీర్తి ప్రతిష్ఠలు.

తిష్య—సందేహ మేమిటి? తమరు సెల విచ్చింది నిజం.

శాంతి—ఇక్కడ విద్యార్థులందరూ ఎంద రుంటారు?

తిష్య—దాదాపు ఏడెనిమిదివంద లుంటారు. ఇదొక నగరమే—విద్యా న గ రం. మూడేళ్ల క్రిందట వచ్చిన మహాక్షామంలో చాలామంది వెళ్లిపోయినారు గాని లేకపోతే మరో కొన్నివంద లుండేవారు. ధనకటకవిద్యాపీఠ మంటే దేశదేశాల పేరుమోసింది. ఈ భవనాలు చిత్తగింతురుగాని దయచెయ్యండి. ఇవిగో ఇవి విద్యార్థుల వసతిగృహాలు. ఇది భోజనశాల. ఇది చైత్యగృహం. ఇవి ఆచార్యసదనాలు. ఇదిగో ఈచలువరాతి భవనంలో దూరదేశాలనుంచి వచ్చిన మహాబౌద్ధాచార్యులకు బసలు. ఈప్రక్కది గృధ్రకూటవిహారం. ఇది ఆమ్రపాలీసదనం—విద్యామండపం.

శాంతి—అది పుష్పవాటిక—కనబడుతూనే వుంది. ఇటు భవనా లింక లేవు.

తిష్య—చిత్తం. ఉన్న వసతిగృహాలూ, విద్యామండపాలూ చాలక విద్యార్థులు చాలా అగచాట్లు పడుతున్నారు. తమ పేరుమీదుగా ఒక్క విహారం—చైత్యవసతిగృహాలతో నిర్మాణంచేయించి ఇప్పించా లని మా వినయపూర్వకప్రార్థన. దానికి శాంతిశ్రీవిహార మని పేరు పెట్టుకొంటాం.

శాంతి—ఇం కెక్కడ చోటు లేదే?

తిష్య—ఈ కృష్ణాతీరం అంతా బయలే ఈ పుష్పవాటిక కవతల. కావలసినంత చోటు. చూతురు గాని, దయచేయండి.

(టక్కుటక్కుమని రాతిమీద కొడుతున్న చప్పుడు)

తిష్య—ఇదంతా బయలేనండి. ఏటిఒడ్డు—విహారాని కనువైన చోటు.

శాంతి—అటంతా అడవి. మెకాలూ ఏవీ విహారాలకు రావుకద?

తిష్య—ఏవీ రావు. అహింసే పరమధర్మంగా పెట్టుకొన్న తథాగతులవారి శిష్యుల సేమీ చేయవు. ఎప్పుడూ అవి విహారాలలోకి వచ్చినట్టు నే నెరగను. దేవన్నా! ఆ రాయి చెక్కడం ఆపి ఆ బత్తుణ్ణి అవతలికి పొమ్మను.

శాంతి—బాగానే ఉంది విహారనిర్మాణానికి ప్రదేశం. ఆలోచిద్దాం. ఏమి టా కొట్టేది? ఎవ రతను?

తిష్య—ఎవరో కాశివాళ్ల కుర్రాడు.

శాంతి—ఏం చేస్తున్నా డిక్కడ?

తిష్య—ఏదో బొమ్మ చెక్కుతున్నాడండి—దేవన్నా! వెళ్లలేదూ? పొమ్మని చెప్పు—ఆ కుర్రాణ్ణి.

శాంతి—ఏమి టా బొమ్మ—పదండి చూదాం.

(చేరువకు వెళ్లుదురు.)

తిష్య—ఉల్లప్పా! ఈ రోజున నిన్నిక్కడికి రావద్దని చెప్పలేదూ?

శాంతి—ఇక్కడి కెందుకు వచ్చావు? ఎవరవు నీవు?

తిష్య—ఏదో తెలియక వచ్చాడు లెండి. అసలే భయపడుతున్నాడు—క్షమించండి.

శాంతి—ఎవరబ్బాయివి నువ్వు?

ఉల్లప్ప—(భయంతో వణకుతూ) కొమ్మోజు గారి ఉల్లప్పనండి. దణ్ణమండి. ఈ తప్పు కాయండి బాబూ! సందడుండ దని ఇక్కడికి వచ్చి చెక్కుకుంటున్నానండి.

శాంతి—ఏం చెక్కుతున్నావు?

తిష్య—వెర్రిమొర్రి బొమ్మ లేదో. స్వామి విగ్రహమేనా?

ఉల్లప్ప—ముచిలిందనాథండి.

శాంతి—ఏం, చెక్కినపైపు రాయి బోర్లించా వేం? తిప్పు, ఏదీ చూదాం దాన్ని.

ఉల్లప్ప—ఇంకా చెక్కడం పూర్తి కాలేదండి.

తిప్ప—ఇది విహారం. దీనిదగ్గిర నువ్వు ఈ రాయి టిక్కు టక్కు మంటూ చెక్కుతూ కూర్చుంటే మా చదువులకు భంగం కాదూ?

శాంతి—పూర్తికాకపోతే మానె, చూదాం ఒకమాటు తిప్పు.

తిప్ప—తిప్పు. మహాదేవిగారు చూస్తా మంటూంటే తిప్పవేం రాయి?

ఉల్లప్ప—(తిప్పుతాడు)

శాంతి—ఊఁ. ఎన్నాళ్ల కవుతుంది చెక్కడం?

ఉల్లప్ప—చెప్పలేనండమ్మా! నెల పట్టవచ్చు, రెండు నెలలు పట్టవచ్చు. పంతనాగా చెక్కడమే కావాలండి. ఎంతకాలం పడుతుందో మరి.

తిప్ప—అంతకాలమూ మాకీ టిక్కుటక్కు చప్పుళ్లు తప్పవూ?

ఉల్లప్ప—రాయి తీసుకుపోతానండి, కొప్పడకండి. దణ్ణం పెడతానండి.

శాంతి—నువ్వీ విగ్రహం పూర్తిచేసి నాకు కనబడు.

ఉల్లప్ప—చిత్తమండమ్మగారూ!

శాంతి—ఇక్కడే చెక్కుకోనియ్యండి వీణ్ణి. పదండి వెడదాం.

తిప్ప—చిత్తం. విహారద్వారాని కిటు అడ్డుగా వుంది. ఇటు దయచేయ్యండి. ఇటు ఇటు. (నిష్క్రమణ)

(మంగళతూర్యరవాలు-పల్లకిమోత)

## ౪-వ రంగము

### కృష్ణానదీతీరాన విజయపురి కోటలో.

(రెమ్మన్న, వీరన్న అను పౌరుల ప్రవేశము)

రెమ్మ—వీరన్నా! ఎక్కడికి, పక్కనున్న నన్ను కూడా చూడకుండా అల్లా ఉరుకుతున్నావు?

వీర—రెమ్మన్నా! చూడలేదు నిన్ను. నీకు తెలుసా కొండెమ్మజాగారి ఉల్లప్ప గొప్ప బొమ్మ చెక్కా డట! ధనకటకాన్నుంచి దాన్ని పొద్దున్న మన వూరు తీసుకువచ్చారట. దాన్ని మన మహారాజులుంగారి మేనత్త శాంతిశ్రీమహాదేవిగారి ఆజ్ఞచేత మనకోటలో ప్రదర్శించారట. అందరూ వచ్చి చూడవలసిం దని పొద్దున్న మన వూళ్లో ఏనుగుమీద చాటింపు వేయిం చారు.

రెమ్మ—అబ్బ! ఏమంత గొప్ప బొమ్మేమిటి చాటింపు వేయించడానికి! ఊళ్లో లేను. ఇందా కానే వచ్చాను.

వీర—చాలా గొప్ప విగ్రహమట! తిరునాళ్లకు వచ్చినట్టు వస్తున్నారు ప్రజ దాన్ని చూడడానికి.

రెమ్మ—ఈ ప్రజకు ఏం వచ్చినా విడ్డూరమే.

వీర—విడ్డూరం కాదు రెమ్మన్నా! శిల్పాచార్యులు గొప్పగొప్ప విద్యావంతులే మెచ్చుకొన్నా రట—తల నెరసినవాళ్లు, వీరపురుషదత్తమహారాజులుంగారు, మహామంత్రులు—ఒక రేమిటి? అందరూ ఒకటే పొగడడం!—చూడు, ఆ ప్రజని. ఎట్లా వెడుతున్నారో, ఎట్లా వస్తున్నారో?

రెమ్మ—ఏమిటా బొమ్మలోని విశేషం; అంత పొగడడానికి?

వీర—రా చెపుతాను. నాగరాజు స్వామిచుట్టూ తిరుగుతున్నట్టు చూపాడట శిల్పి.

రెమ్మ—(ఆశ్చర్యంతో) తిరుగుతున్నట్టు!

వీర—అదే కదూ విచిత్రం!

రెమ్మ—నువ్వు చూశావా ఎట్లా చెక్కాడో?

వీర—నే నింకా చూడలేదుకాని చెప్పంగా విన్నాను.

రెమ్మ—ఎట్లా చూపా డట?

వీర—నాగరాజును మొలదగ్గిరనుంచి పైభాగం నెత్తిమీది పడగలతో మనిషాకారంలోను, కిందిభాగం పాముతోకరూపంలోను చెక్కడం సంప్రదాయం. నువ్వు మన మహాచైత్యంలో చూశావుకదూ?

రెమ్మ—అవును. చైత్యాలలో అట్లాంటివి కావలసినన్ని.

వీర—ఉల్లప్ప ఏం చేశాడట—స్వామికి కుడి, ఎడమ పక్కల ఒక్కలాటి పోలికవి నాగరాజువిగ్రహాలు రెండు చెక్కాడట. చెక్కి ఏం చేశాడూ, ఈ రెంటికీ కాళ్లు వేశాడట. ఒక్కొక్కరికి ఒక్కొక్క కాలే. రెండోది తోక. స్వామికి కుడివైపునున్న నాగరాజుకు ఎడంకాలూ, ఎడమప్రక్కనున్న నాగరాజుకు కుడికాలూ తోకగా వేసి, ఆతోక పద్మాసనం వేసుకొని కూర్చున్న స్వామిని చుట్టివచ్చినట్టు చూపాడట. ఇట్లా చెయ్యడంచేత ఆ నాగరాజు స్వామిచుట్టూ తిరుగుతూన్నట్టనిపించదూ మరి?

రెమ్మ—అసాధ్యుడులా గున్నాడే!—మరి నాగరాజు స్వామివెనకవైపునుంచి తిరుగుతున్నట్టు?

వీర—వెనకనుంచి తిరుగుతున్నట్టా?—స్వామి తలమీది కున్నాయి పడగలు. తిరుగుతూంటే స్వామికి వెనకపక్క పై కొక్క పడగలే కనబడతాయి కాని, నాగరాజు శరీరం కాని, పాముతోక గాని కనబడదుకదా? ఈవిధంగా పరిభ్రమణవిధం సూచించడంచేత స్వామికి గాలీ వానా తగలకుండా నాగరాజాయనచుట్టూ తిరుగుతున్నట్టు స్ఫురిస్తోంది కాదూ?

రెమ్మ—వా డెవడో చాలా ఘటికుడులా గున్నాడే! తప్పకుండా ఆ బొమ్మను చూడవలసిందే.

వీర—చూసేటందుకే వెడుతున్నాను. నువ్వు కూడా రా. (పరిక్రమించి) వచ్చేశాం.

రెమ్మ—పెద్ద పందిరి వేసి వితానం కట్టి అలంకరించారు.

వీర—అదిగో అక్కడ ఉన్నతపీఠంమీద ఆ బొమ్మ! అంతా దగ్గరికి వెళ్లి చూసివస్తున్నారు. ఏం జనం! ఏం జనం!—పద, మనమూ చూచివద్దాం. (బొమ్మదగ్గిరికి వెళ్లి చూస్తూ) ఓహోహో! ఎంత నేర్పుగా, అందంగా చెక్కాడో?

రెమ్మ—నాగరాజు తిరుగుతున్నట్టే చూపించాడు! ఏం విజ్ఞానం! ఎవ్వరా ఉల్లప్ప?

వీర—అదిగో ఆ వేదికదగ్గిర మెళ్లో పూలదండ వేసుకొని తలపాగా చుట్టి మడిచేతులు కట్టుకు కూర్చున్నాడు—అతనే, కనబడడం లేదూ? అదుగో అతనే ఉల్లప్ప!

రెమ్మ—ఉల్లప్పపక్క ఆ పెద్ద తలపాగా లెవరు?

వీర—అదుగో, ఆ ముసలాయన తాతగారు తిప్పోజు. ఆయన కుడిపక్క ఉల్లప్పతండ్రి కొమ్మోజు. తిప్పోజుకు ఎడంపక్క ఉల్లప్పపినతాత పోతోజు.

రెమ్మ—ఆ వుల్లప్పను గన్న తలిదండ్రులు ధన్యులు. ఉల్లప్ప చెక్కిన బొమ్మ లింకా ఏమయినా ఉన్నాయా?

వీర—లేవు. ఇదే మొదటిది.

రెమ్మ—మొదటి బొమ్మలోనే ఇంత ప్రజ్ఞ చూపిస్తే ముందుముం దింకా ఎంతటివా డవుతాడో ఉల్లప్ప! మనం కానంకాని మనలో ఎంతటి గొప్పవాళ్లయినా వున్నారు.

(మంగళతూర్యరవాలు మ్రోగును. పెద్ద కలకలం)

వీర—అదుగో శాంతిశ్రీ మహాదేవిగారు—వేదికమీది కెక్కి కూర్చుంటున్నారు.

రెమ్మ—ఆ బంగారుపళ్లెంలో పళ్లూ పువ్వులూ సుగంధద్రవ్యాలూ చీనిచీనాంబరాలూ బంగారు కంకణాలూ హారాలూ వుంచా రెందుకో.

వీర—ఉల్లప్పకు బహుమతీ చేస్తా రేమో?

రెమ్మ—అదిగో! మహాదేవి ఏదో చెపుతారు కావును.

వీర—ఏదో చెపుతోంది ఆవిడ. విందాం. ఏమిటో అంటోంది.

(కలకలం: నిశ్శబ్దం, నిశ్శబ్దం అని కేకలు. కలకలం తగ్గును.)

శాంతి—మీ రందరూ ఈ విగ్రహం చూశారు. స్వామి తపస్సు చేసుకుంటూవుంటే ఆ స్వామికి గాలీ వానా తగలకుండా ముచిలిందు డనే నాగరాజు ఆయన్ను కాపాడిన చిత్ర మిది. నిజంగా ఇది చాలా

గొప్ప చిత్రం. ఇటువంటిది ఇంతవరకు నే నెక్కడా చూడలేదు. ఉపాసికనై నేను ఆసేతుహిమాచలమూ యాత్ర చేసి మన దేశంలో వుండే ముఖ్యమైన బౌద్ధ మహాక్షేత్రా లన్నీ చూశాను. అన్ని మహాచైత్యాలూ సందర్శించాను. బౌద్ధగాథలు చెక్కిన చైత్యశిలాశిల్పా లన్నీ పరిమర్శగా పరికించాను. ఈ ముచిలిందగాథ రెండు మూడుచోట్లమాత్రమే చెక్కారు—ధనకటకం లోను, మృగదావంలోను, ఇంకోచోటాను. ఆ చోటు పేరు మరచిపోయాను. అక్కడ నాగరాజు నాగినులు స్వామికి నమస్కరిస్తున్నట్టు చూపారు. ధనకటక చైత్యంలో ఎట్లా చూపారో మీరు చూసేవుంటారు. మృగదావంలోకూడా విగ్రహం మన ధనకటకంలో చెక్కినట్టే చెక్కారు. మన ధనకటకమహాచైత్యంలో చెక్కినది గొప్ప చిత్రం. మీ రిప్పుడు చూస్తున్న చిత్రం ఈ మూడింటికంటెనూ గొప్పది. మీరు దాన్ని చూడనే చూశారు. అది యెందుచేత గొప్పదో నేను మీకు చెప్పనక్కరలేదు. ఈ విగ్రహం చెక్కినతను ఉల్లప్ప. (జే, నంబో ఉల్లప్పా అని కేకలు)— అదుగో ఆ నుంచున్నవాడే ఈ నాగశిల్పి. ఇటువంటి శిల్పి మా రాజ్యంలో పుట్టడం మాకు గర్వంగా ఉంది. ఇంత చిన్నతనంలో ఇంతటి ప్రతిభ చూపిన ఉల్లప్పకు ఈ రత్నకంకణాలూ, చీనిచీనాంబరాలూ ఇచ్చి గౌరవింపదలచాం.

(మంగళవాద్యధ్వనులు - జనుల కలకలం)

వీర—చందనతాంబూలాదు లిచ్చి నాగశిల్పిని గౌరవిస్తున్నారు.

రెమ్మ—ఇంకా ఏదో చెపుతున్నారు మహాదేవి గారు!

శాంతి—ఈ నాగశిల్పిని మా యాస్థానమహాశిల్పాచార్యులలో ఒకణ్ణిగా నియమిస్తున్నాం. ఇతరఆస్థాన మహాశిల్పాచార్యులకు జరిగే మర్యాదలు నేటినుంచి నాగశిల్పికి జరుగుతాయి. మహారాజులుంగారి అనుమతితో చేసినదే ఈ నియామకం. మరొక్క విషయం. ప్రస్తుతం మేం ఈ విజయపురిలో కట్టిస్తున్న మహాచైత్యానికి ఈ నాగశిల్పిని ఈ ముత్యాలకంకణంతో సత్కరించి శిల్పకర్మాధ్యక్షుణ్ణిగా నియమిస్తున్నాం.

(మంగళవాద్యధ్వనులు - కలకలం)

వీర—రెమ్మణ్ణా! ఎక్కడ?—సభ ముగిసింది. రా, ఇంక నడదాం. శాంతి శ్రీ మహాదేవిగారు వెళ్లిపోయినారు. పద. మనమూ పోదాం.

(అందరు నిష్క్రమణ)



# వెఱ్ఱిపాట



శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

౧

వెఱ్ఱిపాటల నే నాలపింతు ననుచు
కలవు బ్రదుకెల్ల పిచ్చిపోకడలె యనుచు
నవ్వుకొను లోకమునకు వందనము లిచ్చి
స్వామి, నినుగూర్చి మాటికి పాడుకొందు.

౨

ఈ కవిత్వపు పిచ్చి నా హృదయసీమ
పరిణతి వహించుకొలది, దుర్భరదురంత
వేదనామలీమస మగు విశ్వమందు
వెలుగుదారుల కవలియంచుల జరింతు.

౩

భావనోన్మాదమో, ప్రేమభరమొ తండ్రి!
పాడుకొనుచున్న నా చిన్నిపాటలోన
కాంచుచుందును నీ నాట్యగతులయందు
చిత్ర మలరించు ప్రతిభావిశేషమెల్ల.

---

# మహాత్ముని జాతకములో మారకదశ

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

అవతారసమాప్తికాలము సాధారణముగా తీసికొని సూక్ష్మగణితపద్ధతులతో ఉదయము ౮ గం. ౪౧ ని. ౫౧ సె. A. M. (I. S. T.) కాలమున మహాత్ముడు జనన మందియుండవలయును అని ఏప్రెల్ 'భారతి' సంచికలో కనుగొనియుంటిమికదా! "మురారే స్తృతీయః పంథాః" అనురీతి, ఏదో క్రొత్త మార్గమును లేవదీసినా రని హేళనము చేయువా రుందురేమో? మరియు, గుళికునినుండియో, ప్రాణపదమునుండియో, లేక నాడీగ్రంథపద్ధతులమూలమునవో లగ్నశుద్ధిని పరీక్షించుటకై పరిశోధకులు సయితము పూనుకొనకపోరు. మంచిదే. కాని, ౧౯౩౩ వ సంవత్సరమందే "విధిలిపి" అను జ్యోతిషపత్రికలో మహాత్ముని జన్మకాలము ౮-౪౨ A. M. అని వ్రాయబడినట్లు ఇటీవల నామిత్రు డొకడు తెలిపెను*.

"ఉత్పత్స్యతే హి మమ కోపి సమానధర్మా" అనుకొని సంతసించితిము కాక!

జన్మకాలమునుగూర్చి భిన్నాభిప్రాయము లిట్లున్నప్పుడు, ఆయుర్దాయము విషయమున పండితులకు భిన్నాభిప్రాయము లుండుట వింత కాదు. జాతకశాస్త్రమున ఆయుర్దాయవిచార మెంత ముఖ్యమో, దాని పద్ధతి అంత గహనము. ప్రాచీనగ్రంథములలో ఆయుర్దాయనిర్ణయము చేయు పద్ధతులు నానాప్రకారములుగా చెప్పబడియున్నవి.

"ఆయుర్దాయవిచారో హి
గహన స్సర్వదా ద్విజ,
ఆయుర్బహుప్రకారేణ
భాషితం బ్రహ్మణా పురా"

(బృహత్పరాశరహోర)

బహుప్రకారములైన ఈ ఆయుర్దాయదశాపద్ధతులలో ఏ వ్యక్తికి ఏ పద్ధతి నుపయోగించవలయునో నిర్ణయించుట సులభకార్యము కాదు. ఈ విషయమును గూర్చిన సూత్రము లనేకములు 'బృహత్పరాశరహోర' లోనే కానవచ్చుచున్నవి. కాని, ఏమి కారణమో, అవి సామాన్యముగా ప్రచారములోనికి రాలేదు. మన దక్షిణదేశములో సర్వసామాన్యముగా అన్ని జాతకములకును 'వింశోత్తరీపద్ధతి' యనబడు ఉడుదశను మాత్రమే కార్తాంతికులు వాడుచున్నారు. కృష్ణపక్షములో రవిహోరలో, శుక్లపక్షములో చంద్రహోరలో పుట్టిన జాతకులకుమాత్రమే ఈ వింశోత్తరీదశ నుపయోగింపవలయు నని పరాశరుడే శాసించినాడు:—

"కృష్ణేతు రవిహోరాయాం,
చంద్రహోరాగతే సితే"

(బృహత్పరాశర హోర)

కాని, కృష్ణపక్షములో పగలు, శుక్లపక్షములో రాత్రి పుట్టినవారికే వింశోత్తరీదశ ఫలము నిచ్చునని 'మానసాగరీపద్ధతి' స్పష్టముగా చెప్పుచున్నది:—

"కృష్ణపక్షే దివా జన్మ,
శుక్లపక్షే యదా నిశి,
వింశోత్తరీ దశా తస్య,
శుభాశుభ ఫలప్రదా"

అనేకశతాబ్దముల అనుభవము వలన శాస్త్రజ్ఞులు నిశ్చయించిన అర్థ మిది కాబోలు? ప్రాచీనసూత్రము లిట్లుండగా, ఏకమూలికాప్రయోగమువలె సర్వజాతకములకును ఈ వింశోత్తరీదశ కట్టుట ఏమి న్యాయ్యము?

---

* బెంగుళూరు అస్ట్రొలాజికలుమ్యాగజైన్, ౧౯౪౯ వ సం॥ మార్చి నెల సంచిక ౨౩౫ వ పుట చూడుడు.

పోనిండు. ఈ ఉడుదశకు నక్షత్రము, అనగా నిరయన చంద్రస్థానము ఆధారము కదా ! పంచాంగ కర్తలు భిన్నభిన్నములైన అయనాంశలను ఉపయోగించుటచే వేరువేరు పంచాంగముల నుపయోగించు వారికి వేరు వేరుగా చంద్రస్థితి వచ్చుటకు సంభవమున్నది. అగుటచేత ఒకరు నిర్ణయించిన దశా భుక్త్యంతరములు ఇంకొకరు నిర్ణయింపగలుగుట అసంభవము. చూడుడు :

బెంగుళూరు డాక్టరు బి. వి. రామన్ గారు మహాత్ముని మరణకాలమునకు గురుమహాదశలో రవి భుక్తి వచ్చి మారకము చేసిన దని నిర్ణయించిరి*. నిరయనముగా తృతీయస్థాధిపతియై అష్టమ భావమందున్న గురుమహాదశలో, లాభాధిపతియై ద్వాదశ భావమందుండు రవిభుక్తి మారకము నిచ్చుట సమంజసమని వీరి వాదము. తెనాలి బి. వి. అప్పారావుగారు గురుదశలో శనిభుక్తిలో, బుధాంతరములో (అనగా ౧౯౪౦ సం. ఆగష్టునుండి డిశంబరు) మారకము కలుగునని చెప్పియుండిరి. † అట్లు సంభవించలేదు సరే గాని, ఇదే లెక్క ననుసరించి మహాత్ముని మరణ కాలమునకు గురుమహాదశలో శుక్రభుక్తి వచ్చును. గురుదశను మారకదశగా పండితులందరు తీర్మానించి యున్నారు కదా ! ౭౦ సంవత్సరముల ముసలితనములో ఆరంభమై ౧౬ సంవత్సరముల దీర్ఘకాలము నడువవలసియున్న గురుమహాదశ మన హిందూదేశములో—అందులో ఇప్పటి ఆరోగ్యపరిస్థితులలో—మారకదశ కావచ్చు ననుటకు అంత శ్రమ పడనక్కరలేదు. ఇక, దీనిలో శుక్రభుక్తి, అనగా లగ్నాష్టమాధిపతిభుక్తి మారకము చేసిన దనుకొన్నచో ఇదికూడ సమన్వయమగును.

ఇంచుమించుగా ఒక్కటే కాలమును జన్మకాలముగా ఉపయోగించుకొన్న వీరిరువురి దృష్టిలో మహాత్ముని మరణకాలమునకు రాగల దశాభుక్తులలో ఇంత వ్యత్యాసము వచ్చినచో, భిన్నకాల ముపయోగించినవారి మాట ఇక అడుగు పనియే ఉండదు.

బి. కే. సింహాగారి దృష్టిలో గురుమహాదశలో కుజభుక్తిలో మహాత్మునికి మరణము సంభవించినదట !‡ కుజుడు ద్వితీయసప్తమ మారకస్థానాధిపతి యగుటచే ఆ గ్రహభుక్తిలో ఇట్టి విషమఫలము కలుగుట యుక్తమని వీరి వాదము. ఎవరియుక్తిని మనము కాదనగలము ? ఇంతవేల ? ఇంకెవరైన గురుమహాదశలో శని భుక్తిలోనే మహాత్ముని నిర్యాణము జరిగియుండవలెనన్నచో మాత్రము మనము కాదనగలమా ? దశానాథుడగు గురువునకు షష్ఠాష్టమస్థితిలో ద్వితీయమారకస్థానములో నున్న శని ప్రబలమారకుడు కాదా ?

మాటవరుసకు మనము సైతము దశాభుక్తులను గుణింతము. సాయనచంద్రస్థానము సింహరాశిలో ౨౦ భాగలు ౧౪ కలలలో మనకు వచ్చినది. 'జ్యోతిర్గణిత'రీత్యా వచ్చు అయనాంశల నుపయోగింతము గాక :—

| | భా. కల |
|---|---|
| సాయనచంద్రుడు | ౨౦-౧౪ సింహము. |
| అయనాంశలు ౹ీసివేయగా | ౨౨-౨ |
| నిరయనచంద్రస్థానము | ౨౮-౧౨ కటకము. |
| | ది మా సం |
| అగుటచే బుధమహాదశాశేషము | ౧౬ - ౩ - ౨ |
| జన్మదినమును చేర్చగా | ౨-౧౦-౧౮౬౯ |
| బుధమహాదశాంతము | ౧౮-౧-౧౮౭౨ |
| కేతు, శుక్ర, రవి, చంద్ర, కుజ, రాహుమహాదశలు చేర్చగా... ... | ౦-౦-౬౮ |
| గురుమహాదశారంభము ... ... | ౧౮-౧-౧౯౪౦ |
| దీనిలో, గురుభుక్తి ... ... | ౧౮-౧-౨ |
| ,, శనిభుక్తి ... ... | ౧౨-౬-౨ |
| ,, బుధభుక్తి ... ... | ౬-౩-౨ |
| ,, కేతుభుక్తి ... ... | ౬-౧౧-౦ |
| చేర్చగా వచ్చు కాలము ... ... | ౩౦-౧-౧౯౪౮ |

---

* బెంగళూరు అస్ట్రాలాజికల్ మ్యాగజైన్ ౧౯౪౪ మార్చి నెల సంచిక ౨౦౨ వ పుట చూడుడు.

† ౧౯౩౨ సం॥ డిశంబరు నెల ౪ వ తేదీ నాటి 'హిందూ' వారపత్రిక చూడుడు.

‡ బెంగళూరు అస్ట్రాలాజికల్ మ్యాగజైన్ ౧౯౪౮ జూలై సంచిక ౪౬౮ వ పుట చూడుడు.

అనగా, అవసానదినమునకు గురుమహాదశలో కేతుభుక్తియు, అందులో బుధాంతరమును, నికరముగా ముగిసి పోయినవని తేలును. చతుర్థకేంద్రమందుండు కేతువు మోక్షకారకుడు కదా? మరి బుధుడో, అష్టమ (మృత్యు)స్థానాధిపతి అయినాడు. మారకమునకు ఇంకేమి కావలయును ?

తులాలగ్నవాదుల కథలే ఇట్లుండగా, కర్కాటకమో, సింహమో లగ్నముగా నిర్ణయించినవారు ఏయేదశాభుక్తులను సాధింతురో ? ఇంతే కాదు. జన్మసంవత్సరమును, జన్మదినమును సయితము మార్చి (వారికి లభించిన సామగ్రి అదియే కాబోలు) కన్యాలగ్నమందు మహాత్ముడు అవతరించెనని చెప్పి అప్పటి కుండలిలో ఏమేమో రాజయోగముల చేర్పరించి వానితో మహాత్ముని జీవితకర్మములను సమన్వయపరచినవారు సయితము ఉన్నారు*. వీరుకూడ ఉడుదశనే ఆధారముగా తీసికొని ఏవో మారకదశాభుక్తులను ౩౦తా జనవరికి చూపుదురనుటకు సందేహము లేదు.

మహాత్ముని జన్మకాలములో ఆకాశరంగమందు చంద్రుడు ఏదో ఒక రాశిలో, ఏదో ఒక భాగలో, ఏదో ఒక్క కలలోనే కదా (వికలలమాట అట్లుంతము) ఉండగలడు ? అట్టి చంద్రస్థానమునే ఉపకరణముగా తీసికొని సాధించవలసిన వింశోత్తరిదశాపద్ధతిలో ఒక్కొక్క కార్తాంతికునికి ఒక్కొక్క రీతిగా దశాంతర్దశలు గణితములో వచ్చు టెట్లు? తాము సాధించిన దశాంతర్దశలకు తమ ముక్కునకు సూటిగా అర్థము చెప్పి సమన్వయము చేయుచు వీరు కాలక్షేపము చేయుచున్నారని విమర్శకులు వాదించిరేని, తప్పనలేము. జ్యోతిశ్శాస్త్రమునే ఎగతాళిచేయుటకు సమయమునకై కాచుకొనియున్న ఆధునికసర్వజ్ఞమ్మన్యులకు ప్రబలమైన ఊతకొమ్మకదా యీ అవ్యవస్థ? మరియు జిజ్ఞాసువులగు విద్యార్థుల దృష్టిలో ఇది గొప్ప గందరగోళముగాక మరేమగును? విద్యార్థికులలో, విశ్వవిద్యాలయములలో, ఈ శాస్త్రముపై అభిమానము నశించుటకు ఇంతకన్న ప్రబలకారణము కావలయునా ?

కాని, ఈ అవ్యవస్థకు శాస్త్రము జవాబుదారీ కాదు. మహర్షిప్రణీతములగు అనేకగ్రంథములు నామమాత్రావశిష్టము లయినవి. ఉన్నవైనా, అన్నియు సులభముగా దొరకవు. దొరికినవానిలోని సూత్రములు కొన్ని అర్థముకాని స్థితిలో నిలిచియున్నవి. ఇక—

"యస్మై కస్మై న దాతవ్యం, స్వవాక్యపరిసిద్ధయే."

అనువాక్యము ననుసరించి ఎన్ని సంప్రదాయములు శాస్త్రజ్ఞులు రహస్యముగా నుంచుకొనుటచే నశించిపోయినవో ! సంశయాస్పదములుగా నున్న సూత్రములకు ఉపపత్తిని విమర్శించు పరిశోధకులు అరుదైనారు. ఎవరి కేముక్క లభించునో అదే శాస్త్రసర్వస్వముగా భావించి దానితోనే ఉదరపోషణమో, పరప్రతారణమో కావింపజూచు కార్తాంతికులు ప్రబలినారు. "పండ్రెండు అణాలకు ౧౨ నెలల భవిష్యము" చెప్పుదుమని తాటికాయలంతేసి ప్రకటనాక్షరముల తమ కార్యస్థానద్వారములపై వ్రాసియుంచుకొను 'చౌక' జ్యోతిష్కులు ఇప్పటి నగరములలో మూలమూలలో నిండియుండుట ఈశాస్త్రమునకు నేటికాలమున పట్టిన అధోగతికి సాక్ష్యము. దీనికి మంచిస్థితి రావలయునన్నచో, పండితులు హోరాశాస్త్రసంస్థలను నెలకొల్పి పరిశోధనలు సలుపుటయు, ప్రాచీనసూత్రములను ఆధునికానుభవములతో సమన్వయపరచుటయు ఖండాంతరశాస్త్రజ్ఞుల సిద్ధాంతహోరాశాస్త్రయుక్తులను ఉదారబుద్ధితో విమర్శించి, వానిలో తగినవాని చేర్పరించి స్వీకరించటయు, విశ్వవిద్యాలయములలో ఈ శాస్త్రమునకు స్థానము కల్పించుటకై పాటుపడుటయు అత్యావశ్యకములు. అట్లు జరిగిననే తప్ప, ఈ విద్యకు రాజాదరము, ప్రజాదరము లభించుట కల్ల. ఆ భాగ్య మెన్నటికో ?

అది అట్లుండె. దేవమానదశాపద్ధతి ననుసరించి చలితగ్రహములు మహాత్ముని నిర్యాణకాలమునకు కర్మ

---

* శ్రీ పండితభూషణ వి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ఇంగ్లీషు అనువాదముతో ప్రకటింపబడిన 'ఉత్తరకాలామృతము'నందలి ఉదాహృతజాతకములను చూడుడు.

పరిపాకము నెట్లు సూచించినవో పరిశీలించుట అప్రస్తుతము కాదనుకొందును. ఈ క్రిందనున్నదే మహాత్ముని సాయనజన్మకుండలి. పాఠకమహాశయుల సౌకర్యార్థమై ౧౯౪౮ వ సంవత్సరము జనవరి మాసాంతమునకు చలితగ్రహముల స్థానములు సయితము చూపబడినవి.

జన్మకాలికగ్రహభావస్థానములతో ౭౮౩ సంవత్సరముల వయస్సునకు చలితగ్రహాదులు ఏయే సంబంధములను సంపాదించినవో దయచేసి ఒక్కమారు చిత్తగింపుడు :—

<table>
<tr><td></td><td></td><td>ఇంద్ర ౧౬-౪౯<br>మోక్ష (స)<br>౯-౩౦</td><td>న ౧౧-౨౮</td><td></td><td></td></tr>
<tr><td></td><td></td><td>ఇంద్ర<br>౧౮-౨౬ (వ)</td><td>VII ౩-౨౬<br>న ౨౦-౧౦ (వ)<br>●</td><td></td><td></td></tr>
<tr><td>కు ౧౪-౫౭<br>శే ౦-౩</td><td>శే ౪-౧౧<br>IV ౪-౧</td><td colspan="2" rowspan="2">మహాత్ముని<br>జాతకకుండలి<br>——<br>[సాయనము]</td><td>వరుణ ౨౧-౪౬</td><td>చ ౩-౩౬<br>వ ౨౦౫౫</td></tr>
<tr><td>కు ౧౬-౨౮<br>I ౯-౪౦<br>బు ౦-౫౬</td><td>మోక్ష (స)<br>౬-౩౩</td><td>X ౪-౧ రా<br>౪-౧౧ మృత్యు<br>(స) ౧౬-౫౦<br>చ ౨౦-౧౪</td><td>రా ౦-౩</td></tr>
<tr><td></td><td>శ ౧౨-౨౧</td><td>I ౩-౨౬<br>బు ౩-౪౬<br>న ౧౬-౨౩<br>కు ౧౮-౨౪</td><td>ర ౮-౫౬<br>హత్య (స)<br>౯-౪౯</td><td>పుణ్య (స)<br>౧౪-౪౬</td><td></td></tr>
<tr><td></td><td>ర ౨౭-౪౦<br>శ ౨౦-౩౧<br>హత్య (స)<br>౧౬-౪౫</td><td>మృత్యు (స)<br>౩-౧౦<br>పుణ్య (స)<br>౨౯-౦</td><td>X ౨౨-౨౦</td><td></td><td></td></tr>
</table>

సూచిక:—(౧) (స) అనగా- సహమ బిందువు.

(౨) బైటికుండలిలో చూపబడినవి చలితగ్రహస్థానములు,

(౧) అష్టమ (మృత్యు) భావముపైన అర్ధకేంద్ర (౪౫ భాగల) విషమదృష్టిని బరపుచున్న మారి ఇంద్రుడు వక్రచారము నాశ్రయించి యిప్పుడెచట నున్నాడో చూచితిరా? మృత్యుసహమ బిందువుపై, మరియు చలితహత్యాసహమ బిందువు ఏకకాలమందే పరిపూర్ణకోణదృష్టిని (౧౨౦ భాగలు) ప్రసరింపజేయుచు వాని "కార్యమునకు అనుకూలపరిస్థితులన్నియు సిద్ధముగా నున్నవి" అనుచున్నాడు. ఇంతమాత్రమే చాలదు. మహాత్ముని లగ్నాధిపతి దొరకనిదే యీ పరిస్థితు లేమి చేయగలవు? కాని, దురదృష్టవశమున — లేక కర్మానుగుణముగా — ఇదే వయస్సునకు లగ్నాధిపతి కుజుడు చలించి, చలితేంద్రుని కేంద్ర (౯౦ భాగల) క్రూరదృష్టికి అత్యంత సన్నిహితుడుగా ఆకర్షింపబడుట ప్రమాదకారి. ఇంత

కన్న మంచి అవకాశము ఇంద్రునికి ఏవయస్సులో లభించగలదు. సరేకాని, చలనవశమున మృత్యుసహమము ఎచటికి పోయిఉన్నదో ముఖ్యముగా గమనింపుడు. కాలకర్మసంయోగ మనగా ఇట్లుండవలయు గదా ? ఈ సహమము అవసానకాలమునకు చలించి వచ్చి నికరముగా మహాత్ముని జన్మలగ్నము (తనుస్థానము) పైననే సాక్షాత్కరించియున్నది !! మోసము, హత్య, మృత్యువు ఇవి మూడును జట్టుకట్టుకొనియుండలేదా ? తనుస్థానాధిపతి (కుజుడు) మోసముపాలయినాడు; తనువుపై మృత్యువు విలచినది !! గ్రహచారఫల మనగా ఇంతకంటె వేరేమి? దశాఫలము నోటితో చెప్పి చేతితో చూపినట్లుండలేదా ?

(౨) జన్మలగ్నము (అనగా భౌతికదేహము) చలించి మకరరాశిలో ౯ వ భాగకు పోయినదని చదువరులు గమనించగలరు. వ్యయస్థానమందలి జన్మరవితో ప్రాతికూల్య (౯౦ భాగల) దృష్టిని పొంది జన్మకాల హత్యాసహమమునకు నికరముగా నిండు కేంద్రస్థానమును చలితలగ్నము ఆశ్రయించు వేళ యిప్పుడే. ఇదియే విధి ! చలితలగ్న మిప్పుడు మీనవవాంశలో నున్నది. జన్మరవి యుండుట ధనుర్నవాంశలో, చలితరవి ఇపు డాశ్రయించియుండుట సయితము ధనుర్నవాంశయే. అనగా, అష్టమస్థానము నందుండి మృత్యువు నుద్బోధించు బృహస్పతిఅధికారమునకే ఇవన్నియు లోబడిన వనుట. తగినట్లే యున్నది ఫలము.

(౩) చలితరవిస్థానము జన్మరవినుండి ౭౮ భాగలు ౪౪ కలల దూరములో నున్నది కదా ? దీని మధ్యబిందువు (*centre of gravity*) వృశ్చికరాశిలో ౧౮ భాగలు ౧౮ కలలలో ఉండు నని పాశ్చాత్యమహాశయులు ఊహించియుందురు. నికరముగ ఈ స్థలమందే జన్మకాలమందు కుజుడుండుట విశేషము.

అనగా, ఈ వయస్సునకు మహాత్ముని రవి కుజునిపై ఊగుచున్నాడనుట. చలితకుజుడు ఈ వయస్సునందే ఇంద్రుని మాయకు లోబడి దైవహతుడై చెడుటచే, తత్ఫలమును రవి అనుభవించుచున్నాడని అర్థము. చలితరవికి చలితకుజునితో ఇదే కాలమునకే క్రాంతిసామ్యము (***Parallel Declination***) సయితము సిద్ధించుటచేత కుజుని దోషము ప్రబలముగా సంపూర్ణముగా రవి నాక్రమించినది.

(౪) చలితచంద్రుడు అవసానకాలమునకు జన్మకుజునితో నికరముగా సార్ధకేంద్ర (౧౩౫ భాగల) విషమదృష్టికి వచ్చియుండుట గమనింపదగినది. ఇంద్రుని మాయావాగురలకు లోనైన కుజుడు రవికి దోషము నందిచ్చుటే గాక చంద్రుని సయితము వేధించుచున్నాడు.

(౫) లగ్నమును భౌతికదేహమని, చంద్రుని సూక్ష్మదేహమని, రవిని జీవాత్మ అని భావించుట సంప్రదాయము. ఆయువు పట్టనదగిన ఈ మూడును ఏక కాలమున వేధపాలు కానిచో సామాన్యముగా మృతి సంభవించ దనుటకు వేరు వ్యాఖ్యాన మవసరముండదు. పై చలనదశాయోగములచే ఈమూడును ఏవిధముగా వేధపాలై చెడినవో పాఠకమహాశయులు కనుగొనియున్నారు. కాని, "మానవసేవకై జీవితమును ధారపోసి, అనాసక్తియోగమును త్రికరణశుద్ధిగా అనుభవములోనికి తెచ్చుకొని, అజాతశత్రు వను ఖ్యాతి గాంచిన మహాత్మునికి ఇట్టి అపమృత్యువు రావలయునా ?"అని సందేహించువారికి మన మేమని ప్రత్యుత్తరము ఇవ్వగలము జాతకమునే ప్రశ్నింతముగాక ! ప్రత్యుత్తరము జాతకమందలి పుణ్యసహమమునుండియే రావలసియున్నది. ఈ బిందువు చలించి ఇపుడు వృశ్చికరాశిలో ౨౯ వ భాగలో నున్నది కదా ? ఏమి దీని అర్థ మందురేమో ? వృశ్చికరాశిలో అంత్యభాగమునకు 'గండాంత'మని వ్యవహార ముండుట మన మెరుంగుదుము. విశేష మేమన, వృశ్చికరాశిలో ౨౯ వ భాగ 'అపరిహార్యప్రారబ్ధకర్మఫలానుభవమును' తెలుపునట్టిదని మారిస్ వెమిస్ * పండితుని సిద్ధాంతము. అవసానకాలమునకు పుణ్యసహమము చలనవశమున నికరముగా

---

* ఏప్రిల్ మాసపు భారతిసంచికలోని వ్యాసములో ౩౦౪ వ పుటలో రెండుచోట్ల 'వెమిస్'అనుటకు మారుగా 'లెమిస్' అని యుండుట ముద్రణప్రమాదము. చదువరులు క్షమింతురుగాక !

ఈ దుష్టభాగకే వచ్చియున్న దన్నచో ప్రారబ్ధ మెంత దృఢమూలమో, ఎంత అపరిహార్యమో, వేరుగా వివరింప నక్కరయుండదు.

"హరిణాపి హరేణాపి, బ్రహ్మణాపి, సురైరపి,
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే!"

అను పెద్దలవాక్యమును మన కీ చలితపుణ్య బిందువు జ్ఞప్తికి తెచ్చుచున్నట్లు కానవచ్చుచుండ లేదా? ఇంకేమి ప్రత్యుత్తరము కావలయును?

(౬) మోక్షసహమబిందువును చూడుము. మేష రాశిలో మిథున (బుధ) నవాంశను పొంది, జన్మరవికిని హత్యాసహమమునకును ఎదురుగా అవసానకాలమునకు పోయి నిలుచుకొనియున్నది. ఈ పాంచభౌతిక దేహ సంబంధము ఇంక చాలునని హత్యావ్యాజముచే జీవాత్మను పిలిచి ఈ బిందువు ఆకర్షించుకొన్నట్లు చూపట్టుచుండలేదా? చలితరవి ఇపుడు ధనుస్సులో వర్గోత్తమాంశకు పోయి ఉత్తమశ్లోకతను ఆర్జించియున్నాడు. ఏస్వల్పదుష్టప్రారబ్ధవశమువనో జన్మకాలమున పరమనీచస్థానమందున్న రవి చలనవశమున (అనగా కర్మయోగముచే) అత్యుత్తమస్థితికి వచ్చినపుడు మోక్షసహమబిందువు చలనధర్మముచే మేష రాశి ౧౦ వ భాగను (ఇదే రవికి పరమోచ్చస్థానము) "నీ ఉచ్చస్థానమునకు నీవు రమ్మ"అని ఆహ్వానించినది. సర్వసమబుద్ధి, అహింసాతత్త్వసిద్ధాంతము, సర్వమానవసేవ, సర్వస్వత్యాగము, కారాగారనివాసము, మౌనవ్రతము, ఉపవాసాదినియమములు మున్నగు అసాధారణగుణములచే ప్రారబ్ధశేషమును బుద్ధిపూర్వకముగా ఇహమందే పూర్ణముగా, నిశ్శేషముగా అనుభవించి, శాంతివీరుడైన ఆ మహాయోగిని మోక్ష మాహ్వానించుట ఏమి అరుదు? అట్లు కాదేని, ఆస్తికత్వముతోటి దైవభక్తిని తెలుపు సింహరాశి ౨౦ వ భాగలో నున్న ధర్మస్థానాధిపతి చంద్రుడు, ఈ చంద్రునికి నిండు కర్మస్థానములో సక్రమాభివృద్ధిని సూచించు వృషభ రాశి ౨౦ వ భాగలో నున్న బృహస్పతి, వీరు నేతి బీరకాయ లగుదురు. అందులో వీరి పరస్పరకేంద్రవర్తిత్వము నూటికి ౧౦౦ వంతులకు పైగా నున్నది. యోగపు ఫలము పూర్ణముగా రావలయును గదా?

మహాత్ముని ప్రార్థనాసభలు, రామభజనలు, చరిత్రలో శాశ్వతముగా నిలుచునట్టివి.

"ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే?"

అని కులశేఖరాళ్వారు వాపోయినగతి తెచ్చుకొనక, అంత్యకాల అసాధారణఘోరపరిస్థితులలో సయితము స్థితప్రజ్ఞుడై, "రాం, రాం, రాం"అని ముమ్మారు పవిత్రశ్రీరామనామస్మరణ చేసి భౌతిక దేహమును వదలిన ఆ మహాత్ముడు ముక్తు డనుటకు ఎవ్వరు సంశయింపగలరు?

జీవమానదశలో చలితగ్రహములు, చలితసహమములు, చలితలగ్నము—ఇవి మహాత్ముని ౭౮ సంవత్సరముల వయస్సులో ఏవిధమైన కర్మఫలపరిపాకమును సూచించెనో, అవి సూచించిన ఫలముతో జరిగిన దుష్పరిణామమునకు సమన్వయము ఎంత హృదయంగమముగా సిద్ధించినదో, సంక్షేపముగా పాఠకమహాశయులకు నివేదించితిని. విశేష మేమనగా ప్రశంసలోనున్న కాలమునే ఆధారముగా తీసుకొని సాయనకుండలిని ఎవరు గుణించినను, ఈషణ్మాత్రమైన భేదము లేక పై చలనఫలములన్నియు సిద్ధించగలవు. ఉడుదశాభుక్తులలో వచ్చినట్లు తలకొక్క భేదము వచ్చుట అసంభవము. జన్మనక్షత్రము మఖయా, లేక ఆశ్లేషయా, దూరకభుక్తినాథుడు రవియా, కుజుడా, శుక్రుడా, లేక మరియొక్కడా అను సందేహముల కిచ్చుట అవకాశముండదు. స్పష్టగ్రహములు, స్పష్టభావములు, స్పష్టసహమములు మున్నగువానిలో భేదము రాదు కావున, ఎవ రెవరికితోచిన యుక్తులో, యోగములో వారు చెప్పుకొన వచ్చును. అనుటచే అవ్యవస్థ యుండ దనుట.

సాయనవృశ్చికలగ్నమునకు మరియొక్క విశేష ధర్మ మున్నది.

"వృశ్చికే మకరే జన్మ,
నృణాం రాహు ర్భృతిప్రదః"
(బృహత్పరాశరహోర)

అను పరాశరసూత్రము వృశ్చికలగ్న జాతులకు రాహువే మరణమును దెచ్చు నని తెల్పుచున్నది. ఈ జాతకమునందో, రాహువు ప్రబలుడై దశమకేంద్రమధ్య మందే గలడు. చలనవశమున ఈ రాహువు అవసాన కాలమునకు సింహరాశ్యారంభకలలు (౦-౩) చేరు కొని నడుముకట్టి గండసంధిలో దూకుటకు సిద్ధముగా నుండుట చదువరులు గమనించియుందురు. కావున నే మహాత్మునికి గొప్ప అపమృత్యుగండ మాసన్నమైనది. పరేకాని, రాహుదశ యిపుడు లేదే అని సందేహింతు రేమో ?

"యోగేషు కేచి జ్జాయంతే
మూఢాః కాశ్మీరగార్దభాః;
యోగాస్తే కిం కరిష్యంతి
స్వదశానా మనాగమే."

అనురీతి, దశాసాకర్యము వచ్చినపుడే గ్రహము ఫలము చూపగల దనుమాట సత్యమే! కాని, దశ యనగా వింశోత్తరీదశ అనియే అర్థము చెప్పవలసిన అవ సర మేమున్నది? దేవమానదశాపద్ధతిలో, ఈ వయస్సునకు చలితరాహువు గండాంతఫలమును చూపు టకు సమర్థుడై సిద్ధముగా నుండె నని కనుగొంటిమి. ఇది దశ కాదా ?

"సంవత్సర మహోరాత్రం
రేమే జానంతి మనీషిణః."

(భూపాలుడు)

అను వాక్యమున నిర్వచించబడిన జ్యోతిశ్శాస్త్ర ధర్మముపై నాధారపడినదే ఈ దేవమానదశాపద్ధతి. చక్రభ్రమణము (*Rotary motion*), పరిభ్రమణము (*Revolutionary motion*) అను రెండు రకముల గతులు మన భూమి కున్నవి. ఒకదాని ఫలము మానవ మానముతో అహోరాత్రము, రెండవదాని ఫలము దేవ మానముతో అహోరాత్రము. అనగా, మానవమాన ములో సంవత్సర మనుట. ఈ రెండింటికి గల పరస్పర సంబంధమే ఈ దశాపద్ధతికి మూలాధారము. దేవమాన దినములో ౩౬౦ వ వంతు కదా మానవమానదినము ? అట్లే మానవమానదినములో ౩౬౦ వ వంతు (అనగా, మధ్యలగ్నము భచక్రములో ఒక్క భాగ జరుగుటకై పట్టు ౧౦ విఘడియల కాలము) సూక్ష్మమానదినముగా భావించబడుచున్నది. ఒక మానవమానదినములో చార వశమున గ్రహస్థానములలో కలుగు మార్పులవలని ఫలము జాతకునికి ఒక్క సంవత్సరకాలములో ఫలము నిచ్చును. ఇదే దేవమానదశ. దీనినే పాశ్చాత్యశాస్త్ర జ్ఞులు *Secondary Progression* అని అందురు. సూక్ష్మమానదినములో మధ్యలగ్నచలనమువలన కలుగు మార్పులు సయితము జాతకున కొక్క సంవత్సరఫల మును సూచించును. ఈ పద్ధతికే 'ఏకాంశవర్ష పద్ధతి' అని వ్యవహారము. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు దీనిని (*Primary Progression*) అని అందురు. ఈ పద్ధ తులను గూర్చియు, వానివలన సాధించు శుభాశుభఫల ములనుగూర్చియు పాశ్చాత్యదేశములలో విపులమైన గ్రంథజాల మున్నది. అది అట్లుండె.

దేవమానపద్ధతి ననుసరించి చలితరాహువు ఇపుడు దశలో దుష్టు డయ్యె నని కనుగొంటిమి. పైన వ్రాసిన పరాశరసూత్రము సాయనలగ్నమునకు బాగుగా ఫలించిన దనుటకు ఇది తార్కాణ.

హంతకుడు తుపాకిగుండు ప్రేల్చిన వేళలో దేహళీనగరమందు పూర్వహారిజము (*Horizon*) లో ఉదయించుచుండిన భచక్రభాగ కర్కాటకరాశిఅంత్య భాగమందలి గండసంధియే యనుట చదువరులు మరచి యుండరు. గుండు తగిలినప్పటి తాత్కాలికలగ్నమును మహాత్ముని చలితరాహువు ఎదుర్కొని ఆలింగన మొనర్చుకొనుచున్నట్టు చూపట్టుచుండలేదా ?

మరియొక తార్కాణము. మృత్యుస్థానము దున్న గురువు నాశ్రయించి లగ్నాధిపతియగు కుజుని వేధించగలిగినపుడు కదా రాహువు తన మార కత్వధర్మమును నెరవేర్చగలుగుట ? చూడుడు—

| | భా | కల |
|---|---|---|
| జన్మగురుస్థానము ... ... | ౩౦–౧౦ | వృషభం |
| జన్మకుజునికి సమసప్తక వేధాస్థానముగా | –౨౮ | ,, |
| పై రెండింటి అంతరము ... ... | ౧–౪౬ | |

| | |
|---|---|
| పై అంతరములో మధ్యభాగము అనగా, గురుసంయోగ కుజ జేతలు ఫలించగల స్థానము | ౧౯-౧౬ వృషభం |

---

అవసాన వేళలో రాహు వుండుట నిశ్చయముగా వృషభరాశిలో ౧౯ భాగల ౧౬ కలలయందే అని గమనించితిమేని రాహువుకైవాటము మనకు స్పష్టముగా కానరాగలదు.

ఇంకొక్క వింత. సింహరాశిలో ౮ వ భాగలో కదా జన్మరాహు వుండుట? మారకుడైన రాహువుయొక్క కార్యములో ౮ వ సంఖ్యకు ఎంత విలువయున్నదో పరిశీలింపుడు. హంతకుడు ప్రేల్చిన తుపాకిగుండ్లు నాలు గని వార్తాపత్రికలు ఘోషించుట మరచియుండరు. జన్మకాలములో మారకత్వాధికారము గల మహారాహువుయొక్క ముఖమునుండి వెడలు విషవాయువులచే సింహరాశిలో ఎన్నిభాగలు విషదిగ్ధము లయ్యెనో, అన్ని తుపాకిగుండ్లు మాత్రమే ప్రేలుట! ఏమి దైవచిత్ర మిది!

సింహరాశి ౮ వ భాగలో నున్న రాహువునకు ఇంత అర్థమున్నదా అని యింకను సందేహించువారుండకపోరు. అట్టివారికి ఒక చిన్న మనవి. రాహువును మారకు డంటిమిగాని, ఆకాశరంగమునుండి తుపాకి చేతబట్టుకొని ఆ మహారాహువే డేహాలీనగరమునకు దిగి వచ్చి మహాత్మున కెదురుగా నిల్చి తుపాకి గుండ్లు కాల్చినా డనుకొనగలమా? హంతకుని ప్రేరేపించినా డనవచ్చును. కాని, అదియును జాతకగ్రహముల మూలముననే జరుగవలసియున్నది కదా? హంతకుని జాతకమున దుష్టమైన చలితకుజగ్రహము సింహరాశిలో ౮ వ భాగకు వచ్చినప్పుడే ఈ ఘోరకృత్యము జరిగిన దని విన్నచో పాఠకమహాశయులు ఆశ్చర్యపడక మానరు. ఇంతే కాదు. హత్యాదోషవిచారణ తరువాత న్యాయాధిపతి తీర్పు చెప్పుట ౧౦-౨-౧౯౪౯ వ తేదీ నాడు ఉదయము ౧౧-౩౦ A. M. (I. S. T.) కాలములో అని పత్రికలలో చదివితిమి. అప్పటి లగ్నాధిపతి శుక్రుడు కుంభరాశి ౮ వ భాగలో దశమకేంద్రమధ్యమందే నిలిచియుండెను. జాతకములో హత్యాసహమాధిపతి ఈ శుక్రుడే! మహాత్ముని జన్మరాహువుపై కూర్చుండి స్వారిచేయుచున్న హంతకుని చలితకుజునకు ఎదురుగా (౧౮౦ డిగ్రీలు) ఈ శుక్రుడు నిలుచుకొనియుండి న్యాయాధిపతి చెప్పిన తీర్పును విన్నాడనుట! సింహరాశి ౮ వ భాగయందలి రాహువు మాహాత్మ్యము శిక్షతీర్పుకాలములో సయితము మనకు కానవచ్చుచున్నది! ఇంత చాలదా?

ఎంత వల దనినను వ్యాసము పెరిగిపోయినది. పాఠకమహాశయుల క్షమ నర్థించుచు ఇప్పటి కింతతో విరమింతును. హంతకమహాశయుని జాతకముతో ప్రకృతవిషయమునకు గల సంబంధమునుగూర్చి ఇంకొక్కతూరి చర్చింతము గాక!

"తం సంతః శ్రోతుమర్హంతి
సదసద్వ్యక్తిహేతవః,
హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపివా."

(కాళిదాసు)





# ఆశాజ్యోతి

[కథానిక]

శ్రీ గోపీచంద్

నిలువుబొట్టుకుమల్లే వెలుగుతున్న దీపానికి కొడి కట్టింది. కాంతి తగ్గింది. కొడి రాలుద్దామని ఆమె దీపం దగ్గరకు వెళ్లింది. కాని తీరా దగ్గఱకు వెళ్లేటప్పటికి ఆమెకు భయం వేసింది. చితిలో కూర్చున్న సీతమ్మవారికిమల్లే కూర్చుని వుంది కొడి. కొడి రాలిస్తే దీపం బాగా వెలుగుతుంది. నిజమే. కాని కొడిని రాల్చే ప్రియత్నంలో దీపానికే మోసం రావచ్చు. దురాశ దుఃఖానికి చేటు. ఆమె కొడిని రాల్చలేకపోయింది. తనెవరు కొడి రాల్చడానికి? కొడిఅవసరం దీపానిది. ఆ పని దీపమే చూచుకుంటుంది. విడిపోవటమే మంచి దనుకున్నప్పుడు కొడి తనంతట తానే విడిపోతుంది. ఆ పాపాన్ని తనెందుకు వొడికట్టాలి, వున్నవి చాలక?

గీసిన అగ్గిపుల్లకోసం వెతికింది. గీసి వేసిన అగ్గిపుల్లతో వొత్తి పెద్దది చేసింది. పెరికిన తోటకూరకాడకుమల్లే వొత్తి వాలి పోయింది. కోపగించినట్లు దీపం చిటపట చిటపట మంది. ఆరిపోయిందే అనిపించింది. ఆమె గుండె గుభేలు మన్నది. ఆవురు ఆవురు మంటూ పసివాడిదగ్గరకు వెళ్లింది. వాడికి రెండో నెల, గుండె జలుబు. మూసిన కన్ను తెరవటం లేదు. వేసిన చెయ్యి కదల్చటం లేదు. చాచిన కాలు ముడవటంలేదు.

దీపం ఆరలేదు. వాడు కదల్లేదు.

ఆమెకళ్లు చెమ్మగిల్లినై. జీవితం పామై తరుముతూ వుంది ఆమెని.

ఆమెభర్త మరణించాడు. ఈ పసివాడు కడుపున పడటం, ఆమెభర్త మరణించటం వొకేసారి జరిగినై. అప్పుడే తను ఆత్మహత్య చేసుకుందాం అనుకుంది. కాని తన కడుపులో కదిలే ప్రాణాన్ని వొదిలిపెట్టలేక పోయింది. తను ఆత్మహత్య చేసుకుందాం అనుకున్నప్పుడల్లా కడుపులో వూపిరి సలప నట్లు తన్నుకునేవాడు. తనకు జాలివేసేది. ఆ ప్రియత్నం మానుకుంది. వీడికోసమే తను బ్రితికింది.

"అమ్మా!"—మంచంమీద ఆమెకు ఎదురుగా కూర్చున్న కూతురు పలకరించింది. ఆమెకు భయంవేసింది. పలకలేక పోయింది.

"అమ్మా"—కూతురు మళ్లీ పలకరించింది. ఆ పిల్లకు ఆరో ఏడు. పట్టిన పట్టు విడవదు. ఆమె మాట పెకలించింది- "ఏం తల్లీ?"

"చిట్టిబాబుకి జబ్బు కాదూ?"-అడిగింది కూతురు.

"అవు నమ్మా" అని, కూతురు ఇంకేమి అడుగుతుందో అని ప్రాణాలు బిగబట్టుకొని కూర్చుంది.

"నయం అవుతుందిలే అమ్మా. విచారం పెట్టుకోకు" అంది కూతురు.

ఆమెకు ప్రాణం లేచి వొచ్చింది. "నయం అవుతుందా అమ్మా?"

"తప్పకుండా నయం అవుతుంది".

"మా అమ్మే" అని పిల్లని వొళ్లోకి తీసుకుంది; గట్టిగా కావిలించుకుంది. ఆమె వొళ్లు గగుర్పొడిచింది. పాలు చేపుకి వొచ్చినై. కళ్లు నీళ్లు కమ్మినై. రవికె తడిసింది. కన్నీళ్లు వొలికినై.

"తప్పకుండా నయం అవుతుందా అమ్మా?" ఆతురతగా అడిగింది కూతుర్ని.

"ఔ"

"మా అమ్మే!" పరవశత్వంతో కళ్లు మూసుకుంది. హద్దులు సురిగినై. అంచులు కరిగినై. కొలుకులనిండా కన్నీరు. లోకమంతా జలమయం. ఆ మయంలో మర్రి ఆకు, ఆ ఆకుమీద పసిపాప. కళ్లు తెరిచేటప్పటికి మంచంలో వున్న పసివాడు శేషతల్పశాయిలా కనుపించాడు.

చలిగాలి వేసింది. గాలి తగలకుండా పసివాడికి గుడ్డ కప్పింది. బొట్టుబొట్టుగా మందు పోసింది. చంటివాడు చప్పరించాడు.

"చూశావటే అమ్మా, చిట్టిబాబు వేషాలు. ఏమీ ఎరగనట్టు కళ్లు మూసుకొని గుటుక్కున తాగివేశాడు" అన్నది కూతురు.

ఆమె చిరునవ్వు నవ్వింది. కూతురు తల నిమిరింది.

గోడనున్న గడియారం టంగుటంగున గంటలు కొట్టింది.

ఆ గడియారం తను కొత్తగా కాపరానికి వొచ్చినప్పుడు కొన్నది. ఎంత కాలం గడిచింది, ఎన్ని మార్పులు వొచ్చినై! కాని అదిమాత్రం ఒకే రకంగా తిరుగుతూ వుంది. ఉదయం ఆరుగంటలనుంచి సాయంత్రం ఆరుగంటలు, సాయంత్రం ఆరు గంటలు మొదలుకొని మళ్లీ ఉదయం ఆరుగంటలు ఈవిధంగా తిరుగుతూనే ఉంది. మార్పు లేదు. అలవాటై అనుకోటమేగాని, జీవితంలో మార్పుకీ, కాలానికీ ఏమి సంబంధం? కాలం గడవటం అని అవసరం కొద్దీ అనుకుంటాం గాని, కాలానికి గడవటం అనేది ఎక్కడుంది? ఉన్నదేదో వుంది. అసలు కాలం అనేదే లేదు.

తన భర్తకు ఆ గడియారం అంటే చాలా ఇష్టం. నమ్మకం. దాన్ని బట్టే నడిచారు జీవితంఅంతా. ఆయన బ్రతికి వున్నంతకాలం అదికూడా ఆయనకోసమే ఆడుతున్నట్టు ఆడేది. ఇప్పుడు తనకోసమే తను ఆడుతున్నట్టు నటిస్తూ వుంది. ఎంత వంచన! ఇతరులను ఇంత వంచించి బ్రతక్కపోతే ఏమో. అది గంటలు కొట్టినప్పుడల్లా "నాకోసమే నేను ఆడుతున్నాను, నాకోసమే నేను ఆడుతున్నాను" అంటున్నట్లు వినిపిస్తుంది తనకి. తన భర్తను జ్ఞాపకం చేస్తుంది. ఆయన వొట్టి అమాయకుడు. అందర్నీ ఇట్లాగే నమ్మేవాడు. అందరికోసం తను పనిచేస్తూ వుండబట్టి. ఇప్పు[illegible] ఏమనుకొని ఏమి ప్రయోజనం?

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?" అ[illegible] అడిగింది కూతురు.

అందరూ తనకోసమే పనిచేస్తున్నారు అనుకునేవాడు. ఇంత మోసం ఉంటుం దని ఆయనకేం తెలుసు అయినా.

"ఏమీ లేదమ్మా" అని చెప్పింది ఆమె. కాని కూతురు ఆమెమాటలు నమ్మి నట్టు లేదు.

"నువ్వు కాస్సేపు పడుకో — అమ్మా" అంది.

"నాపడక్కి ఏమొచ్చిందిలే తల్లీ!"

"నిన్న కూడా నిద్దర లేదు."

"పరవాలేదులే అమ్మా"

"మాకు జబ్బుచేస్తే నువ్వు చూస్తావు. నీకు జబ్బుచేస్తే ఎవరు చూస్తా రమ్మా?"

"భగవంతుడు" అనబోయింది. కాని కూతురు "నిన్ను చూసే భగవంతుడు నన్ను మాత్రం చూడడలే" అంటుందేమోనని, ఆపుకొని "నువ్వు పడుకో అమ్మా" అన్నది. "నాకు జబ్బు చెయ్యదులే తల్లీ" అన్నది. ఈ జవాబు కూతురికి నచ్చలేదు. "చిట్టిబాబుని నేను చూస్తాగా. నువ్వు పడుకో అమ్మా" అన్నది. "వొద్దుగాని, నువ్వు వెళ్లి పడుకో".

"అబ్బ! నాకు నిద్దర రావటం లేదే" అంది కూతురు. అని మెదలకుండా కూర్చుంది. ఈలోగా ఏమి ఆలోచించిందో, కాసేపయింతరువాత మళ్లీ అందుకుంది.

"చూడమ్మా, చిట్టిబాబుకి ఇంత జబ్బు చేసిందా - మనం కాబట్టి సరిపోయింది... నాన్నగారే వుంటే— ఎంత గందరగోళపడే వారే" అన్నది.

ఆమె మాట్లాడలేదు. ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది. కూతురు చెప్పింది నిజం. పిల్లలకు కొంచెం జబ్బుచేస్తే ఆయన మనిషి మనిషిగా వుండేవారు కాదు. తను కంగారు పడేవారు. తనని కంగారు పెట్టేవారు. ఇల్లంతా కంగారు కంగారు చేసేవారు. గడియ గడియకీ "నయం అవుతుందా?" అని తనని అడిగేవారు. బిక్కమొహం పెట్టుకొని దీనంగా అడిగేవారు. ఆయన్ని చూస్తే తనకు జాలి వేసేది. లాలించ బుద్ధయ్యేది.

"నయం అవుతుంది" అని చెప్పేది తను.

"తప్పకుండా నయం అవుతుందంటావా?" అని అడిగేవారు.

కాస్త అనుమానంగా చెపితే ఏమై పోతారో అని తనకు భయం వేసేది. "తప్పకుండా నయం అవుతుంది." అని చెప్పేది.

"నిజం చెప్పు" అని అడిగేవారు.

తను నిజం చెప్పాలట.

"నిజమేనండీ. తప్పకుండా నయం అవుతుంది. నామాట అబద్ధమేమో తెల్లవారేప్పటికి చూడండి. తగ్గకపోతే అప్పుడు అడగండి" అని తనతో చెప్పించుకొనిగాని వొదిలేవారు కాదు.

తనకు ఈ ఇద్దరు బిడ్డల నందునా ఒక కొడుకు పుట్టిపోయాడు. ఆరోజుల్లో ఆయన ఎంత బాధపడ్డాడు! తనకు ఆస్పత్రిలో చేరటం ఇష్టంలేదు. వాళ్లకు కాన్పు చెయ్యటం తెలుసుగాని పసికూనల్ని పెంచటం తెలియదు. ఆముదం పెట్టనివ్వరు. ఎంత చలిగాలి వీస్తున్నా సరే, తలుపులన్నీ బార్లగా తీసి ఉంచుతారు. అందుకని తనకు ఆస్పత్రికి వెళ్లటం ఇష్టంలేదు. ఆయనకు ఆస్పత్రి అంటే నమ్మకం. డాక్టరు అంటే నమ్మకం. ఆయనకోసం చేరింది. ఆ కాన్పు చాలా కష్టం అయింది.

ఆస్పత్రిలో చేరటమే మంచిదయింది అనిపించింది తనకు. కాని ఆరో రోజు పిల్లవాడుపోయాడు. ఆయనదుఃఖం ఏం చెప్పను? ఆస్పత్రిఆవరణలో ఆ పెద్ద చెట్టుక్రింద

ఒంటరిగా దిగాలుపడి నుంచున్న ఆయన్ను చూస్తే కడుపు తరుక్కుపోయింది. తను ధైర్యం చెప్పి ఇంటికి తీసుకురావలసివచ్చింది.

"ఆస్పత్రికి వెళ్లకుండా వుంటే బ్రతికే వాడేమో". అన్నారు. వెళ్లటమే మంచిది అయిం దని తాను ఎంతో సర్ది చెప్పింది. కాని ఆయనమనస్సుకి కలిగిన గాయం మాన్పలేకపోయింది.

"ఇటువంటివన్నీ మనకే జరుగుత య్యెందుకనో?" అన్నారు.

"మనకే ఎందుకు జరుగుతయ్యి లెండి. మన కష్టాలు గనక మనకు తెలుస్తున్నయ్యి" అన్నది తను. తన ప్రవర్తన ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. ఇంత మొండి మనస్సేమో అనుకున్నారో ఏమో. పాపం, ఆయన కేం తెలుసు తన బాధ. మనస్సులో తను పడిన బాధ ఆయన చూచి ఉంటేనా?

... ... ...

దీపం వెలుగుతూ వుంది. కొడి పెరుగుతూ వుంది. దీపం తన్ను తాను హరించు కొంటూ లోకానికి వెలుగు నిస్తూ వుంది. కొడి తాను పెరుగుతూ కాంతిని తగ్గిస్తూ వుంది. కొడిస్వభావం దీపానికి తెలుసు. కాని దాన్ని సృష్టించుకోకుండా ఊరుకోదు. ఆ సృష్టివల్ల తనకు ప్రాణాపాయం కలిగినా సరే. ఎదుగూబొదుగూ లేకుండా చిరకాలం బ్రతికిందానికంటే కదులుతూ, వెలుగుతూ ఆనందంగా ఒక్కక్షణం బ్రతికినా చాలు. అందుకు తన్ను తాను కాల్చుకుంటుంది. కొడి కట్టించుకుంటుంది. ప్రాణంమీదకు తెచ్చుకుంటుంది. జీవితం క్షణభంగురం చేసుకుంటుంది.

దీపం కుంకుమబొట్టు అయింది. వొత్తికి నూనె అందటం లేదు అనుకుంది ఆమె. లేచి పాదుల్లో నీళ్లు పోసినట్లు ప్రమి దెలో నూనె పోసింది. మెదలకుండా వెళ్లి పసివాడిదగ్గర కూర్చుంది. వాళ్లో మార్పు కనిపించింది. కదిలాడు. ఒక్క కదలటమేనా? గుప్పెట మూస్తున్నాడు, తెరుస్తున్నాడు. ఆమె చూచింది. "చూశావా అమ్మా, బాబు ఏం చేస్తున్నాడో" అన్నది కూతురుతో సంతోషం పట్టలేక.

"ఆడుకుంటున్నాడే" అన్నది కూతురు.

తల్లి పసివాని చెయ్యి నిమురుతూ కూర్చుంది.. ఆమెచూపుడువేలు తన గుప్పెట్లో పట్టుకున్నాడు పసివాడు. వొద లడు. ఆమెకి వొదిలించుకోవాలని లేదు. ఆలాగే కూర్చుంది.

పసివాడు వున్నట్లు వుండి కళ్లు తెరి చాడు. ఎంత తెలివిగా చూశాడని! తల్లిని గుర్తుపట్టినట్టే చూశాడు. యుగయుగాల నుంచీ ఆమెకోసం వెతుకుతున్నట్టూ, నేటికి వాడి కోర్కె తీరినట్లూ చూశాడు. తను కళ్లు తెరిచింది ఆమెను చూట్టానికే అన్నట్లు చూశాడు. ఆమె కంట పడగానే వాడి కళ్లు మిలమిలా మెరిసినై. తమలో తాము నవ్వుకున్నై.

"ఏరా నాతండ్రీ! ఏమిట్రా? దేన్ని చూచు కొనిరా ఈ మురిపెం?" అని అడిగింది ఆమె.

"అమ్మరా" అని జ్ఞాపకం చేసింది వాడి అక్క. వాడు కులికాడు. ఆ కులుకులో అమ్మచెయ్యి వొదిలాడు. గుప్పెట మొహాని కేసి రుద్దుకున్నాడు.

'ఛీ, ఛీ, ఛీ, ఛీ' అని వాణ్ణి నవ్వించ టానికి ప్రయత్నించింది వాళ్ల అక్క.

నిజంగా వాడు నవ్వాడు. ఆ నవ్వుకి ధ్వని

లేదు. వాడు బయటికి నవ్వలేదు. లోపలే నవ్వుకున్నాడు. మబ్బు పట్టి ఉరమకుండా తేలిపోయినట్టు వుంది వాడి నవ్వు. లోపల నవ్వుకున్న ఆ నవ్వుకి వాడి వొళ్లంతా నవ్వింది. డొక్కలు ఎగరవేశాడు. ఉండేలు బద్దకుమల్లే పైకి లేచాడు ఊ అంటూ.

"ఊరుకోరా తండ్రీ. పడుకో" అని బ్రతిమాలింది తల్లి.

"చూశావా అమ్మా, నామాట నమ్మక పోతివే" అంది కూతురు.

"ఏమిటి తల్లీ?

"బాబుకి నయం అయింది."

ఆమెవొళ్లు ఝల్లుమన్నది. నిరాకారంగా వొళ్లంతా వ్యాపించివున్న ఆమె భయానికి ఆకారం ఏర్పడింది.

"నయం అవుతుందా తల్లీ?" గద్గద స్వరంతో అడిగింది.

'ఓ' అన్నది కూతురు.

"తప్పకుండా నయం అవుతుందా ?"

"తప్పకుండా నయం అవుతుందే."

"నిజంగానా ?" అని అడగబోయింది. మాట నోటిదాకా వచ్చింది. భర్త జ్ఞాపకం వొచ్చాడు. ఆయన తన్నీవిధంగానే అడిగే వారు. ఆమెకు లజ్జ కలిగింది. శరీరం రస వాహినిగా మారింది.

భర్త కనిపించాడు.

ఆమె కొత్త పెళ్లికూతు రైంది.

"కులాసాగా వున్నావా ?" అని అడిగాడు.

"మీకు తెలియదూ ?"

"తెలుసు."

"అవిటి బ్రతుకైంది అన్నిటికీ."

"అలా అనుకోకు."

"దేనిమీద ఆశ పెట్టుకొని అనుకోకుండా వుండేది ?"

"నేను చెప్పింది మరచిపోయావా ?"

"ఏమిటి ?"

"కష్టమనీ సుఖమనీ, చావనీ బ్రతుకనీ— ఇవన్నీ పెట్టుకోగూడదు. ఈ ప్రపంచంలో ఒక మనిషి కష్టపడటం, సుఖపడటం, పుట్టడం చావటం ఇవేవీ చెప్పుకో తగ్గ విషయాలు కావు. అంటీ అంటకుండా బ్రతకటమే జీవితాన్ని జయించటం."

"అవును."

"ఏమిటి అవును?"

"జ్ఞాపకం వుంది."

"జ్ఞాపకం వుండంటే చాలదు. నీవు జ్ఞాపకం వుంచుకునేదానివీ, అది జ్ఞాపకం వుండేదీ — ఈ భేదం వున్నంతకాలం చిక్కే. నీవే జ్ఞాపకం, జ్ఞాపకమే నువ్వు కావాలి."

"నేనే జ్ఞాపకం. జ్ఞాపకమే నేను."

అతను అంతర్ధానం అయ్యాడు. రస వాహిని శరీరంగా మారింది. దీపం గుప్పుమంది. కాని ఆరలేదు. కొడి పెరిగింది. కాని విరగలేదు. ఆమె చూచింది. కాని దృష్టి నిలవలేదు. అదొక దీపం. దాని కొక వొత్తి. వొత్తి కొక కొడి. ఇదొక మంచం. దాని మీద గుడ్డలు. గుడ్డల్లో పసివాడు. వాడికి జబ్బు. ఎదురుగా కూతురు. కూతురుకి ఎదురుగా తను, ఇల్లా దేనికి దాన్ని చూడలేక పోయింది. ఇవన్నీ కలిస్తే ఏమవుతుందో అదే జీవితం అనిపించింది. అదేదో ఒకటి వుంది అనిపించింది...

కూతురు కునుకుతూ వుంది.

"తల్లీ!" తల్లి లేపింది.

కూతురు బరువుగా రెప్పలు తెరిచింది.

"పడుకో అమ్మా. నిద్దర కాయలేవు."

కూతురు కళ్లు నులుపుకొని 'కాస్తేనే' అంది.

"వినమ్మా, బబ్బు చేస్తుంది."

"మరి నీకో?"

"నేను పెద్దదాన్ని."

"నేను మాత్రం పెద్దదాన్ని కాదటే. చూడు, బాబు కంటే ఎంత పెద్దనో" అని మంచంమీదనుంచి లేచి నుంచుంది.

"పెద్దతనం అంటే అదికాదు తల్లీ."

"మ రింకేమిటి?"

"నువ్వు నిజంగా పెద్దదానివై తే అప్పుడు తెలుస్తుంది."

కూతురు మాట మార్చింది. "బాబు ఎంచక్కా నిద్దరపోతున్నాడే." అన్నది.

"వాడికి వాళ్ల నాన్న గుణం వొచ్చింది."

"నాకో?"

"అమ్మగుణం."

కూతురికి పడుకో బుద్ధయింది.

తల్లికి అర్థం అయింది.

తనలో తాను నవ్వుకుంది. నా తల్లిదీ వాళ్ల నాన్నగుణమే అనుకుంది.

కూతురు పడుకుంది. కాలువా కప్పుకుంది. మధ్యలో ఏమి జ్ఞాపకం వొచ్చిందో నేను అన్నట్టే అయింది. "చిట్టిబాబుకి నయం అవుతుంది" అన్నాను. అయింది. "రేపు నాబాబుకి నేనే నీళ్లుపోస్తా, కాళ్లమీద పడుకోబెట్టుకొని. రేపు నాకు సున్నిఉండలు చేసిపెట్టవటే?"

మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్రపోయింది. పిల్లల పని అంతే.

ఆమె పసివాడికి కప్పినగుడ్డ సర్దింది.

వొంటిమీద చెయ్యి వేసి చూసింది. బుగ్గలు నిమిరింది. ఆలోచనలో పడింది. తన తండ్రి..తన తల్లి...తన అన్నలు. అన్నల పెళ్లిళ్లయి తన పెళ్లి కాకముందే తండ్రి మరణించాడు. తండ్రి గతించగానే అన్నలు వేర్లు పడ్డారు. వాళ్ల జీవితాలు వేరైనై. తల్లినీ, తననీ పరాయివాళ్లని చూచినట్లు చూసేవారు. తన తల్లి తనమీద ఆశ పెట్టుకొని జీవించింది. తనని ఒకాయన చేతుల్లో పెట్టి తప్పుకుంటా ననేది. తనకు వివాహం అయింది. అప్పటినుంచీ తన కడుపున ఒక కాయ పడితే చూడా లని ఆశపడేది. అంతకంటే ఇక ఏ కోరికా లే దనేది. తనకు కూతురు కలిగింది. మలిచూలు మగబిడ్డ అని ఆశపడేది. మనమరాలిపెళ్లి చూడాలని ఆశపడేది. అంతకంటే ఏకోరికా లే దనేది. కాని అప్పటిదాకా వుంటే మునిమనుమణ్ణి చూడాలని తప్పకుండా ఆశపడేది. ఆశకు అంతు లేదు. జీవితానికి పునాదే ఆశ. జీవించటం అంటేనే ఆశపడటం. ఆ జ్యోతి సర్వకాలసర్వావస్థలయందూ వెలుగుతూనే వుంటుంది. తన భర్త అంటూవుండేవాడు. దేనికోసం బ్రతకటం అనే ప్రశ్న అర్థం లేని ప్రశ్న. బ్రతకటమే ఆనందం.

కొడి రాలింది. దీపం మెరిసింది. మెరవటంలో కొలనులోని కలువపువ్వులా మెరిసింది. ఛళ్లున తెల్లవారింది.

---

# అవధి

శ్రీ కలపటపు రామగోపాలరావు

దిక్కుల కళ్ల నెత్తురుల దీధితు లెక్కెను, బ్రక్క వార్నిధుల్
గ్రక్కె నహంకృతుల్, గగనకంపన నట్టిటు లాడి మబ్బులన్
రిక్కలు త్రుళ్లె, నాటవికరీతులు రేగిన పుస్సురంచు నీ
వెక్కడి కింక పాంథ పయనించెద వర్ధనిమీలితాత్ములన్ ?

వేదుల గాడ్పులం దుసురు ప్రేలు యెడారి యిహాన నెందరో
స్వోదరపోషణార్థులయి, సోదరమానవహోమకుండమం
దేదో విభూతి నెత్తుకొన నెంచెదు బుద్ధులె పెద్దలైన, నిం
కేదయ! ధర్మమున్ దయయు నెందుల కీపయ నప్రయానముల్ ?

పోయెను పాపభీతి, విడిపోయెను ముప్కురనీతి, మాయమై
పోయెను శాంతి, వ్యర్థమయి పోయెను దేవుడు పడ్డపాట్లు, వా
పోయెను భూతధాత్రి, నరిపోయెను పొట్టకు జీవితార్థ, మై
పోయెను మానవామరమహోదయస్వప్నమహాస్నమాధిగాన్.

ఒక్కతరమ్ములోనె రణహోమము లయ్యెను రెండు, చాల కిం
కొక్క తరమ్మె నాహుతిగ గోరెడు రాక్షసి శాస్త్రబుద్ధి తై
తక్కల నాడు గుండియలు దద్దరిలంగను యెండి మండునే
డొక్కలు సాక్కి సోల, లయడోలిక లాడ ద్విపాదరాసులన్.

మనిషికై యెన్నో మారులు మారి మారి-యవతరించిన దేవుడే యలసిపోయి,
మార్చు లేనట్టి దిక హతమార్చు బూని-నట్టులుండిన, నింకేటి యాశ పాంథ!

పడి లేచుచు తరతరముల-సుడులను జడజంగమముల శోధించుచు నో
బడుగా! యిపు డెచ్చటికీ-వడి యన పాంథుండు మధురవాక్కుల ననిమెన్.

ఓయి, సొంతము తనులిప్త నొక్కటైన-గడుపలే దింత నేమేమొ కాలజీవ
నావధులగూర్చి, దేవుని భావిగూర్చి-యర్భకావేశభీతుల నాడె దిటుల.

మాదిరి దప్పి మానవు లమానుషవృత్తి జరింప, జెల్లినన్,
కాదగు పూరుషార్థ మది కాదగునే పరమార్థ మింక నీ
మేదిని లేదె, సిల్వపయి మేను కరంగిన గుండె నెత్తురుల్
బూదయిపోయెనే, ఋషులు బుద్ధులు నూరక పుట్టిపోయిరే!

